శ్రీ ర స్తు

# కు మా ర సం భ వ ము

## ప్ర థ మ స ర్గ ము.

---

శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాన్తయే.

శ్లో. అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః,
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య స్థితః పృథివ్యా ఇవ మానదణ్డః. 1

అవతారిక. పూజ్యుఁ డగు కాళిదాస మహాకవి కుమారసంభవ మను కావ్యమునుఁ జేయఁ దలఁచి కావ్య ముఖప్రాయము లగు ఆశీర్వచన నమస్కార వస్తునిర్దేశములను మూఁడింటిలో నీ కావ్యమునఁ జెప్పఁబోవు ప్రయోజనమున కనుగుణముగా హిమవన్నగ రూపమగు వస్తువును జెప్పుచున్నాఁడు.—

టీక. ఉత్తరస్యాం దిశి=ఉత్తర దిక్కునందు, దేవతాత్మా = దేవతాస్వరూపుఁ డగు, (దేవతాస్వరూపుఁ డని చెప్పుటచే మేనకాదేవిని పెండ్లి యాడుట పార్వతీదేవిని గనుట మున్నగు చేతనవ్యవహారమున కర్హ్హత సూచనము చేయఁబడినది.) హిమాలయో. నామ = హిమవత్పర్వతమనే ప్రసిద్ధి గల, నగాధిరాజః = కొండలఱేఁడు, అస్తి = కలఁడు. (ఆపర్వతముయొక్క యాధిక్యము నే చెప్పుచున్నాఁడు.) పూర్వాపరౌ=పూర్వ పశ్చిమ దిశల, వారినిధీ = సముద్రములను, విగాహ్య = చొచ్చుకొని, పృథివ్యాః = భూమియొక్క, మానదండ ఇవ=కొలచెడు కఱ్ఱయో యనునట్లున్నది.

తాత్పర్యము. ఉత్తర దిక్కునందు తూర్పు పడమర సముద్రములలోఁ జొచ్చుకొన్న కొనలు గలయట్టియు దేవతామూర్తియు నగు హిమవత్పర్వత మను నొక్క పర్వతములరాజు కలఁడు. కావున నే పొడవునుఁ బట్టి భూమికిఁ గొలకఱ్ఱయో యన్న ట్లుండెనని యుత్ప్రేక్షించి కవి చెప్పినాఁడు.

## వ్యాఖ్యానపీఠికా.

మాతాపితృభ్యాం జగతో నమో వామార్ధజానయే,
సద్యోదక్షిణదృక్పాతసంకుచద్వామదృష్టయే.
అన్తరాయతిమిరోపశాన్తయే శాన్తపావనమచిన్త్యవైభవమ్,
తం నరం వపుషి కుఞ్జరం ముఖే మన్మహే కిమపి తున్దిలం మహః.
శరణం కరవాణి శర్మదం తే చరణం వాణి చరాచరోపజీవ్యమ్,
కరుణామసృణైః కటాక్షపాతైః కురుమామమ్బ కృతార్థసార్థవాహమ్.
ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా,
నామూలం లిఖ్యతే కిఞ్చిన్నానపేక్షితముచ్యతే.
భారతీ కాళిదాసస్య దుర్వ్యాఖ్యా విషమూర్ఛితా,
ఏషా సంజీవనీ వ్యాఖ్యా తామద్యోజ్జీవయిష్యతి.

అవ. అథ తత్రభవాన్ కాళిదాసః కుమారసంభవాఖ్యం కావ్యం చికీర్షుః 'ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్' ఇతి శాస్త్రాత్ కావ్యాదౌ వక్ష్యమాణార్థానుగుణం వస్తు నిర్దిశతి.—

వ్యా. అస్తీతి. ఉత్తరస్యాందిశి - అనేనాస్య దేవభూమిత్వం సూచ్యతే-దేవతా ఆత్మా అధిష్ఠాతా యస్య సః - ఏతేనాస్య వక్ష్యమాణ మేనకాపరిణయ పార్వతీజననాది చేతనవ్యవహారయోగ్యత్వసిద్ధిః సూచితా, హిమస్యాలయః స్థానమితి హిమాలయః - హిమాలయో నామ హిమాలయ ఇతి ప్రసిద్ధః, అధికో రాజాఽధిరాజః. సూ. 'రాజాహస్సఖిభ్యష్టచ్' న గచ్ఛంతీతి నగా అచలాః- తేషాం అధిరాజో నగాధిరాజోఽస్తి, కథంభూతః, పూర్వాపరౌ పూర్వపశ్చిమౌ - వారినిధీ సముద్రౌ, విగాహ్య ప్రవిశ్య, అతఏవ పృథివ్యా భూమే ర్మానం హస్తాదినా పరిచ్ఛేదః, భావే ల్యుట్-తస్య దణ్డః - యద్వా - మీయతే ఽనేనేతి మానమ్, కరణే ల్యుట్-స చాసౌ దణ్డశ్చ స ఇవ స్థితః, ఆయామపరిచ్ఛేదకదణ్డ ఇవ స్థిత ఇత్యర్థః. పూర్వాపరసాగరావగాహిత్వం చాస్య హిమాలయస్యాస్త్యేవ, ఉక్తం చ బ్రహ్మాండపురాణే.— 'కైలాసో హిమవాంశ్చైవ దక్షిణే వర్షపర్వతౌ, పూర్వపశ్చిమగావేతావర్ణవాన్తరుపస్థితౌ.' అత్ర హిమాలయస్యోభయాబ్ధివ్యాప్తి సామ్యాన్మానదణ్డత్వే నోత్ప్రేక్షణా దుత్ప్రేక్షాలఙ్కారః. 'ప్రకృతేఽప్రకృతగుణక్రియాభిసంబంధాదప్రకృతత్వేన ప్రకృతస్య సంభావనముత్ప్రేక్షా' ఇత్యలఙ్కారసర్వస్వకారః. అస్మిన్ సర్గే ప్రాయేణ వృత్తముపజాతిః - క్వచిదిన్ద్రవజ్రోపేన్ద్రవజ్రే చ - తల్లక్షణం తు.— 'స్యాదిన్ద్రవజ్రా యది తౌజగౌగః

ఉపేన్ద్రవజ్రా జతజా స్తతో గౌ, అనన్తరోదీరితలక్ష్మభాజౌ పాదౌ యదీయావుపజా
య స్తాః.' ఇతి.

యం సర్వశైలాః పరికల్ప్య వత్సం మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే,
భాస్వన్తిరత్నాని మహౌషధీశ్చ పృథూపదిష్టాం దుదుహుర్ధరిత్రీమ్.2

అవ. ఈ పర్వతము పురాణ ప్రసిద్ధ మైనదనియు సకలైశ్వర్య సంపన్నమైన
దనియు పదియారు శ్లోకములచే హిమవత్పర్వతమునే వర్ణించుచున్నాఁడు.—

టీ. సర్వ శైలాః = సమస్త పర్వతములును, యం=ఏ హిమవంతుని, వత్సం=
దూడను గా, పరికల్ప్య = చేసి, దోహ దక్షే; దోహ = పితుకుటయందు, దక్షే =
సమర్థుఁ డగు, మేరౌ=మేరుపర్వతము, దోగ్ధరి = పితుకువాఁడుగా, స్థితే = ఉండఁగా,
పృథూపదిష్టాం—పృథు=పృథువను రాజుచే, ఉపదిష్టాం = (ఇట్టి దని) చెప్పంబడిన,
(గోరూప ధరాం = గోవు రూపముఁ దాల్చిన,) ధరిత్రీం = భూమిని, భాస్వన్తి =
ప్రకాశించెడు, రత్నాని=రత్నములను, మహౌషధీ శ్చ=గొప్ప (సంజీవిని మున్నగు)
ఓషధులను, దుదుహుః=పిదికిరి.

తా. తొల్లి పృథుచక్రవర్తి భూమిదేవియొక్క మాయా గోరూ
పమును స్పష్టపఱుపగా కొండ లన్నియు గోరూపమైన భూమిని హిమ
వంతుని దూడనుగాఁ జేసి మేరు పర్వతమును గొల్లవానిని గాఁ జేసి
కాంతివంతములగు రత్నములను ఓషధులను పిదికించిరి. (దీనివలన
సర్వరత్నములకు నీపర్వత మునికి యని తెలియును. దీనిచే శైలరాజ
త్వము స్థిరపడినది).

అవ. ఇతఃపరం షోడశభిశ్శ్లోకై స్తిమాద్రిం వర్ణయతి. తత్ర నగాధిరాజత్వం
నిరోహ్యధుమాహ.—

వ్యా. యమితి. సర్వే చ తే శైలాశ్చ సర్వశైలాః 'పూర్వకాలైకసర్వజరత్పు
రాణ నవకేవలాస్సమానాధికరణే' నేతి సమాసః. యం హిమాలయం వత్సం పరికల్ప్య
విధాయ దోహదక్షే దోహనసమర్థే మేరౌ దోగ్ధరి స్థితే సతి, యస్య చ భావేన భావ
లక్షణమితి సప్తమీ, పృథూపదిష్టాం పృథునా వైన్యేనోపదిష్టా మాదృక్తయా ప్రద
ర్శితాం ధరిత్రీం గోరూపధరామితి శేషః-'గౌర్భూత్వాతు వసుంధ'రేతి విష్ణుపురాణాత్-
అకథితం చేతి కర్మత్వం, భాస్వన్తి చ భాస్వత్యశ్చ భాస్వన్తి ద్యుతిమన్తి ఓషధివిశేషణం
చైతత్, 'నపుంసకమనపుంసకేన' ఇత్యాదినా నపుంసకైకశేషః. రత్నాని మణీన్ జాతి
శ్రేష్ఠవస్తూని చ. ని. 'రత్నం శ్రేష్ఠే మణావపీ'తి విశ్వః. 'జాతౌ జాతౌ యదుత్కృష్టం

తద్రత్నమితి కథ్యతే' ఇతి యాదవః. మహౌషధీశ్చ సంజీవనీప్రభృతీశ్చ క్షీరత్వేన పరిణతా ఇతి శేషః. 'తాః క్షీరపరిణామినీ'రితి విష్ణుపురాణాత్-దుదుహుః, దుహియాచీత్యాదినా దుహేర్ద్వికర్మకత్వం. అత్ర ప్రయోజకత్వేఽపి శైలానాం-పంచభిర్హాలైః కర్షతి గ్రామం గ్రామణీ రితివత్ - తత్సమర్థాచరణాత్ కర్తృత్వేన వ్యపదేశః, దుహేస్స్వరితేత్త్వేఽప్యకర్త్రభిప్రాయవివక్షాయాం పరస్మైపదం. అత్రార్థే ప్రమాణం.— శ్లో. 'గౌర్భూమిరచలా స్సర్వే కర్తారోఽత్ర పయాంసి చ, ఓషధ్యశ్చైవ భాస్వన్తి రత్నాని వివిధాని చ, వత్సశ్చ హిమవానాసీద్దోగ్ధా మేరుర్మహాగిరి'రితి-ఏతేన వత్సస్య మాతుః ప్రేమాస్పదత్వాదస్య సారగ్రాహిత్వం గమ్యతే. తథా చాస్య నగస్య రత్నవిశేష భోక్తృత్వాన్నగాధిరాజత్వం యుక్తమితి భావః. అత్ర హిమవద్వర్ణనస్య ప్రకృతత్వాత్తద్గతౌషధిరత్నానాం ద్వయానామపి ప్రకృతత్వాత్తేషాం దోహనక్రియారూపసమానధర్మసంబన్ధాదౌపమ్యస్య గమ్యత్వాత్ కేవలప్రాకరణికవిషయస్తుల్యయోగితానామాలఙ్కారః. తదుక్తం.— 'ప్రస్తుతానాం తథాఽన్యేషాం కేవలం తుల్యధర్మతః, ఔపమ్యం గమ్యతే యత్ర సా మతా తుల్యయోగి' తేతి. న చాత్ర రూపకపరిణామాద్యలఙ్కారశఙ్కా కార్యా, తేషామారోపమూలత్వాత్, హిమహేమాచలాదిషు వత్సత్వదోగ్ధృత్వాదీనామాగమసిద్ధత్వే నానారోప్యమాణత్వాదితి.

అనన్తరత్నప్రభవస్య యస్య హిమం న సౌభాగ్యవిలోపి జాతమ్,
ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణేష్వివాంకః. 3

అవ. ఎంత సౌభాగ్య మున్ననేమి? మంచను దోషముతో నిండినపిమ్మట ఎంత చక్కనివాఁడయిన నేమి? బొల్లిరోగము గలవాఁ డనిరాగా సమర్థించుచున్నాఁడు.—

టీ. అనన్తరత్నప్రభవస్య—అనన్త=అంతము లేని, రత్న = రత్నములకు, ప్రభవస్య=ఉత్పత్తి కారణమైన, యస్య=ఏ హిమవంతునికి, హిమం = మంచు, సౌభాగ్యవిలోపి = చక్కఁదనముఁ దక్కువ పఱచునది, న జాతం = కాలేదు. హి=ఎందువలన, ఏకః దోషః = ఒక్క తప్పు, గుణ సన్నిపాతే = సద్గుణ సమూహమునందు, ఇందోః = చంద్రునియొక్క, కిరణేషు = కిరణములయందు, అంక ఇవ = కళంకము వలె, నిమజ్జతి = అడఁగుచున్నది.

తా. అనేక సద్గుణములు గలవారి కొకానొక దుర్గుణము పరిగణనమునకు రాఁ జాలదు. చంద్రున కనేక శుభగుణములకు నడుమనున్న కళంకమునకు నింద వచ్చెనా? అట్లుగానే యోషధులు రత్నములు మున్నగునవి నిండియుండి యలంకరించు హిమవంతునికి మంచా శోభను తగ్గించునది కాఁ జాలక పోయెను.

అవ. నను హిమాదిదోషదూషితస్య తస్య అత్యన్తమనభిగమ్యత్వాచ్ఛిన్నస్త్రిణ ఇవ సర్వమపి సౌభాగ్యం విఫలమిత్యాశఙ్క్యాహ.—

వ్యా. అనన్తేతి. ప్రభవత్యస్మాదితి ప్రభవః-కారణం, అనన్తానామపరిమితానాం రత్నానాం శ్రేష్ఠవస్తూనాం-ప్రభవస్య యస్య హిమాద్రేః హిమం కర్తృసుభగస్య భావః సౌభాగ్యం, 'హృద్భగసింధ్వంతే పూర్వపదస్య' చేత్యుభయపదవృద్ధిః. తద్విలుంపతీతి సౌభాగ్యవిలోపి సౌన్దర్యవిఘాతకం న జాతం నాభూత్. తథాహి - ఏకోదోషః గుణ సన్నిపాత ఇన్దోః కిరణేష్వంక ఇవ నిమజ్జతి - అన్తర్లీయత ఇత్యర్థః. నహి స్వల్పో దోషోఽమితగుణాభిభావక ఏవ కింతు కశ్చిదిన్దుకళంకాదివత్ గుణైరభిభూయతే, అన్యథా సమస్తరమ్యవస్తుహానిప్రసంగాదితి భావః. అత్రోపమానుప్రాణితోఽర్థాంతర న్యాసోఽలఙ్కారః. తల్లక్షణంతు.— 'జ్ఞేయస్సోఽర్థాంతరన్యాసో వస్తుప్రస్తుత్య కించన, తత్సాధనసమర్థస్య న్యాసో యోఽన్యస్య వస్తునః' ఇతి.

యశ్చాప్సరోవిభ్రమమణ్డనానాం సంపాదయిత్రీం శిఖరైర్బిభర్తి,
వలాహకచ్ఛేదవిభక్తరాగామకాలసన్ధ్యామివ ధాతుమత్తామ్. 4

టీ. చ = మఱియు, యః = ఏ హిమవంతుఁడు, అప్సరో విభ్రమమండనానాం—అప్సరః=అప్సరాంగనలయొక్క, విభ్రమ = విలాసార్థములగు, మండనానాం= అలంకారములయొక్క, (అప్సరోవిభ్రమమండనానాం—అప్సరః=అచ్చరలయొక్క, విభ్రమ = భ్రాంతి తోడి, మండనానాం = భూషణములను,) సంపాదయిత్రీం=సమకూర్చెడు నట్టియు, వలాహకచ్ఛేద విభక్తరాగాం—వలాహక = మేఘములయొక్క, ఛేద = ఖండములయందు, విభక్త = సంక్రమింపఁబడిన, రాగాం=ఎఱుపు గలది యగు, ధాతుమత్తాం=గైరికాది రంజక ద్రవ్యములు కలిగియుండుటను, అకాలసంధ్యామివ—అకాల=కాలముకానివేళ సంప్రాప్తమగు, సంధ్యామివ = సంధ్యాకాలమునువలె, శిఖరైః=శృంగములచే, బిభర్తి=వహించుచున్నది.

తా. ఆ హిమవత్పర్వతమున శిఖరములయందున్న సిందూరాది రంజకద్రవ్యములు తమకాంతిని యాకసమున వ్యాపింపఁ జేయుటచే తునకలుగానున్న మేఘములయందు రక్తవర్ణ మల్లుకొని సంధ్యాకాలము కాకున్నను సంధ్యాభ్రాంతిని గల్గించ రాత్రి భోగ సమయముల కలంకారము జేసి కొనుటకు వేళ యతిక్రమించె నని యచ్చరలు వ్యత్యాసముచే తొందరపాటు వలన నలంకరించి కొనుచుందురు. మేఘమండలపర్యంతము శిఖరము లున్నవనియు, గైరికాది

ధాతువు లున్నవనియు, దేవతా మిథునము లలంకరించుకొను సామ గ్రులతో నగ్గిరియందే కాఁపురములఁ జేయుచున్నారనియు భావము. వ్యత్యాసముగా నలంకరించికొను టనఁగా తొందరచే నొక్కచోట ధరించునది మరియొక్కచోట ధరించుట.

వ్యా. యశ్చేతి. కించేతి చకారార్థః-యో హిమాద్రిః-అప్సరసాం విభ్రమమణ్డనాని విలాసాలంకరణాని-అథవా విభ్రమో విపరీతన్యాసః. వి. 'విభ్రమస్త్వరయాఽకాలే భూషాస్థానవిపర్యయే' ఇతి దశరూపకాత్. తేన మణ్డనాని తేషాం సంపాదయిత్రీం, ఏతద్ధాతురాగదర్శిన్యోఽప్సరసః సద్యో విభ్రమేణ ప్రసాధనాయ త్వరంత ఇతి భావః. తథాత్వే భ్రాంతిమదలంకారో వ్యజ్యతే. 'కర్తృకర్మణోః కృ'తీతి కర్మణి షష్ఠీ. వారిణాం వాహకాః వలాహకాః మేఘాః-పృషోదరాదిత్వాత్సాధుః. తేషాం ఛేదేషు ఖణ్డేషు విభక్తః సంక్రమితో రాగో యయా తాం, ఏతేనాద్రేరభ్రంకషత్వం గమ్యతే. ఇదం విశేషణద్వయం సన్ధ్యాయామపి యోజ్యం, ధాతవః సిందూరగైరికాదయోఽస్య సంతీతి ధాతుమాన్, నిత్యయోగే మతుప్ తస్య భావః ధాతుమత్తా తాం ధాతుయోగిత్వమితి సంబంధోఽపి వాచ్యార్థః, సమాసకృత్తద్ధితేషు సంబంధాభిధానం భావప్రత్యయే నేతి వచనాత్, లక్షణయా నిత్యానుషంగికధాతుమిత్యర్థః. అకాలసంధ్యామివ అనియతకాలప్రాప్తసంధ్యామివ శిఖరైశ్శృంగైః బిభర్తి ధత్తే. అత్ర సంధ్యాశబ్దస్య జాతివాచిత్వాజ్జాత్యుత్ప్రేక్షా.

ఆమేఖలం సఞ్చరతాంఘనానాం ఛాయామధస్సానుగతాం నిషేవ్య,
ఉద్వేజితా వృష్టిభిరాశ్రయన్తే శృఙ్గాణి యస్యాతపవన్తి సిద్ధాః. 5

టీ. సిద్ధాః=అణిమాది సిద్ధులును (దేవతలలో నొక్క తెగవారును), ఆ మేఖలం=కొండమధ్యప్రదేశమువఱకును, సంచరతాం=తిరుగులాడుచుండెడు, ఘనానాం = మేఘములయొక్క, అధస్సానుగతాం—అధస్సాను = క్రింది చరియలను, గతాం = పొందిన, ఛాయాం=నీడను, నిషేవ్య=అనుభవించి, వృష్టిభిః=వానలచేత, ఉద్వేజితాః= క్లేశపెట్టఁబడినవారై, యస్య=ఏ హిమవత్పర్వతముయొక్క, ఆతపవన్తి=ఎండలు గల, శృంగాణి=శిఖరములను, ఆశ్రయన్తే=ఆశ్రయించి యుందురు.

తా. సిద్ధులు హిమవత్పర్వతమునందు మేఘమండలమునకుఁ క్రింది భాగమున సూర్యుని వేఁడిమి తాకకుండుటకు నివసించి వర్షము కురియఁగా మేఘమండలమునకుఁ బైభాగముననున్న సూర్యాతపము గలశిఖరముల నాశ్రయింతురు. (ఆకొండశిఖరములు మేఘమండలము

నకుఁ బై భాగమునందు నున్నవి. ఇట్లు చెప్పుటచే హిమవంతముయొక్క-యౌన్నత్యము చెప్పఁబడినది.)

వ్యా. ఆమేఖలమితి. సిద్ధా - అణిమాదిసిద్ధా దేవయోనివిశేషాః. ని. 'పిశాచో గుహ్యకస్సిద్ధో భూతోఽమీ దేవయోనయః' ఇత్యమరః. ఆమేఖలాభ్య ఆమేఖలం నితంబపర్యంతం. ని. 'మేఖలాఖడ్గబంధే స్యాత్కాంచీశైలనితంబయో'రితి విశ్వః. 'ఆఙ్మర్యాదాభివిధ్యో'రిత్యవ్యయీభావః. సంచరతాం ఘనానాం మేఘానామధస్సానూని మేఘమండలాదధస్తటాని గతాం ప్రాప్తాం 'ద్వితీయాశ్రితాతీతపతితగతాత్యస్తప్రాప్తాపన్నైః' ఇతి సమాసః. ఛాయామనాతపం. ని. 'ఛాయా సూర్యప్రియా కాంతిః ప్రతిబింబమనాతపః' నిషేవ్య వృష్టిభిః ఉద్వేజితాః క్లేశితాస్సంతః. ని. 'ఉద్వేగః స్తిమితే క్లేశే భయే మంథరగామి'నీతి శబ్దార్ణవః. యస్య హిమాద్రేః ఆతపవంతి సాతపాని శృంగాణి ఆశ్రయంతే ఆశ్రిత్య స్థితా ఇత్యర్థః, అతిమేఘమండలమస్యౌన్నత్యమితి భావః.

పదం తుషారస్రుతిధౌతరక్తం యస్మిన్నదృష్ట్వాఽపి హతద్విపానాం,
విదన్తి మార్గం నఖరన్ధ్రముక్తైర్ముక్తాఫలైః కేసరిణాం కిరాతాః. 6

టీ. యస్మిన్=ఏ హిమవత్పర్వతమందు, కిరాతాః = కిరాతులు, తుషారస్రుతిధౌతరక్తం - తుషార = మంచుయొక్క, స్రుతి=స్రావముచే, ధౌత = కడుగఁబడిన, రక్తం=రక్తముగల (ఆకారణముచేతనే యగపడని), హతద్విపానాం - హత=చంపఁబడిన, ద్విపానాం=ఏనుఁగులుగల, కేసరిణాం = సింహములయొక్క, పదం = మార్గపుగుఱుతును, అదృష్ట్వాపి = చూడకున్నను, నఖరంధ్రముక్తైః - నఖ = గోళ్లయొక్క, రంధ్ర = దోనెలచే, ముక్తైః = వదలఁబడిన, ముక్తాఫలైః = ముత్తెములచేత, మార్గం = త్రోవను, విదన్తి = తెలిసికొందురు.

తా. ఆ హిమవత్పర్వతమునందు సింహముల వేఁటలాడుబోయలు తత్కాలముననే గజములఁ జీల్చి రక్తాంకితమగు పాదములతోఁ బోయిన మార్గము ననుసరించి పోయి కొంత దూరములో మంచుచే రక్తము కరఁగి పోయి యాజాడ కానరాకున్నను దోనెలవంటి గోళ్లలో నంటి యున్న యేనుఁగ కుంభస్థలములయందలి ముత్తెములు సింహమార్గముననే ప్రోవులు పడియుంటచే నా గురుతునుబట్టి సింహములను వేఁటాడుదు రని భావము. (ఈ కొండయందు గజములు సింహములు మున్నగు మహాజంతువు లున్నవనియు వానిని, వేఁటలాడుబోయ లుండి రనియుఁ దాత్పర్యము.)

వ్యా. పదమితి. యస్మిన్ హిమాద్రౌ కిరాతాస్తుషారస్రుతిభిః హిమనిష్యందైః ధౌతం క్షాలితం రక్తం శోణితం యస్య తత్తథోక్తం,అతో దుర్గ్రహమితి భావః. హతా ద్విపాగజా యైస్తేషాం హతద్విపానాం, కేసరిణాం సింహానాం పదం పాదప్రక్షేపస్థానమదృష్ట్వాఽపి నఖరంధ్రైః నఖద్రోణిభిర్ముక్తైః ముక్తాఫలైః మార్గం విదంతి జానంతి, అత్ర వ్యాధాః సింహఘాతినో గజేంద్రాశ్చ ముక్తాకరా ఇతి భావః. 'కరీంద్రజీమూతవరాహశంఖమత్స్యాహి శుక్త్యుద్భవవేణుజాని, ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాం తు శుక్త్యుద్భవమేవ భూ'రీతి.

న్యస్తాక్షరా ధాతురసేన యత్ర భూర్జత్వచః కుఞ్జరబిన్దుశోణాః,
ప్రజన్తి విద్యాధరసున్దరీణామనఙ్గలేఖక్రియయోపయోగమ్. 7

టీ. యత్ర=ఆ హిమవత్పర్వతమునందు, ధాతురసేన - ధాతు=సిందూరాదిగైరికద్రవ్యములయొక్క, రసేన = ద్రవముచేత, న్యస్తాక్షరాః - న్యస్త = (ఉంచఁబడిన) వ్రాయఁబడిన, అక్షరాః = వర్ణములుగలవియు, కుంజరబిందుశోణాః - కుంజర = ఏనుఁగులయొక్క, బిందు=(యౌవన ప్రాదుర్భావమువలనఁ బుట్టిన) దద్దురువలెను, (మచ్చ), శోణాః=ఎఱ్ఱనివగు, భూర్జత్వచః = భుజపత్రపట్టలు, విద్యాధరసుందరీణాం = విద్యాధరాంగనలకు, అనంగలేఖక్రియయా-అనంగలేఖ=మన్మథజాబులయొక్క, క్రియయా= చేఁతచేత (పనిచేత), ఉపయోగం = ఉపయోగమును (పనికివచ్చుటను), వ్రజంతి = పొందుచున్నవి.

తా. హిమవత్పర్వతమున మదపుటేనుఁగుల పొడలవలె నెఱ్ఱని రంగుగల భుజపత్రపట్టలను సిందూరాది ద్రవద్రవ్యముతో వ్రాసి విద్యాధరాంగనలు తమప్రియులకు మన్మథలేఖలనుగా నంపి యుపయోగింతురు. (ఈకొండ దేవతాస్త్రీవిహారయోగ్యమని తాత్పర్యము.)

వ్యా. న్యస్తాక్షరేతి. యత్ర హిమాద్రౌ ధాతురసేన సిందూరాదిద్రవేణ. ని. 'శృంగారాదౌ విషే వీర్యే గుణే రాగే ద్రవే రసః' ఇత్యమరః. న్యస్తాక్షరాః లిఖితవర్ణాః. అత ఏవకుంజరస్య యే బిందవః వయోవిశేషభావినః - పద్మకాఖ్యాః. ని. 'పద్మకం బిందుజాలక'మిత్యమరః. తద్వచ్ఛోణా రక్తవర్ణాః, లిఖితభాగేష్వితి శేషః. భూర్జత్వచో భూర్జపత్త్రవల్కలాని. ని. 'భూర్జపత్త్రో భుజో భూర్జో మృదుత్వక్చర్మికా అపీ'తి యాదవః. విద్యాధరసుందరీణాం లిఖ్యంతే యేషు తే లేఖాః పత్రికాః - అనంగస్య లేఖాః తేషాం క్రియయా కామవ్యంజకలేఖకరణేనేత్యర్థః. ఉపయోగం ఉపకారం వ్రజంతి, దివ్యాంగనావిహారయోగ్యోఽయం శైల ఇతి భావః.

యః పూరయన్ కీచకరన్ధ్రభాగాన్ దరీముఖోత్థేన సమీరణేన,
ఉద్గాస్యతామిచ్ఛతి కిన్నరాణాం తానప్రదాయిత్వమివోపగన్తుమ్.

టీ. యః=ఆ హిమవంతుఁడు, దరీ ముఖోత్థేన - దరీ=గుహ యను, ముఖ = నోటినుండి, ఉత్థేన = వెడలిన, సమీరణేన=గాలిచేత, కీచకరంధ్రభాగాన్ - కీచక = బొంగు వెదుళ్లయొక్క, రంధ్ర = బొక్కలయొక్క, భాగాన్ = ప్రదేశములను, పూరయన్ = నింపుచున్నవాఁడై, ఉద్గాస్యతాం = ఉన్నతమైన గాంధారగ్రామమునఁ బాడుచున్న, (మనుష్యులు షడ్జగ్రామమునను మధ్యమగ్రామమునను గానము సేయుదురు. గాంధారగ్రామమున గానము సేయలేరు. అట్టి గాంధారగ్రామమున గానము సేయునట్టివారు దేవయోనులే. షడ్జ మధ్యమ గాంధారగ్రామములకు గ్రామత్రయమని సంగీతశాస్త్రమునం దున్నది.) కిన్నరాణాం = కిన్నరులను దేవయోని విశేషులకు, (కిన్నరులకు మోము మనుష్యాకారము గల్గి దేహము గుఱ్ఱమువలె నుండును. వీరు దేవతలలో ముఖ్యముగా సంగీతపాఠకులు) తానప్రదాయిత్వం = తానము నిచ్చువాఁడగుటను, (అనఁగా శ్రుతి నిమిత్తముగా సన్నాయి వాయించువానితో మఱియొక్కఁడూఁదెడు సన్నాయినిఁ బోలియుండు వెదురుబొంగు నూఁదువాఁ డగుటను) ఉపగంతుం=పొందుటకు, ఇచ్ఛతీవ=కోరుచున్నాఁడో యనున ట్లొప్పును.

తా. ఎచ్చుస్థాయియగు గాంధారగ్రామమునఁ బాడుచున్న కిన్నరులకు హిమవత్పర్వతమునందలి బొంగువెదుళ్లలో దూరి శబ్దముచేయుచున్న గాలిచే నాకిన్నరులకు శ్రుతి వేయువాఁడా యనునట్లుగా హిమవత్పర్వత ముండెనుట.

వ్యా. యఇతి. యో హిమాద్రిః-దరీగుహా - సైవ ముఖం తస్మా దుత్థేనోత్పన్నేన, 'ఆతశ్చోపసర్గే' ఇతి కప్రత్యయః. సమీరణేన వాయునా కీచకా వేణువిశేషాః. ని. 'వేణవః కీచకాస్తే స్యుర్యే స్వనంత్యనిలోద్ధతాః' ఇత్యమరః. తేషాం రంధ్రభాగాన్ ఛిద్రప్రదేశాన్ పూరయన్ ధమన్ వాంశికోఽపి వంశరంధ్రాణి ముఖమారుతేన పూరయతీతి ప్రసిద్ధిః, ఉద్గాస్యతాం దేవయోనిత్వా దుచ్చైర్గాంధారగ్రామేణ గానం కరిష్యతాం, ఉక్తంచనారదేన.—'షడ్జమధ్యమనామానౌ గ్రామౌ గాయంతి మానవాః, నతు గాంధారనామానం స లభ్యో దేవయోనిభి'రితి. కిన్నరాణాం దేవగాయకానాం తానప్రదాయిత్వం, తానోనామ స్వరాంతరప్రవర్తకో రాగస్థితిప్రవృత్త్యాదిహేతు రంశాపరనామా వంశవాద్యసాధ్యః ప్రధానభూతః స్వరవిశేషః. వి. 'తానస్త్వంశస్వరో మతః' ఇత్యభినవగుప్తః. 'గాతాయంయం స్వరం గచ్ఛేత్తం తం వంశేన తానయే' దితి

భరతః. తత్ప్రదానశీలత్వం - తాన్ప్రదాయిత్వం - వాంశికత్వముపగంతు మిచ్ఛతీ వేత్యుత్ప్రేక్షా. సా చ దరీముఖోత్థేనేత్యేకదేశవివర్తిరూపకోజ్జీవితా, ముఖసాధ్యత్వాత్తాన ప్రదాయిత్వస్య,యత్రావయవరూపణాదవయవిరూపణం గమ్యతే తదేకదేశవివర్తిరూపకం, గమ్యతే చాత్రావయవినః పుంసోరూపణం యచ్ఛబ్దనిర్దిష్టే హిమాద్రావిత్యలం బహునా.

కపోలకణ్డూః కరిభిర్వినేతుం విఘట్టితానాం సరళద్రుమాణామ్,
యత్ర స్రుతక్షీరతయా ప్రసూతస్సానూని గన్ధస్సురభీకరోతి. 9

టీ. యత్ర = ఆ హిమవత్పర్వతమునందు, కపోలకండూః = చెక్కులదురదను, వినేతుం = పోఁగొట్టుకొఱకు, కరిభిః = ఏనుఁగులచే, విఘట్టితానాం = రాయఁబడిన, సరళద్రుమాణాం = దేవదారువృక్షములయొక్క, స్రుత క్షీరతయా-స్రుత=కాఱిన, క్షీరతయా = పాలుగలవి యగుటచేత, ప్రసూతః = పుట్టఁబడిన, గంధః=పరిమళము, సానూని=చఱియలను, సురభీకరోతి=సువాసన గలవానినిగాఁ జేయును.

తా. ఆ హిమవత్పర్వతమునందు చెక్కిళ్లదురదలు పోవుట కేనుఁగులు దేవదారువృక్షములకు రాచికొనఁగా ఆ చెట్లనుండి పాలుకాఱి ఆ పరిమళము చఱియలను వ్యాపించుచుండును. (ఇట్లు చెప్పుటచే నీపర్వతము శ్రేష్ఠమగు దేవదారు మున్నగువృక్షములకును గజములకు నుత్పత్తిస్థానమని తెలియవలయును.)

వ్యా. కపోలేతి. యత్ర హిమాద్రౌ కరిభిః గజైః కపోలకండూర్గండస్థలకండూతీర్వినేతుం అపనేతుం విఘట్టితానాం ఘర్షితానాం సరళద్రుమాణాం సంబంధి స్రుతాని కరికపోలఘర్షణాత్ క్షరితాని క్షీరాణి యేషాం తేషాం భావస్తత్తా తయా హేతునా ప్రసూత ఉత్పన్నో గంధస్సానూని సురభీకరోతి, ఏతేనాస్య గజాకరత్వం గమ్యతే. తథాచ గజాయుర్వేదే.—'హిమవద్వింధ్యమలయా గజానాం ప్రభవా నగాః' ఇతి.

వనేచరాణాం వనితాసఖానాం దరీగృహోత్సఙ్గనిషక్తభాసః,
భవన్తి యత్రౌషధయో రజన్యామతైలపూరాస్సురతప్రదీపాః. 10

టీ. యత్ర = ఆ హిమవత్పర్వతమునందు, రజన్యాం = రాత్రియందు, దరీగృహోత్సంగనిషక్తభాసః - దరీ=గుహాలను, గృహ = ఇండ్లయొక్క, ఉత్సంగ = లోపలి భాగములయందు, నిషక్త = ఆవరింపఁబడిన, భాసః = కాంతులుగల, ఓషధయః=ఓషధులు, వనితా సఖానాం-వనితా = అనురాగముగల స్త్రీలకు, సఖానాం= స్నేహితులగు (ఆస్త్రీలతో భోగించు), వనేచరాణాం = కిరాతులకు, అతైలపూరాః=

తైలస్రావ మక్కఱలేని, సురతప్రదీపాః-సురత=సంభోగమందలి, ప్రదీపాః=దీపములు, భవన్తి=అగుచున్నవి.

తా. ఆ హిమవత్పర్వతగుహాలయందు రాత్రుల క్రీడలఁ దేలు కిరాతులకు తృణజ్యోతిస్సులే దీపము లగుచున్నవి.

వ్యా. వనేచరాణామితి. యత్ర హిమాద్రౌ రజన్యాం దర్యః కందరా ఏవ గృహాః తేషాముత్సంగేషు అభ్యంతరేషు నిషక్తాస్సంక్రాంతా భాసో యాసాం తా ఓష ధయః తృణజ్యోతీంషి, వి. 'అగ్నావోషధీషు చ తేజో నిధాయ రవిరస్తం యాతీ త్యాగమః' వనితానాంసఖాయో వనితాసఖాః. సూ. 'రాజాహస్సఖిభ్యష్టచ్' తేషాం రమమాణానామిత్యర్థః. వనే చరంతీతి వనేచరాః కిరాతాః, 'చరేష్టః' ఇతి టప్రత్య యః. 'తత్పురుషేకృతిబహుళ' మిత్యలుక్. తేషాం వనేచరాణాం అతైలపూరాః - అనపేక్షితతైలసేకా ఇత్యర్థః. సురతేసురతకర్మణి ప్రదీపా, భవన్తి - అత్రౌషధీష్వారో ప్యమాణస్య ప్రదీపత్వస్య ప్రకృతసురతోపయోగిత్వాత్పరిణామాలంకారః. తదు క్తమ్.—'ఆరోప్యమాణస్య ప్రకృతోపయోగిత్వేపరిణామః' ఇతి. తథా ప్రదీపకారణ తైలపూరణనిషేధాదకారణకార్యోత్పత్తిలక్షణా విభావనా చేత్యుభయోస్సంసృష్టిః.

ఉద్వేజయత్యఙ్గుళిపార్ష్ణిభాగాన్ మార్గే శిలీభూతహిమేఽపి యత్ర,
న దుర్వహశ్రోణిపయోధరార్తా భిన్దన్తి మన్దాం గతిమశ్వముఖ్యః.

టీ. యత్ర=ఆ హిమవత్పర్వతమున, శిలీభూతహిమే - శిలీభూత = పేరుకున్న, హిమే=మంచు కలది గనుకనే, అం...గాన్ - అంగుళి=వ్రేళ్లయొక్క, పార్ష్ణిభాగాన్= వెనుకభాగములను (మడమలను), ఉద్వేజయత్యపి = క్లేశపెట్టునది యైనను, దుర్వహ శ్రోణిపయోధరార్తాః - దుర్వహ = వహింప శక్యముకాని, శ్రోణి = పిఱుఁదులచేతను, పయోధర=స్తనములచేత, ఆర్తాః=పీడితులరగు, అశ్వముఖ్యః = కిన్నరస్త్రీలు, మన్దాం గతిం=మందగమనమును, నభిన్దంతి=మారుపుఁజేయరు.

తా. ఆ హిమవత్పర్వతమున పేరిన మంచుగడ్డలచే కాళ్లవ్రేళ్ల కును మడమలకు క్లేశమగుచున్నను పెద్దవియగు పిఱుఁదులయొక్కయుఁ గుచములయొక్కయు బరువుచే కిన్నరాంగనలు మందగమనమును మానరైరి.

వ్యా. ఉద్వేజయతీతి. యత్రహిమాద్రౌ శిలీభూతం ఘనీభూతం హిమం యత్ర తస్మిన్ అతఏవాంగులీనాం పార్ష్ణీనాంచ భాగాన్ ప్రదేశాన్ ఉద్వేజయత్యతిశైత్యాత్

క్లేశయత్యపి మార్గే, శ్రోణయశ్చ పయోధరాశ్చ శ్రోణిపయోధరం, ప్రాణ్యంగత్వా దేకవద్భావః. దుర్వహేణ దుర్ధరేణ శ్రోణిపయోధరేణార్తాః పీడితాః, అజూర్వాద్వృ చ్ఛతేః క్తః, 'ఉపసర్గా దృతిధాతా' వితి వృద్ధిః. అశ్వానాం ముఖానీవ ముఖాని యాసాం తాః అశ్వముఖ్యః కిన్నరస్త్రియః ఉష్ట్రముఖవత్సమాసః. ని. 'స్యాత్కిన్నరః కింపురుష స్తురంగవదనో మయుః' ఇత్యమరః. మందాం మన్థరాంగతిం నభిందంతి న త్యజంతీత్యర్థః. పాదపీడాకరేఽప్యతిభారభంగురశరీరతయా న శీఘ్రం గంతుం శక్యత ఇతి భావః.

దివాకరా ద్రక్షతి యో గుహాసు లీనం దివాభీతమివాన్ధకారమ్,
క్షుద్రేఽపి నూనం శరణం ప్రపన్నే మమత్వ ముచ్చైశ్శిరసాం సతీవ.

టీ. యః=ఆ హిమవత్పర్వతము, దివా=పగలు, భీతమివ=భయపడినదోయన్నట్లు (దివాభీతమివ = గుడ్లగూబనుంబోలె), గుహాసు=గుహాలయందు, లీనం = అణంగిన, అన్ధకారం = చీంకటిని, దివాకరాత్ =సూర్యునినుండి, రక్షతి=కాపాడుచున్నాండు. (నీచులను రక్షించుట యుక్తము కాదని రాంగాం జెప్పుచున్నాండు.) ఉచ్చైః శిరసాం = గొప్పవారికి, శరణం ప్రపన్నే=శరణుంజొచ్చిన, క్షుద్రేఽపి=నీచునియందును, సతీవ= సజ్జనునియందువలె, మమత్వం=మమకారము, అస్తి=ఉన్నది.

తా. ఆ హిమవత్పర్వతము తనగుహాలయందు సూర్యునిచే భీతినొందిన చీంకటిని కాపాడుచున్నది. గొప్పవానికి శరణన్న నీచునియందును సత్పురుషునియందువలె దయగలుగుట సహాజము.

వ్యా. దివాకరాదితి. యో హిమాద్రిః దివా దివసే భీతం భయావిష్టమివ, ఉలూకమివేతి చ ధ్వనిః- గుహాసు లీనం అన్ధకారం ధ్వాన్తం దివా దినం కరోతీతి దివాకరః తస్మాద్దివాకరాత్ 'దివా విభా నిశా ప్రభా భాస్కరాన్తా...' ఇత్యాదినా టప్రత్యయః. భీత్రార్థానాం భయహేతు 'రిత్యపాదానత్వాత్పంచమీ' రక్షతి త్రాయతే, నను క్షుద్ర సంరక్షణమనర్హమిత్యాశఙ్క్యాహ - క్షుద్ర ఇతి. ఉచ్చైః శిరసాం ఉన్నతానాం శరణం ప్రపన్నే శరణాగతే క్షుద్రే నీచేఽపి, సతి సజ్జన ఇవ నూనం మమత్వం మమాయమిత్యాభిమానః, అస్తీతి శేషః - మమశబ్దాత్త్వప్రత్యయః. అర్థాన్తరన్యాసోఽలఙ్కారః.

లాఙ్గూలవిక్షేపవిసర్పిశోభై రితస్తతశ్చన్ద్రమరీచిగౌరైః,
యస్యార్థయుక్తం గిరిరాజశబ్దం కుర్వన్తి వాలవ్యజనైశ్చమర్యః. 13

టీ. చమర్యః = చమరీమృగములు, ఇతస్తతః = ఇటునటు, లాంగూలవిక్షేపవిసర్పిశోభైః - లాంగూల = తోంకలయొక్క, విక్షేప = కదిలించుటలచేత, విసర్పి=

వ్యాపించిన, శోభైః=ప్రకాశముగలవియు, చంద్రమరీచిగౌరైః - చంద్ర=చంద్రుని యొక్క, మరీచి=కిరణములవలె, గౌరైః=తెల్లనివియగు, వాలవ్యజనైః=తోఁకలనెడు వింజామరములచే, యస్య=ఆ హిమవంతునియొక్క, గిరిరాజశబ్దం=కొండలఱేఁ డనెడి పేరును, అర్థయుక్తం = అర్థముతోఁ గూడుకొన్నదానినిగా, కుర్వన్తి=చేయుచున్నవి.

తా. ఆ హిమవత్పర్వతమున మాటికి చమరీమృగములు తోఁకల నిటు నటు నాడించుచు సంచరించు చుట్లుండె ననఁగా హిమవంతుఁడు కొండలఱేఁడు గాన చామరసేవ నందుచుండెనో యన్నట్లుండె ననుట. రాజులకు ఛత్రచామరాదులు రాజాంకములు కదా.

వ్యా. లాఙ్గూలేతి. చమర్యో మృగీవిశేషాః-ఇతస్తతో లాఙ్గూలాని వాలధయః. ని. 'పుచ్ఛోఽస్త్రీ లూమలాఙ్గూలే వాలహస్తశ్చ వాలధి' రిత్యమరః. తేషాం విక్షేపైర్విధూననైః విసర్పిణ్యో విసృమరాః శోభాః కాన్తయో యేషాం తైః-చన్ద్రమరీచిభిరివ గౌరైశ్శుభ్రైః, ని. 'గౌరః కరీరే సిద్ధార్థే శుక్లే పీతేఽరుణేఽపి చే'తి యాదవః. 'ఉపమానాని సామాన్యవచనై'రితి సమాసః. వాలవ్యజనైశ్చామరైర్యస్య హిమాద్రేర్గిరిరాజశబ్దం గిరిరాజ ఇతిసంజ్ఞామర్థయుక్తం అభిధేయవన్తం కుర్వన్తి, రాజానో హి ఛత్రచామరాది చిహ్నితా ఇతి భావః.

యత్రాంశుకాక్షేపవిలజ్జితానాంయదృచ్ఛయా కింపురుషాఙ్గనానామ్,
దరీగృహద్వారవిలమ్బిబిమ్బాస్తిరస్కరిణ్యో జలదా భవన్తి. 14

టీ. యత్ర=ఆ హిమవత్పర్వతమునందు, అంశుకాక్షేపవిలజ్జితానాం-అంశుక = వస్త్రములయొక్క, ఆక్షేప=లాగివైచుటచేత, విలజ్జితానాం=విస్తారలజ్జనుబొందిన, కింపురుషాంగనానాం = కిన్నరస్త్రీలకు, యదృచ్ఛయా=దైవవశముచేత, దరీగృహద్వారవిలంబిబింబాః - దరీగృహ = గుహలనెడిండ్లయొక్క, ద్వార = ద్వారములయందు, విలంబి=వ్రేలుచున్న, బింబాః = మండలములు గల, జలదాః = మేఘములు, తిరస్కరిణ్యః=తెరలు, భవన్తి=అగుచున్నవి.

తా. ఆ హిమవత్పర్వతమునందలి గుహాగృహములయందు స్త్రీల బట్టలను లాగి వైచునప్పుడు నాయకులకు మర్మాంగము లగపడకుండు నట్లువారిలజ్జను కాసి హఠాత్తుగా వచ్చిన మేఘములు స్త్రీలమానము కాపాడుటకు వేయఁబడినతెరలో యనునట్లు గుహాద్వారములయందు వ్రేలుచుండును. మేఘమండలము పొడవున గుహాలలో కిన్నరు లంగన

లతో సల్లాపములు చేయుచుందురనియు, వారికి వాకిళ్లలో తెఱలవలె మేఘము లుండుననియుఁ జెప్పుటచే హిమవంతుని యౌన్నత్యము వర్ణించుట.

వ్యా. యత్రేతి. యత్ర హిమాద్రౌ అంశుకాక్షేపేణ వస్త్రాపహరణేన విలజ్జితానాం కింపురుషాఙ్గనానాం కిన్నరస్త్రీణాం యదృచ్ఛయా దైవగత్యా దరీగృహద్వారేషు విలంబిబిమ్బా లమ్బమానమండలా జలదాస్తిరస్కరిణ్యో జవనికా భవన్తి. ని. 'ప్రతిసీరా జవనికా స్యాత్తిరస్కరిణీ చ సా' ఇత్యమరః. 'తిరసోఽన్యతరస్యా'మితి సత్వం, అత్ర జలదే ష్వారోప్యమాణస్య తిరస్కరిణీత్వస్య ప్రకృతోపయోగిత్వాత్పరిణామాలఙ్కారః.

భాగీరథీనిర్ఝరశీకరాణాం వోఢా ముహుః కంపితదేవదారుః,
యద్వాయురన్విష్టమృగైః కిరాతైరాసేవ్యతే భిన్నశిఖణ్డిబర్హః.

టీ. భాగీరథీనిర్ఝరశీకరాణాం-భాగీరథీ = గంగయొక్క, నిర్ఝర = ప్రవాహముయొక్క, శీకరాణాం = తుంపురులయొక్క, వోఢా=వహించునట్టియు, ముహుః = మాటికి, కంపిత దేవదారుః - కంపిత = కదల్పఁబడిన, దేవదారుః = దేవదారుచెట్లు గలదియు, భిన్నశిఖండిబర్హః-భిన్న = విప్పఁబడిన, శిఖండి = నెమళ్లయొక్క, బర్హః పింఛముగలదియునగు, య ద్వాయుః=ఆ హిమవత్పర్వతముసంబంధమగుగాలి,' అన్విష్ట మృగైః - అన్విష్ట=వెదకఁబడిన, మృగైః=జంతువులుగల, కిరాతైః=కిరాతులచే, ఆసేవ్యతే=అత్యంతము సేవింపఁబడుచున్నది.

తా. ఆ హిమవత్పర్వతమున వేఁటకై పోయిన బోయవాండ్ల యలసటఁ దీర్చునట్టి చల్లనిగాలి గంగమీఁదుగా దేవదారువృక్షముల పరిమళములతోఁ గలసి నెమలిపింఛములయందు వడి యడఁగుటచే మందముగా వీచుననుట.

వ్యా. భాగీరథీతి. భాగీరథీనిర్ఝరశీకరాణాం గఙ్గాప్రవాహాంభఃకణానాం, కర్మణి షష్ఠీ, వోఢాప్రాపకః, వహేస్తృచ్, ముహుః పునఃపునః సద్యోవా. ని. 'పునః పున్యే భృశార్థే చ సద్యోవాస్యాన్ముహుఃపద' మితివైజయన్తీ. కమ్పితా దేవదారవో యేన స తథోక్తః, భిన్నాని విశ్లేషితాని శిఖండినాం బర్హాణి గతిలాఘవార్థం కిరాతకటిబద్ధాని యేన స తథోక్తః క్రమాద్విశేషణత్రయేణశైత్యసౌరభ్యమాంద్యాన్యుక్తాని, యస్య హిమాద్రేర్వాయురన్విష్టమృగైర్మార్గితమృగైశ్శ్రాన్తైరితి భావః. ని. 'అన్విష్టం మార్గితం మృగిత' మిత్యమరః. కిరాతైరాసేవ్యతే.

సప్తర్షిహస్తాపచితావశేషాణ్యధో వివస్వాన్ పరివర్తమానః,
పద్మాని యస్యాగ్రసరోరుహాణి ప్రబోధయత్యూర్ధ్వముఖైర్మయూఖైః.

టీ. యస్య = ఆ హిమపర్వతముయొక్క, సప్తర్షిహస్తావచితావశేషాణి - సప్తర్షి = సప్తర్షులయొక్క, హస్త = చేతులచే, అవచిత = త్రుంపఁబడినవానికంటె, అవశేషాణి = మిగిలినట్టివియు, అగ్రసరోరుహాణి - అగ్ర = హిమవంతముయొక్క కొనయందలి, సరః=కొలనలలో, రుహాణి = ప్రాదుర్భవించిన, పద్మాని = తామరపువ్వులను, అధః = క్రిందిభాగమున, పరివర్తమానః = సంచరించుచుండు, వివస్వాన్ = సూర్యుఁడు, ఊర్ధ్వముఖైః = ఊర్ధ్వభాగమునవ్యాపించెడు, మయూఖైః=కిరణములచే, ప్రబోధయతి=వికసింపఁ జేయుచున్నాఁడు.

తా. సప్తర్షులు తమమండలసమీపమునందున్న హిమాలయాగ్రసరోవరపద్మములను కొన్నింటిని వారు పూజకుఁ దీసికొనఁగా మిగిలినవానిని ఊర్ధ్వకరములచే సూర్యుఁడు వికసింపఁ జేయును. (సూర్యమండలమునకంటె పైమండలములవారగు సప్తర్షులు శిఖరసరోవరముల పద్మములఁ గోసికొనిరనుటచే సూర్యమండలము నతిక్రమించి పొడవుచే మించియున్నదని హిమవంతుని యౌన్నత్యవర్ణనము.

వ్యా. సప్తర్షీతి.—సప్త చ తే ఋషయశ్చ సప్తర్షయః, 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' ఇతి సమాసః. తేషాం హస్తై రవచితేభ్యో లూనేభ్యః-అవశేషాణ్యవశిష్టాని. ని. 'శేషోఽప్రధానే సంతాపే త్రిష్వన్యత్రోపయుజ్యతే' ఇతి కేశవః. కర్మణ్యణ్ప్రత్యయః. అనేన పద్మానాం సాఫల్యం సూచితం, యస్య హిమాద్రేః రోహంతీతి రుహాణి, 'ఇగుపధజ్ఞాప్రీకిరః కః' ఇతి కప్రత్యయః. అగ్ర ఉపరి యాని సరాంసి తేషు రుహాణి పద్మాని అధః పరివర్తమానో భ్రమన్ వివస్వాన్ సూర్య, ఊర్ధ్వముఖైర్మయూఖైః, ప్రబోధయతి వికాసయతి న కదాచిదధోముఖైః, అతిమార్తాండమండలత్వాదగ్రభూమేరితి భావః. సప్తర్షిమండలం ధ్రువాదపూర్ధ్వమితి జ్యోతిషికాః. అత స్తేషామగ్రసరోరుహభాగిత్వం యుక్తమ్.

యజ్ఞాఙ్గయోనిత్వమవేక్ష్య యస్య సారం ధరిత్రీధరణక్షమం చ,
ప్రజాపతిః కల్పితయజ్ఞభాగం శైలాధిపత్యం స్వయమన్వతిష్ఠత్. 17

టీ. యస్య = ఆ హిమవంతునియొక్క, యజ్ఞాంగయోనిత్వం - యజ్ఞాంగ = యజ్ఞమున కంగములగు సోమలతాదులకు, యోనిత్వం = కారణమగుటను, ధరిత్రీధరణక్షమం-ధరిత్రీధరణ = భూభారమును ధరించుటకు, క్షమ=తగిన, సారం = బలమును, అవేక్ష్య = చూచి, ప్రజాపతిః=బ్రహ్మదేవుఁడు, స్వయం=తానే, కల్పితయజ్ఞభాగం -

కల్పిత=కల్పింపఁబడిన, యజ్ఞభాగం = యజ్ఞములయందు పాలుగల (వంతు), శైలాధిపత్యం=పర్వతరాజ్యాధిపత్యమును, అన్వతిష్ఠత్ = చేసెను.

తా. ఆహిమవంతము యజ్ఞసాధనములగు సోమలతాదుల కునికి పట్టగుటను భూమిని మోయుటకుఁ దగిన బలము గలుగుటను జూచి బ్రహ్మ తానై యజ్ఞభాగభోక్తృత్వమును శైలరాజ్యాధిపత్యమునుఁ గటాక్షించెను.

వ్యా. యజ్ఞాంగేతి.—యస్య హిమాద్రేర్యజ్ఞాంగానాం యజ్ఞసాధనానాం సోమలతాదీనాం యోనిః ప్రభవః తస్య భావస్తత్త్వం, ఉక్తం చ విష్ణుపురాణే. 'యజ్ఞాంగార్థం మయా సృష్టో హిమవానచలేశ్వరః' ఇతి, ధరిత్రీధరణక్షమం భూభారధరణయోగ్యం సారం బలం చ. ని. 'సారో బలే స్థిరాంశే చే'త్యమరః. అవేక్ష్య జ్ఞాత్వా ప్రజాపతిః బ్రహ్మా స్వయమేవకల్పితో వ్యవస్థాపితో యజ్ఞభాగో యస్మింస్తత్తథోక్తం. వి. సోమస్య రాజ్ఞః కురంగ ఇన్ద్రోః శృఙ్గీ, సింధోశ్శింశుమారో హిమవతోహస్తీ ఇతి' శ్రుతేరితిభావః. శైలానా మాధిపత్యం అధిపతిత్వం. 'పత్యంతపురోహితాదిభ్యోయ'గితి యక్ప్రత్యయః, అన్వతిష్ఠత్ దదాతి స్మేత్యర్థః. ఉక్తంచ బ్రహ్మాణ్డపురాణే - 'శైలానాం హిమవన్తం చ నదీనాం చైవ సాగరం, గన్ధర్వాణామధిపతిం చక్రే చిత్రరథం విధి'రితి.

స మానసీం మేరుసఖః పితౄణాం కన్యాం కులస్య స్థితయే స్థితిజ్ఞః,
మేనాం మునీనామపి మాననీయామాత్మానురూపాంవిధినోపయేమే.

అవ. ఇచ్చటనుండి కథను ప్రస్తావించుచున్నాఁడు.—

టీ. మేరుసఖః = మేరువునకు మిత్రుఁడును, స్థితిజ్ఞః=మర్యాద నెఱింగినవాఁడగు, సః=ఆ హిమవంతుఁడు, పితౄణాం = పితృదేవతలయొక్క, మానసీం=మనస్సునఁ బుట్టినట్టిదియు, మునీనామపి=మునులకును, మాననీయాం = గౌరవింపఁదగినదియును, ఆత్మానురూపాం = తనకుఁ దగినదియునగు, మేనాం కన్యాం = మేనకాదేవియనెడు కన్యకను, కులస్య=కులముయొక్క, స్థితయే=ప్రతిష్ఠకొఱకు,విధినా=శాస్త్రవిధిచేత, ఉపయేమే=పెండ్లి చేసికొనెను.

తా. మేరువునంతటిబంధువునుఁ గలిగియున్నవాఁడును మర్యాద నెఱింగినవాఁడును నగు నాహిమవంతుఁడు పితృదేవతలకు మానసపుత్రికయును కులసౌందర్యవయోవిభవాదులచే తనకుఁ దగినదియు నగు మేనకయనుకన్యకను పెండ్లియాడెను.

అవ. సమ్ప్రతి కథాం ప్రస్తౌతి.—

వ్యా. స ఇతి.—మేరోస్సఖా మేరుసఖః బంధుసంపన్న ఇతి భావః. స్థితిజ్ఞ మర్యాదాభిజ్ఞః. ని. 'అవస్థితిః స్థితిర్జ్ఞేయా స్థితిః కర్తవ్యపద్ధతిః, స్థితిః స్థానమపిప్రోక్త

వ్యవస్థాపి స్థితిర్మతా, రచనా స్థిరతా చాపి మర్యాదాపి స్థితిర్మతా.' శ్రుతసంపత్తిరనేన సూచ్యతే - స హిమవాన్ పితౄణాం మానసీం మనస్సంకల్పజన్యాం మునీనామపి మాననీయాం యోగ్యబ్రహ్మవాదిభ్యాం పూజ్యామిత్యర్థః. ఉక్తంచ విష్ణుపురాణే - 'తేభ్యః స్వధా స్పుదం జజ్ఞే మేనకా ధారిణీ తథా, తే ఉభే బ్రహ్మవాదిన్యౌ, యోగిన్యౌ చాప్యుభే ద్విజే'తి. ఆత్మానురూపాం కులశీలసౌందర్యాదిభిః సదృశీం, మేనాం మేనకాదేవీతి నామవతీం కన్యాం కులస్య స్థితయే ప్రతిష్ఠాయై విధినా యథాశాస్త్రేణ ఉపయేమే పరిణీతవాన్. 'ఉపాద్యమస్స్వకరణే' ఇత్యాత్మనేపదం. 'తేషాం తు మానసీ కన్యా మేనా నామ మహాగిరేః, పత్నీ హిమవతో యస్యాః పుత్రో మైనాక ఉచ్యతే' ఇతి బ్రహ్మాండే.

కాలక్రమేణాథ తయోః ప్రవృత్తే స్వరూపయోగ్యే సురతప్రసఙ్గే,
మనోహరం యౌవనముద్వహన్త్యా గర్భోఽభవద్భూధరరాజపత్న్యాః.

టీ. అథ = పిమ్మట, కాలక్రమేణ = కాలము కడచుచుండఁగా, తయోః = ఆ మేనకాహిమవంతులకు, స్వరూపయోగ్యే = సౌందర్యమునకుఁదగిన, సురతప్రసంగే = సురతవ్యాపారము, ప్రవృత్తే = జరుగఁగా, మనోహరం=అందమైన, యౌవనం=వయస్సును, ఉద్వహంత్యాః = తాల్చిన, భూధరరాజపత్న్యాః = హిమవత్పత్నికి, గర్భః= కడుపు, అభవత్ = అయెను.

తా. చక్కఁదనమునకుఁ దగిన సంభోగ మాహిమవన్మేనకలకుఁ జరుగఁగా పూర్ణయౌవనవతియగు నా మేనకకు గర్భమాయెను.

వ్యా. కాలక్రమేణేతి. అథ కాలక్రమేణ గచ్ఛతా కాలేనేత్యర్థః. తయోః మేనకాహిమవతోః, స్వరూపయోగ్యే సౌన్దర్యానుగుణే - యద్వా - రూప్యతే నిశ్చీయతేఽనేనేతి రూపం జ్ఞానం - తద్యోగ్యే శాస్త్రానుసారిణీత్యర్థః. సురతప్రసఙ్గే సురతకర్మణి, ప్రవృత్తే సతి, మనోహరం యౌవనముద్వహన్త్యా, భూధరరాజపత్న్యై మేనకాయాః, గర్భోఽభవత్.

అసూత సా నాగవధూపభోగ్యం మైనాకమమ్భోనిధిబద్ధసఖ్యమ్,
క్రుద్ధేఽపి పక్షచ్ఛిది వృత్రశత్రావవేదనాజ్ఞం కులిశక్షతానామ్. 20

టీ. సా=ఆ మేనకాదేవి, నాగవధూపభోగ్యం - నాగవధూ = నాగాంగనలకు, ఉపభోగ్యం = అనుభవించుటకు యోగ్యుఁడును, అంభోనిధిబద్ధసఖ్యం - అంభోనిధి = సముద్రునిలో, బద్ధ = కట్టఁబడిన, సఖ్యం = మైత్రిగలవాఁడును, పక్షచ్ఛిది = ఱెక్కలను ఛేదించునట్టి, వృత్రశత్రౌ = దేవేంద్రుఁడు, క్రుద్ధేఽపి = కోపగించినను, కులిశక్షతానాం = వజ్రాయుధము దెబ్బలయొక్క, అవేదనాజ్ఞం = బాధ నెఱుఁగనివాఁడగు, మైనాకం = మైనాకుని, అసూత=కనెను.

తా. నాగకన్యలకు నాథుఁడగు మైనాకుఁడు మేనకకుఁ బుట్టెను. ఈ మైనాకుఁడు సురేంద్రునివజ్రపాతము దప్పించుకొని సముద్రునితో స్నేహముచేసి యందే నివసించియున్నాఁడు.

వ్యా. అసూతేతి.—సా మేనా, నాగవధూపభోగ్యమ్ నాగకన్యాపరిణేతార మిత్యర్థః. అమ్భోనిధినా బద్ధసఖ్యం సముద్రకృతమైత్రీకమ్, సఖ్యమూలం సూచయతి- పక్షచ్ఛిది పక్షచ్ఛేత్తరి 'సత్సూద్విష -' ఇత్యాదినా క్విప్ప్రత్యయః, వృత్రశత్రౌ, క్రుద్ధే కుపితే సత్యపి, కులిశక్షతానాం వజ్రప్రహారాణామ్ సంబన్ధసామాన్యే షష్ఠీ. జానాతీతి జ్ఞః 'ఇగుపధజ్ఞా' ఇతి కప్రత్యయః. అవేదనానాం జ్ఞః - అథవా - వేదనాం జానాతీతి వేదనాజ్ఞః, 'ఆతోఽనుపసర్గే కః' ఇతి కప్రత్యయః. 'ఉపపద మతిఙ్' ఇతి సమాసః - స న భవతీత్యవేదనాజ్ఞః - తమ్ కులిశక్షతవేదనానభిజ్ఞ మిత్యర్థః. సాపేక్షత్వేఽపి గమకత్వాత్ సమాసః. పక్షచ్ఛేదోద్యతశక్రాత్ త్రాణాయ శరణాగమనమనయోః సఖ్యమూలమితి భావః, మైనాకం పుత్రమసూత. సర్వ పర్వతపక్షచ్ఛేదేఽప్యయమచ్ఛిన్నపక్ష - ఏ వేతి మైనాకస్యోత్కర్షః - తాదృక్పుత్ర వత్త్వం హిమాద్రేరితి సార్థకం మైనాకస్య వర్ణనమ్ - 'పితా న జ్ఞాయతే యస్యా భ్రాతా యది న విద్యతే, నోపయచ్ఛేత్తు తాం కన్యాం ధర్మలోపభయాత్ సుధీః.' ఇత్యభ్రాతృకకన్యాపరిణయనిషేధాత్ - ప్రకృతే పార్వతీ భ్రాతృమత్యేవేతి సూచ నార్థం మైనాకవర్ణనమితి తాత్పర్యార్థః.

అథావమానేన పితుః ప్రయుక్తా దక్షస్య కన్యా భవపూర్వపత్నీ,
సతీ సతీ యోగవిసృష్టదేహా తాం జన్మనే శైలవధూం ప్రపేదే.

టీ. అథ = పిమ్మట, దక్షస్య = దక్షప్రజాపతికి, కన్యా = కూఁతురైనట్టియు, భవపూర్వపత్నీ - భవ = ఈశ్వరునికి, పూర్వపత్నీ = క్రిందటిజన్మలో భార్య యయి నట్టియు, సతీ = పతివ్రతయగు, సతీ = సతీదేవి, పితుః = తండ్రియగు దక్షప్రజాపతి యొక్క (ఆయననుండి సంప్రాప్తమైన), అవమానేన = తనపెనిమిటియొక్క తిరస్కార ముచే, ప్రయుక్తా = ప్రేరితురాలై, యోగవిసృష్టదేహా-యోగ = యోగమార్గముచే, విసృష్ట = విడువఁబడిన, దేహా=శరీరముకలదియై, జన్మనే = (తిరిగి) పుట్టుటకొఱకై, తాం శైలవధూం = ఆ హిమవత్పత్నియగు మేనకాదేవిని, ప్రపేదే = పొందెను.

తా. తనతండ్రియగు దక్షుఁడు పరమేశ్వరుని నింద జేయుట కోర్వనిదై యోగముచే విడిచిన శరీరముగల సతీదేవి మైనాకుని పుట్టుక యనంతరమున ఆ మేనకను పొందెను. (అనఁగా మేనకాదేవి

యొక్క రెండవసంతానమై శాంకరి యుదయించుటకు మేనక నాశ్ర యించి యుండినదనుట )

వ్యా. అథేతి.— అథ మైనాకజననానంతరం, దక్షస్య ప్రజాపతేః, కన్యా, భవస్య హరస్య, పూర్వపత్నీ పూర్వభార్యా, సతీ పతివ్రతా. ని. 'సతీసాధ్వీ పతివ్రతా' ఇత్యమరః. సతీ నామ దేవీ పితుర్దక్షస్య కర్తరి షష్ఠీ, అవమానేన స్వభర్తృవజ్ఞయా, ప్రయుక్తా ప్రేరితా, యోగేన యోగమార్గేణ, విసృష్టదేహా త్యక్తదేహా సతీ, జన్మనే పునరుద్భవాయ, తాం శైలవధూం మేనకాం, ప్రపేదే. అత్ర పురా కిల సతీదేవీ దక్షాధ్వరే తత్కృతాం స్వభర్తృవజ్ఞామసహమానా పితరం ప్రసూం చోపేక్ష్య మత్కర్తవ్యకార్యం త్వజ్ఞామాత్రైవ కరిష్యతీతి నిర్ధార్య దేవకార్యాణి సాధయితుం చ యోగాగ్నినా స్వశరీరం దదాహేతి పురావృత్తకథా ఽనుసంధేయా.

సా భూధరాణామధిపేన తస్యాం సమాధిమత్యాముదపాది భవ్యా,
సమ్యక్ప్రయోగాదపరిక్షతాయాంనీతావివోత్సాహగుణేన సంపత్.

టీ. భవ్యా=కళ్యాణియగు, సా=ఆ సతీదేవి, భూధరాణాం = పర్వతములకు, అధిపేన=ప్రభువగు హిమవంతునిచే, సమాధిమత్యాం = నియమవతురాలగు, తస్యాం=ఆ మేనకయందు, సమ్యక్ప్రయోగాత్ - సమ్యక్ = లెస్సగా, ప్రయోగాత్=ఆచరించుట వలన, అపరిక్షతాయాం=చెడని, నీతౌ=నీతియందు, ఉత్సాహగుణేన = ఉత్సాహశక్తి చేత, సంపదివ=సంపదవలె, ఉదపాది=పుట్టింపఁబడెను.

తా. మంచిసంతానమునకై వ్రతము లొనరించుచున్న మేనకయా హిమవంతునినుండి బాగుగా నడిపింపఁబడిన దగుటచే మంచి నీతియం దుత్సాహగుణముచే సంపదవలె పుట్టించఁబడెను.

వ్యా. సేతి.—భవ్యా కల్యాణీ, సా సతీ, భూధరాణామధిపేన హిమవతా, సమాధిమత్యాం నియమవత్యాం-సమాధిః సంతత్యర్థం నియమవిశేషః-తద్యుక్తాయాం, తస్యాం మేనకాయాం, సమ్యక్ప్రయోగాత్ సాధ్వాచరణాద్ధేతోరపరిక్షతాయా మభ్రష్టాయాం నీతావుత్సాహగుణేనోత్సాహశక్త్యా కర్త్రా - సంపదివ, ఉదపాద్యుత్పాదితా. ఉత్పద్యతేర్ణ్యన్తాత్ కర్మణి లుఙ్. 'చిణ్ భావకర్మణోః' ఇతి చిత్ప్రత్యయః 'చిణోలుక్' ఇతి తస్య లుక్.

ప్రసన్నదిక్పాంసువివిక్తవాతం శంఖస్వనానన్తరపుష్పవృష్టి,
శరీరిణాం స్థావరజంగమానాం సుఖాయ తజ్జన్మదినం బభూవ. 23

టీ. ప్రసన్నదిక్-ప్రసన్న = నిర్మలములగు, దిక్=దిక్కులుగలదియు, పాంసువివిక్తవాతం - పాంసు = పరాగముచే, వివిక్త = శూన్యమగు, వాతం=గాలికలదియు,

శంఖస్వనానంతరపుష్పవృష్టి-శంఖ = శంఖముయొక్క, స్వన=ధ్వనికంటె, అనన్తర = తర్వాతిదైన, పుష్పవృష్టి = పుష్పవర్షము గలదియునగు, తజ్జన్మదినం = ఆపార్వతీదేవి యొక్క జననదినము, స్థావరజంగమానాం = స్థావరజంగమాత్మకమగు, శరీరిణాం=ప్రాణులకు, సుఖాయ=సుఖముకొఱకు, బభూవ=ఆయెను.

తా. పార్వతీదేవి యావిర్భవించినదినమున చల్లటిగాలులు నిర్మలమైనదిక్కులు శంఖధ్వనులు ముందు సేయంబడి పిమ్మట పుష్పవర్షము గలిగి చరాచరప్రపంచకమునకంతయు నాదినము సుఖకరమై యుండెననుట.

వ్యా. ప్రసన్నేతి.—ప్రసన్నా నిర్మలా-దిశో యస్మింస్తత్ప్రసన్నదిక్, పాంసువివిక్తా రజోరహితా - వాతా యస్మింస్తత్ తథోక్తమ్, శఙ్ఖస్య స్వనాత్ స్వనస్యానన్తరం పుష్పవృష్టిర్యస్మింస్తత్ తథోక్తమ్, తస్యాః పార్వత్యాః, జన్మదినమ్, స్థితిశీలాః స్థావరాః - శైలవృక్షాదయః * 'స్థేశభాసపిసకసో వరచ్' ఇతి వరచ్ప్రత్యయః * జఙ్గమ్యన్తే భృశం గచ్ఛన్తీతి జఙ్గమా - దేవతిర్యఙ్మనుష్యాదయః - స్థావరాశ్చ జఙ్గమాశ్చ తేషాం ద్వయానామపి శరీరిణాం - సుఖాయానన్దాయ బభూవ.

తయా దుహిత్రా సుతరాం చకాసే స్ఫురత్ప్రభామండలయా సవిత్రీ,
విదూరభూమిర్నవమేఘశబ్దాదుద్భిన్నయా రత్నశలాకయేవ. 24

టీ- స్ఫురత్ప్రభామండలయా - స్ఫురత్ = ప్రకాశించుచున్న, ప్రభామండలయా = కాంతిమండలముగల, తయాదుహిత్రా=ఆకూఁతురుచే, సవిత్రీ=తల్లి, విదూరభూమిః=విదూరపర్వతప్రాంతభూమి, నవమేఘశబ్దాత్ = తొలకరిమేఘములయుఱుముచే, ఉద్భిన్నయా=వెడలిన, రత్నశలాకయేవ=రత్నఁపుమొలకచేతనువలె, సుతరాం=మిక్కిలి, చకాశే=ప్రకాశించెను.

తా. క్రొత్తమబ్బుచే మొలకలెత్తఁబడిన విదూరపర్వతప్రాంతరత్నభూమివలె కాంతిమండలము గల యాకూఁతుచే మేనక ప్రకాశించెను.

వ్యా. తయేతి.— స్ఫురదుల్లసత్-ప్రభామణ్డలం యస్యాః తయా, దుహిత్రా, సవిత్రీ జనయిత్రీ 'స్వరతి సూతి సూయతి ధూఞూదితో వా' ఇ తీడాగమః. విదూరస్యాద్రేః ప్రాన్తభూమిర్విదూరభూమిః. వి. 'అవిదూరే విదూరస్య గిరేరుత్తుఙ్గరోధసః, కాకతాలీయసీమాన్తే మణీనామాకరో భవేత్.' ఇతి బుద్ధః, నవమేఘశబ్దాదుద్భిన్నయా, రత్నశలాకయా రత్నాఙ్కురేణేవ, సుతరాం, చకాసే రరాజ.

దినే దినే సా పరివర్ధమానా లబ్ధోదయా చాంద్రమసీవ లేఖా,
పుపోష లావణ్యమయాన్విశేషాన్ జ్యోత్స్నాన్తరాణీవ కలాన్తరాణి.

టీ. లబ్ధోదయా = పొందఁబడిన యుత్పత్తిగల, (ఉదయించిన అని చంద్రరేఖాపరమైన యర్థము.) దినేదినే = ప్రతిదినమునను, పరివర్ధమానా = ప్రతిదినము నెదుగుచున్నదై, సా = ఆబాలిక, చాంద్రమసీ = చంద్రునిసంబంధమైన, లేఖేవ = రేఖవలె, లావణ్యమయాన్ = కాంతివిశేషమయములగు, విశేషాన్ = అవయవములను, జ్యోత్స్నాంతరాణి = వెన్నెలయందు దాగుటలుఁగలిగిన (అనఁగా చంద్రికామయములగు), కళాన్తరాణీవ = కళలనుంబోలె, పుపోష = పెంచెను.

తా. చంద్రరేఖ పుట్టినదినముమొదలు ప్రతిదినమును తనకళనెట్లుగా నభివృద్ధి పొందించునో ఆరీతిగానే పార్వతీదేవి పుట్టినదినము మొదలు తనకళలను దినదినాభివృద్ధి పఱచుచుండె ననుట.

వ్యా. దిన ఇతి.—లబ్ధ ఉదయో యయా సా లబ్ధోదయా-ఉత్పన్నేత్యర్థః. అభ్యుదితేత్యన్యత్ర, దినేదినే ప్రతిదినం. 'నిత్యవీప్సయోః' ఇతి వీప్సాయాం ద్విరుక్తిః. పరివర్ధమానా - ఉభయత్ర సమానమేతత్, సా బాలా, చన్ద్రమస ఇయం చాన్ద్రమసీ, లేఖేవ, లావణ్యం ప్రచురం యేషు తే లావణ్యమయాః-తాన్ లావణ్యమయాన్ కాన్తి విశేషప్రచురాన్. 'ముక్తాఫలేషు చ్ఛాయాయాస్తరళత్వమివాన్తరా, ప్రతిభాతి యదఙ్గేషు తల్లావణ్యమిహోచ్యతే' ఇతి భూపాలః. విశేషానవయవాన్. ని. 'విశేషోఽవయవే వ్యక్తౌ' ఇత్యుత్పలమాలాయామ్, జ్యోత్స్నాయామన్తరమన్తర్ధానం యేషాం తాని జ్యోత్స్నాన్తరాణి జ్యోత్స్నయాఽన్తర్హితాని - తన్మయానీతి యావత్. అన్యాః కలాః కలాన్తరాణీవ 'సుప్సుపే'తి సమాసః. ని. 'స్థానాత్మీయాన్యతాదర్థ్యరన్ధ్రాన్తర్ధిషు చాన్తరమ్' ఇతి శాశ్వతః. పుపోషోపచితవతీ. ఇయం వాక్యోపమేత్యాహ దణ్డీ, తల్లక్షణం తు. 'వాక్యార్థే నైవ వాక్యార్థః కోఽపి యద్యుపమీయతే, ఏకానేకేవశబ్దత్వాత్ సా తు వాక్యోపమా ద్విధా.'

తాం పార్వతీత్యాభిజనేన నామ్నా బన్ధుప్రియాం బన్ధుజనో జుహావ,
ఉ మేతి మాత్రా తపసో నిషిద్ధా పశ్చాదుమాఖ్యాం సుముఖీ జగామ.

టీ. బంధుప్రియాం = బంధువుల కిష్టురాలగు, తాం = ఆకన్యను, బంధుజనః = తండ్రి మున్నగుబంధువులు, ఆభిజనేన = పూర్వబంధువులనుండివచ్చిన, నామ్నా=పేరుతో, పార్వతీ ఇతి=పార్వతీయని, జుహావ=పిలచెను, పశ్చాత్=పిమ్మట, మాత్రా=తల్లిచే, ఉ = ఓ చిన్నదానా, మా = వద్దు, ఇతి = అని, తపసః = తపస్సునుండి, నిషిద్ధా = నివారింపఁబడినదై, సుముఖీ = సుందరమయిన ముఖముగల యాబాల, ఉమాఖ్యాం = ఉమ యనెడుపేరును, జగామ = పొందెను.

తా. తండ్రి మున్నగువా రాబాలికకు తండ్రినామము దెలిపెడు పార్వతియను నామధేయము జేసినవారైనను తపస్సు చేయవద్దను తల్లిచే చెప్పఁబడిన ఉ = ఓ చిన్నదానా! మా = తపస్సు వలదు. అను రెండును జేర్చగా కొన్నిదినములకుమ యనియు పేరు ప్రసిద్ధి కెక్కెను.

వ్యా. తామితి.—బన్ధుప్రియాం, తాం బాలాం, బన్ధుజనః పిత్రాదిః, అభిజనాదాగతేనాభిజనేన - పిత్రాదిపూర్వసంబంధోపాధికేనేత్యర్థః. 'అభిజనాః పూర్వబాన్ధవాః' ఇతి కాశికా. నామ్నా, పర్వతస్యాపత్యం స్త్రీ పార్వతీ. 'తస్యాపత్యమ్' ఇత్యణ్ప్రత్యయః. ఇతి, జుహావాహూతవాన్. హ్వయతేర్లిటి రూపమ్. పర్వతజన్యత్వోపాధినా పార్వతీతి నామ్నా ప్రసిద్ధిరితి భావః. పశ్చాదభిజననామప్రవృత్త్యనన్తరం, మాత్రా జనన్యా, ఉ ఇతి సంబోధనే 'ఉ ఇతి వితర్కసంబోధనపాదపూరణేషు' ఇతి గణవ్యాఖ్యానే. మాశబ్దో నిషేధే. ఉ హే వత్సే, మా మా కురు త్వేవంరూపేణ, తపసస్తపశ్చర్యాయాః 'వారణార్థానామీప్సితః' ఇత్యపాదానత్వాత్ పఞ్చమీ. నిషిద్ధా నివారితా సతీ, సుముఖీ సా బాలా, ఉమేత్యాఖ్యాం నామధేయముమాఖ్యాం, జగామ.

మహీభృతః పుత్త్రవతోఽపి దృష్టిస్తస్మిన్నపత్యే న జగామ తృప్తిమ్,
అనంతపుష్పస్య మధోర్హి చూతే ద్విరేఫమాలా సవిశేషసఙ్గా. 27

టీ. పుత్త్రవతోపి = కొడుకులు కూతుండ్రు పలువురు కలవాఁడైనప్పటికిని, మహీభృతః=ఆ హిమవంతునియొక్క, దృష్టిః = చూపు, తస్యాం=ఆ పార్వతియందు, తృప్తిం=తనివిని, న జగామ = పొందదాయెను, హి = సరియేకదా? అనన్తపుష్పస్య = లెక్కలేనిపూవులుఁగల, మధోః = వసంతునియొక్క, ద్విరేఫమాలా = తుమ్మెదపంక్తి, చూతే = మామిడిపూవుమీఁద, సవిశేషసంగా=విశేషప్రేమతో కూడినదిగదా.

తా. హిమవంతుని కెందఱు కొమారితలు కొమరు లున్నను పార్వతీదేవియందలితృప్తిని పొందఁడాయెను. న్యాయమే. వసంతర్తువునందు మిక్కుటముగా పూవులుపూచిన తరువులున్నను మామిడియందే కదా ప్రేమ.

వ్యా. మహీభృత ఇతి.—పుత్త్రాశ్చ దుహితరశ్చ పుత్త్రాః. 'భ్రాతృపుత్త్రౌ స్వసృదుహితృభ్యామ్' ఇత్యేకశేషః. తేఽస్య సన్తీతి పుత్త్రవాన్ భూమార్థేమతుప్. తస్య - పుత్త్రవతోఽపి బహ్వపత్యస్యాపీత్యర్థః. మహీభృతో హిమాద్రేః, దృష్టిశ్చక్షుస్తస్మిన్న

పత్యే తోకే. ని. 'అపత్యం తోకం తయోః సమే' ఇత్యమరః. తస్యాం పార్వత్యా మిత్యర్థః. తృప్తిం న జగామ; తథా హి, అనన్తపుష్పస్య నానావిధకుసుమస్యాపి, మధో ర్వసన్తస్య సమ్బన్ధినీ ద్విరేఫమాలా భృఙ్గపఙ్క్తిశ్చూ...

* 'అవయవే చ ప్రాణ్యోషధివృక్షేభ్యః' ఇతి వికారార్థోత్పన్నస్యాణ్ప్రత్యయస్య లుక్ప్రకరణే * పుష్పఫలమూలేషు బహులమ్' ఇతి పఠనాల్లుప్. సవిశేషః సాతిశయః - సఙ్గో యస్యాః సా తథోక్తా-అత్యన్తాసక్తేత్యర్థః.

ప్రభామహత్యా శిఖయేవ దీపస్త్రిమార్గయేవ త్రిదివస్య మార్గః,
సంస్కారవత్యేవ గిరా మనీషీ తయా స పూతశ్చ విభూషితశ్చ. 28

టీ. ప్రభామహత్యా = అధికప్రకాశముగల, శిఖయా = జ్వాలచే, దీపఇవ = దీపమువలె, త్రిమార్గయా = (స్వర్గమర్త్యపాతాళములలో మార్గములుగల) గంగచే, త్రిదివస్య=స్వర్గముయొక్క, మార్గ ఇవ=మార్గమువలె, సంస్కారవత్యా = వ్యాకరణాది సంస్కారముగల, గిరా=వాక్కుచేత, మనీషీవ = విద్వాంసుఁడువలె, తయా=ఆ పార్వతీ దేవిచే, సః=ఆ హిమవంతుఁడు, పూతః=పవిత్రుఁడైనవాఁడును, విభూషితశ్చ = అలంకరింపఁబడినవాఁడును, (ఆసీత్ =ఆయెను.)

తా. హిమవంతుఁ డాకుమారిత చే గొప్పశిఖ చే దీపమువలె గంగ చేత స్వర్గమార్గమువలె వ్యాకరణాదిసంస్కారవాక్కుచే విద్వాంసుఁడు వలె పవిత్రమైనవాఁడును అలంకరింపఁబడినవాఁడు నాయెను.

వ్యా ప్రభేతి.—ప్రభామహత్యా ప్రకాశాధికయా, శిఖయా జ్వాలయా, దీపఇవ, శిఖాదీపయోరవయవావయవిభావా ద్భేదేన వ్యపదేశః. త్రయో మార్గా యస్యా స్తయా త్రిమార్గయా మన్దాకిన్యా, తృతీయా ద్యౌర్లోకః త్రిదివః స్వర్గః వృత్తి విషయే త్రిశబ్దస్య త్రిభాగవత్ పూరణార్థత్వమ్. 'దీవ్యతే ర్ఘఞర్థే కవిధానం, దీవ్యన్త్యత్ర జనా ఇతి దివ' ఇతి క్షీరస్వామీ - తస్య మార్గ ఇవ, సంస్కారో వ్యాకరణజన్యా శుద్ధిః, తద్వత్యా, గిరా వాచా. ని. 'భద్రైషాం లక్ష్మీర్నిహితాఽధివాచి' ఇతి శ్రుతేరితి భావః. మనస ఈషా మనీషా - సాఽస్యాస్తీతి మనీషీ, విద్వానివ, శకన్ధ్వాదిత్వాత్ సాధుః. తయా పార్వత్యా, స హిమవాన్ పూతః శోధితశ్చ, భూషితశ్చ, అత్ర శిఖా గిరోరవిశిష్టయోరుపమానానర్హత్వాన్న విశేషణాధిక్యదోషః. ఇయం మాలోపమా.

మన్దాకినీసైకతవేదికాభిస్సా కన్దుకైః కృత్రిమపుత్త్రికైశ్చ,
రేమే ముహుర్మధ్యగతా సఖీనాం క్రీడారసం నిర్విశతీవ బాల్యే.

టీ. సా=ఆ పార్వతీదేవి, బాల్యే=బాల్యమునందు, క్రీడారసం = ఆటలయొక్క రుచిని, నిర్విశతీవ=అనుభవించుచున్నదియుంబోలె, సఖీనాం=చెలికత్తెలయొక్క, మధ్యగతా=మధ్యనున్నదియై, మన్దాకినీసైకతవేదికాభిః - మందాకినీ=గంగయొక్క, సైకత=ఇసుకతిన్నెయందలి, వేదికాభిః = అరఁగులతోను, కందుకైః=బంతులతోను, కృత్రిమపుత్త్రికైశ్చ - కృత్రిమ = కల్పితములైన, పుత్త్రికైశ్చ = బొమ్మలతోను, ముహుః = తఱుచుగా, రేమే=క్రీడించెను.

తా. ఆ పార్వతీదేవి బాల్యవయస్సునందు ఆటలరుచి చూచుచున్నదేమో యనునట్లు చెలికత్తెలనడుమనుండి గంగాతీరఁపు టిసుకలయందు కల్పించఁబడిన యరఁగులతోను బంతులతోను బొమ్మలతోను మాటికి నాడుకొనెను

వ్యా. మన్దాకినీతి.—సా పార్వతీ, బాల్యే వయసి క్రీడానాం-రసః స్వాదః - రుచిరితి యావత్. తం క్రీడారసమ్. ని. 'రసో గన్ధే రసః స్వాదే' ఇతి విశ్వః, నిర్విశతీవ భుఞ్జానేవ. ని. 'నిర్వేశో భృతిభోగయోః' ఇతి విశ్వః. * 'ఆచ్ఛీనద్యోర్నుమ్' ఇతి వికల్పాన్నుమభావః. సఖీనాం మధ్యగతా సతీ, మన్దాకిన్యాః - సైకతేషు పులినేషు. వేదికాభిః, కన్దుకైః, క్రియయా నిర్వృత్తైః కృత్రిమైః * 'డ్వితః క్త్రిః' ఇతి క్త్రిప్రత్యయః. 'క్త్రేర్మమ్నిత్యమ్' ఇతి మబాగమశ్చ. పుత్త్రికైః పాఞ్చాలికాభిః. ని. 'పాఞ్చాలికా పుత్త్రికా స్యాద్వస్త్రదన్తాదిభిః కృతా' ఇత్యమరః. 'సంజ్ఞాయాంకన్' ఇతి కన్ప్రత్యయః. ముహూ రేమే.

తాం హంసమాలాశ్శరదీవ గఙ్గాం మహౌషధీం నక్తమివాత్మభాసః,
స్థిరోపదేశాముపదేశకాలే ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః. 30

టీ. స్థిరోపదేశాం - స్థిర=స్థిరమగు, ఉపదేశాం = ఉపదేశముగల, తాం = ఆ పార్వతీదేవిని, ఉపదేశకాలే = ఉపదేశసమయమునందే, ప్రాక్తనజన్మవిద్యాః - ప్రాక్తనజన్మ=క్రిందటిపుట్టువునందలి, విద్యాః=విద్యలు, శరది=శరత్కాలమునందు, గంగాం = గంగానదిని, హంసమాలాఇవ = హంసలపంక్తివలెను, నక్తం=రాత్రియందు, మహౌషధీం=ఒక గొప్పయోషధిని, ఆత్మభాసఇవ=తనకాంతులువలెను, ప్రపేదిరే=పొందినవి.

తా. క్రిందటిజన్మములో స్థిరముగా నుపదేశము సేయఁబడిన విద్యలు పార్వతీదేవి కీజన్మములో తమంతట తామే యుపదేశమా

త్రమున శరత్కాలము రాఁగా హంసలు తామై గంగానదిని బొంది నట్లును రాత్రియం దోషధిని స్వభావసిద్ధమైన వెలుఁగులువలెను పొందినవి.

వ్యా. తామితి.—స్థిరః స్థేయానుపదేశః ప్రాగ్భవీయో యస్యా స్తాదృశీమ్ - మేధావినీమిత్యర్థః. తాం పార్వతీముపదేశకాలే, ప్రాక్తనజన్మవిద్యాః పూర్వజన్మాభ్యస్తవిద్యా ఇత్యర్థః. శరది గఙ్గాం హంసమాలా ఇవ, నక్తం రాత్రౌ, మహౌషధీం తృణవిశేషమాత్మభాసః స్వదీప్తయ ఇవ, ప్రపేదిరే; ఉపమానసామర్థ్యాదుపదేశమన్తరేణైవేతి గమ్యతే.

అసంభృతం మణ్డనమఙ్గయష్టేరనాసవాఖ్యం కరణం మదస్య,
కామస్య పుష్పవ్యతిరిక్తమస్త్రం బాల్యాత్పరం సాథ వయః ప్రపేదే. 31

టీ. అథ=పిమ్మట, సా=ఆ పార్వతీదేవి, అంగయష్టేః = కఱ్ఱవలె సన్ననిశరీరమునకు, అసంభృతం=అప్రయత్నసిద్ధమైనట్టి, మండనం = అలంకారమైనట్టియు, అనాసవాఖ్యం=ఆసవమను పేరులేనట్టి (మద్యమను పేరులేనట్టి), మదస్య = ఉల్లాసమునకు, కరణం=సాధనమును, కామస్య=మన్మథునికి, పుష్పవ్యతిరిక్తం = పువ్వులకంటె వ్యతిరిక్తమైన, అస్త్రం=బాణమును నగు, బాల్యాత్ = బాల్యమునకంటె, పరం=తరువాతదియగు, వయః=వయస్సును, ప్రపేదే=పొందెను.

తా. పిమ్మట శరీరమునకు పుట్టని నగయు మద్యముకాని ఉత్సాహకారణమును పుష్పముకాని మారునిశరమ్ము నగునట్టియు బాల్యమునకంటెఁ బరమైనవయసును పొందెను.

వ్యా. అసంభృతమితి.—అథ సా పార్వతీ, అఙ్గయష్టేరసంభృతమయత్నసిద్ధం, మణ్డనం ప్రసాధనమనాసవాఖ్యమాసవాఖ్యారహితం, మదస్య, కరణం సాధనం, కామస్య, పుష్పవ్యతిరిక్తమస్త్రమస్త్రభూతం, బాల్యాచ్ఛైశవాత్, పరమనన్తరభావి, వయో యౌవనం, ప్రపేదే ప్రాప; యౌవనేనైవ హి యువతయః ప్రసాధ్యన్తే మాద్యన్తే కామ్యన్తే చేతి భావః. అత్ర ద్వితీయపాద ఆసవరూపకారణాభావేఽపి తత్కార్యమదోక్తేర్విభావనాలంకారః. తదుక్తమ్. 'కారణాభావే కార్యోత్పత్తిర్విభావనా' ఇతి; ప్రథమతృతీయయోస్త్వారోప్యమాణయోర్మణ్డన మదనాస్త్రత్వయోః ప్రకృతోపయోగాత్ పరిణామాలంకారః. తల్లక్షణంతూక్తమ్.

ఉన్మీలితం తూలికయేవ చిత్రం సూర్యాంశుభిర్భిన్నమివారవిన్దమ్,
బభూవ తస్యాశ్చతురస్రశోభి వపుర్విభక్తం నవయౌవనేన. 32

టీ. నవయౌవనేన=క్రొత్తవయసుచేత, విభక్తం=ఏర్పడిన, తస్యాః=ఆ పార్వతీదేవియొక్క, వపుః=శరీరము, తూలికయా = రంగులువేయుకుంచెతో, ఉన్మీలితం = వన్నె పెట్టఁబడిన, చిత్రమివ=చిత్తరువువలెను, సూర్యాంశుభిః = సూర్యకిరణములచేత, భిన్నం=విప్పఁబడిన, అరవిందమివ = పద్మమువలెను, చతురస్రశోభి=ఎక్కువ తక్కువలు లేక ప్రకాశించునట్టిదై, బభూవ=అయెను.

తా. క్రొత్తవయస్సునుఁ దాల్చిన పార్వతీదేవి శరీరము రంగు వేయుకుంచెతో వ్రాయఁబడిన చిత్తరువువలె సూర్యకిరణములచే వికసించిన పద్మమువలె న్యూనాతిరిక్తములు లేక మిక్కిలి ప్రకాశించునది యాయెను.

వ్యా. ఉన్మీలితమితి.— నవయౌవనేన ప్రథమయౌవనేన, విభక్తమభివ్యఞ్జిత పీనజఘనాదిసంస్థానమిత్యర్థః. తస్యాః పార్వత్యాః, వపుస్తూలికయా కూర్చికయా శలాకయేత్యర్థః. ని. 'తూలికా కథితా లేఖ్య కూర్చికా తూలశయ్యయోః' ఇతి విశ్వః. ఉన్మీలితం రఞ్జనద్రవ్యేణోద్భాసితం. సముత్కీర్ణరూపమితి యావత్. చిత్రమాలేఖ్యమివ, సూర్యాంశుభిర్భిన్నం వికసితమరవిన్దం పద్మమివ, చత్వారోఽస్రయో యస్య తచ్చతురస్రమన్యూనానతిరిక్తం యథా తథా - శోభత ఇతి చతురస్రశోభి తాచ్ఛీల్యే ణినిః. బభూవ; చిత్రారవిన్దయోస్తూలికాతరణికిరణసంబన్ధ ఇవ స్వతస్సిద్ధ స్యైవాఙ్గసౌష్ఠవస్య యౌవనప్రాదుర్భావో ఽభివ్యఞ్జకో బభూవేత్యర్థః.

అభ్యున్నతాఙ్గుష్ఠనఖప్రభాభిర్నిక్షేపణాద్రాగమివోద్గిరన్తౌ,
ఆజహ్రతుస్తచ్చరణౌ పృథివ్యాం స్థలారవిన్దశ్రియమవ్యవస్థామ్. 33

అవ. పార్వతీదేవిని నఖాదిశిఖాంతముగా వర్ణించుచున్నాఁడు. దేవతలను పాదాదిశిరోంతముగా మానవులను శిఖాదిపాదాంతముగా వర్ణింతురు. కాన కవి పార్వతీదేవి నట్లే వర్ణించుచున్నాఁడు:—

టీ. అభ్యున్నతాంగుష్ఠనఖప్రభాభిః - అభ్యున్నత = ఎత్తయిన, అంగుష్ఠనఖ = బొట్టనగోళ్లయొక్క, ప్రభాభిః=కాంతులమూలమున, నిక్షేపణాత్ = ఉంచుటవలన, రాగం=(లోపలి) యెఱుపును, ఉద్గిరంతావివ=వెడలఁగ్రక్కుచున్నవో యనునట్లున్న, తస్యాః చరణౌ = ఆమెయొక్కపాదములు, పృథివ్యాం=భూమియందు, అవ్యవస్థాం = ఒకచోట నిలిచియుండని, స్థలారవిందశ్రియం=మెట్టతామరపూవుశోభను, ఆజహ్రతుః= హరించినవి.

తా. పార్వతీదేవి క్రింద తనయడుగులఁ బెట్టుచున్నప్పుడు కాలి బొట్టనవ్రేళ్లలో చిమ్మిన రక్తకాంతులచే సంచారముగల మెట్టతామరలా?

యనున ట్లుండెను. (ఎట్టిని పాదములుండుట మహారాణికి లక్షణమని సాముద్రికము.)

అవ. దేవతానాం రూపం పాదాఙ్గుష్ఠప్రభృతి వర్ణ్యతే, మానుషాణాం కేశాదారభ్యేతి ధార్మికాః.—సంప్రతి సప్తదశభిః శ్లోకైః పార్వత్యాః పాదాదికేశాన్తవర్ణనమారభతే.—

వ్యా. అభ్యున్నతేతి.— అభ్యున్నతయోరఙ్గుష్ఠనఖయోః - ప్రభాభిర్నిమిత్తేన, నిక్షేపణాన్నిర్భరన్యాసాద్ధేతోః, రాగమన్తర్గతం లౌహిత్యం. ని. 'రాగః క్లేశాదికే రక్తే మాత్సర్యే లోహితాదిషు' ఇతి శాశ్వతః. ఉద్గిరన్తౌ వమన్తౌ - బహిర్నిస్సారయన్తౌ వివక్షితావిత్యర్థః. అత్రోద్గిరతేర్గౌణార్థత్వాన్న గ్రామ్యతాదోషః. ప్రత్యుత గుణ ఏవ. యథాఽఽహ దణ్డీ - 'నిష్ఠ్యూతోద్గీర్ణవాన్తాది గౌణవృత్తివ్యపాశ్రయమ్, అతిసున్దరమన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే.' ఇతి. తస్యాశ్చరణౌ తచ్చరణౌ, పృథివ్యా, మవ్యవస్థాం వ్యవస్థారహితామ్-ఏకత్రావస్థానరహితామ్ - సంచారిణీమిత్యర్థః. స్థలారవిన్దశ్రియమాజహ్రతుః; స్థలవిశేషణాన్నియతలౌహిత్యలాభః. అత్ర సాముద్రికాః - 'యస్యా రక్తతలౌ పాదౌ వున్నతాగ్రౌ తలస్పృశౌ, నిగూఢగుల్ఫౌ నిహితౌ సా స్యాన్నృపతిసమ్మతా.' ఇతి. అత్రోపమానధర్మస్యారవిన్దశ్రియశ్చరణయోరుపమేయయోరసంభవాదరవిన్దశ్రియమివ శ్రియమితి ప్రతిబిమ్బాకరణాక్షేపాన్నిదర్శనాఽలంకారః. సా చ సంబన్ధేఽసంబన్ధలక్షణాతిశయోక్త్యనుప్రాణితా. అవ్యవస్థామిత్యనేన స్థలారవిన్దస్య స్థైర్యసంబన్ధే ఽప్యసంబన్ధాభిధానాత్; నిదర్శనాలక్షణం తు 'అసంభవద్ధర్మ యోగాదుపమానోపమేయయోః, ప్రతిబిమ్బక్రియా గమ్యా యత్ర, సా స్యాన్నిదర్శనా' ఇతి.

సా రాజహంసైరివ సన్నతాఙ్గీ గతేషు లీలాఞ్చితవిక్రమేషు,
వ్యనీయత ప్రత్యుపదేశలుబ్ధైరాదిత్సుభిర్నూపురశిఞ్జితాని. 34

టీ. ప్రత్యుపదేశలుబ్ధైః - ప్రత్యుపదేశ = తాము చేయుం నుపదేశమునకుబదులుగా నామెచేయు నుపదేశమునందు, లుబ్ధైః = ఆశగలవియు, నూపురశింజితాని = అందెలమ్రోఁతను, (అనఁగా) అట్టి యింపైనధ్వనిని, ఆదిత్సుభిః = పొందఁగోరినవియు నగు, రాజహంసైః = రాజహంసలచేత, సన్నతాంగీ = (కుచములబరువుచే) వంగిన దేహముగల, సా = ఆ పార్వతీదేవి, లీలాఞ్చితవిక్రమేషు = విలాసములచే నొప్పు మెట్టుటలుగల, గతేషు = నడకలయందు, వ్యనీయతఇవ = నేర్పఁబడెనా యనున ట్లుండె ననుట.

తా. "అథవా విద్యయా విద్యా" యనునట్లు తమనడల నామెకు నేర్పి యాపార్వతీదేవి కాలియందెల చప్పుడులఁ బోలురవమును నేర్చుకొనెనో హంసలనున ట్లుండెను. (అనఁగా హంసలవంటి నడకలను హంస కూజితములవంటి ధ్వనిగల కాలియందెలచప్పుడులును గలిగి మనోహరముగా పార్వతీదేవి యొప్పెననుట.)

వ్యా. సేతి.—ప్రత్యుపదేశలుబ్ధైః-వి. 'గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా, అథవా విద్యయా విద్యా చతుర్థీ నోపపద్యతే.' ఇతి న్యాయాదితి భావః. స్వవిద్యాదానేన పరవిద్యాగ్రహణమితి ప్రత్యుపదేశః. తదేవ వ్యనక్తి. నూపురశిఞ్జితాన్యాదిత్సుభిః నూపురశిఞ్జితమఞ్జుకూజితోపదేశమిచ్ఛద్భిరిత్యర్థః. రాజహంసైః, సన్నతాఙ్గీ కుచభారాదితి భావః. సా పార్వతీ, లీలాభిర్విలాసైరఞ్చితాః పూజితాః-విక్రమాః పాదన్యాసా - యేషు తేషు. 'అఞ్చేః పూజాయామ్' ఇతీడాగమః. ని. 'లీలా విలాసక్రియయోః' ఇత్యమరః. గతేషు విషయే, వ్యనీయతేవ వినీతా కిము; అన్యథా కథమస్యా హంసగమనమిత్యుత్ప్రేక్షా.

వృత్తానుపూర్వే చ న చాతిదీర్ఘే జంఘే శుభే సృష్టవతస్తదీయే,
శేషాంగనిర్మాణవిధౌ విధాతుర్లావణ్యముత్పాద్య ఇవాస యత్నః.

టీ. వృత్తానుపూర్వే చ - వృత్త=గుండ్రముగాను, అనుపూర్వే చ = అఁదోఁకలను (గోపుతోఁకవలె నున్నవనుట), నాతిదీర్ఘే చ = మిక్కిలి పొడవుకానివియు, శుభే = సల్లక్షణములుగల, తదీయే = ఆ పార్వతీదేవివియగు, జఙ్ఘే=క్రిఁగాళ్లను, సృష్టవతః = నిర్మించిన, విధాతుః = బ్రహ్మయొక్క, శేషాఙ్గనిర్మాణవిధౌ - శేష=మిగిలిన, అంగ = అవయవములయొక్క, నిర్మాణవిధౌ = సృష్టించుటయందు, ఉత్పాద్యే = మఱియు సమకూర్చుకొను, లావణ్యే = కాంతివిషయమై, యత్నః = ప్రయత్నము, ఆసఇవ=కలిగెనేమో యనున ట్లుండెననుట.

తా. తనచాతుర్యమును యావత్తు వినియోగపఱచి శ్రీపార్వతీదేవిపిక్కలను సృష్టించినబ్రహ్మ మిగిలినయవయవముల సృష్టించుటకు యత్నము జేయుచున్న వాఁడువలె నుండెను.

వ్యా. వృత్తేతి.—వృత్తే వర్తులే - పూర్వమనుగతేఽనుపూర్వే-గోపుచ్ఛాకార ఇత్యర్థః. వృత్తే చ తే ఽనుపూర్వే చ వృత్తానుపూర్వే, నాతిదీర్ఘే చ మహావిభాషయా న సమాసః నఞో విశేషణత్వం చ శబ్దప్రయోగాదేవ జ్ఞేయమ్. శుభే మఙ్గలే, తస్యా ఇమే తదీయే జఙ్ఘే ప్రసృతే. ని. 'జఙ్ఘా తు ప్రసృతా' ఇత్యమరః. సృష్టవతో నిర్మితవతో విధాతుః స్రష్టుః, శేషాఙ్గనిర్మాణవిధౌ జఙ్ఘావ్యతిరిక్తావయవనిర్మా

టీ. స్తనాభ్యాం=స్తనములచే, కించిదావర్జితేవ=కొంచెము వంగినదివలెనున్నదై, తరుణార్కరాగం = బాలసూర్యునివలె నెఱ్ఱగానున్న, వాసః = వస్త్రమును, వసానా= ధరించినదై, పర్యాప్త పుష్ప స్తబకావనమ్రా=పూర్ణమైన పూలగుత్తులచేవంగినదై, పల్లవినీ=చిగుళ్లుగల, సంచారిణీ=నడచుచున్న, లతేవ=తీఁగవలె, (ఉన్న పార్వతీదేవి యగపడెనని సంబంధము.)

తా. నిండు పూవుగుత్తులచే వంగి చివుళ్లుగల నడకగల తీఁగవలెనె పాలిండ్లచే కొంచెము వంగినదివలె నున్నట్టియు, బాలసూర్య ర క్తిమనుఁబోలు చీరను ధరించినట్టిదియునగు పార్వతీదేవి పొడసూపెను.

వ్యా. ఆవర్జితేతి.—స్తనాభ్యాం కిఞ్చిదావర్జితేవ దానమితేవ, తరుణార్కస్య రాగ ఇవ రాగో యస్య తత్ బాలార్కారుణమిత్యర్థః. ఉపమానపూర్వపదో బహువ్రీహిః. ఉత్తరపదలోపశ్చ. వాసో వసానాఽఽచ్ఛాదయన్తీ అత ఏవ, పర్యాప్తపుష్పస్తబకావనమ్రా, పల్లవినీ కిసలయవతీ, సంచారిణీ లతేవ స్థితేతి శేషః.

స్రస్తాం నితమ్బాదవలమ్బమానా పునఃపునః కేసరదామకాఞ్చీమ్,
న్యాసీకృతాం స్థానవిదా స్మరేణ మౌర్వీం ద్వితీయామివ కార్ముకస్య.

టీ. స్థానవిదా=దాచేస్థలము నెఱిఁగిన, స్మరేణ=మరునిచే, న్యాసీకృతాం=దాఁచఁబడిన, కార్ముకస్య=బాణముయొక్క, ద్వితీయాం మౌర్వీమివ=రెండవనారియో యనునట్లున్నట్టియు, నితంబాత్ = పిఱుఁదునుండి, స్రస్తాం=జాఱిన, కేసరదామ కాంచీం= పొగడపూదండను మొలనూలును, పునః పునః=మాటికి, అవలంబమానాం = చేతితో నాఁపుచున్నదియునగు, (పార్వతీదేవి మరుని కగపడెను.)

తా. ఈజన్మములో నీశ్వరునికి యోడిపోయినను ముందు శివునిపైఁ బగదీర్చుకొనుట కీస్థలమున బాణఁపు టల్లెత్రాడు దాఁచుకొనిన బాగుండునని యెంచి జాగ్రత్త యగుచోటునెఱిఁగిన మారునిచే దాచుకొనఁబడిన మారునిబాణమునకుఁ గట్టు రెండవయల్లెత్రాడా యనునట్లున్న పార్వతీదేవి కటిస్థలాభరణమైన పొగడపూదండ మాటికిఁ జాఱుచుండఁగా ధరించుచు పార్వతీదేవి మరుని కగపడెను.

వ్యా. స్రస్తామితి.—స్థానవిదా నిక్షేపయోగ్యస్థానవేదినా స్మరేణ న్యాసీకృతాం నిక్షేపీకృతామ్, కర్మణే ప్రభవతీతి కార్ముకం ధనుః. 'కర్మణ ఉకఞ్' ఇత్యుకఞ్ ప్రత్యయః. తస్య ద్వితీయాం మౌర్వీమివ స్థితామ్, అత్ర హి న్యస్తా మౌర్వ్యత్ర హరవైరనిర్యాతనాయోపయుజ్యత ఇతి భావః. నితమ్బాత్, స్రస్తాం చలితాం

కేసరదామ వకులమాలా సైవ కాఞ్చీ తాం, పునః పునరవలమ్బమానా హస్తేన ధారయన్తీ.

సుగన్ధినిశ్వాసవివృద్ధతృష్ణం బిమ్బాధరాసన్నచరం ద్విరేఫమ్,
ప్రతిక్షణం సంభ్రమలోలదృష్టిర్లీలారవిన్దేన నివారయన్తీ. 56

టీ. సుగంధి నిశ్వాస వివృద్ధతృష్ణం=సువాసనగల నిట్టూర్పులచే నభివృద్ధినొందిన కోరికగలదియై, బింబాధరాసన్నచరం = దొండపండుఁబోలు పెదవిదగ్గరనేతిరుగులాడు, ద్విరేఫం=తుమ్మెదను, ప్రతిక్షణం=మాటికి, సంభ్రమ లోల దృష్టిః = తొందరపాటుచే చలించు చూపుగలదై, లీలారవిందేన = విలాసార్థముగా ధరించుకమలముచే, నివారయంతీ=అడ్డుచున్న, (పార్వతీదేవి యగపడెననుట.)

తా. పద్మినీజాతిస్త్రీగావున పద్మములవంటి నిట్టూర్పు వాసనగలదియు దొండపండువంటి పెదవిగలదియునగు పార్వతీదేవియొద్ద కాసక్తితో తుమ్మెదరాగా విలాసమునకు ధరించుపద్మముచే వారించు పార్వతీదేవి యగపడెను.

వ్యా. సుగన్ధీతి.—సుగన్ధిభిర్నిశ్వాసైర్వివృద్ధతృష్ణం, బిమ్బతుల్యోఽధరో బిమ్బాధరః. 'వృత్తౌ మధ్యమపదలోపః స్యాత్' ఇతి వామనః. తస్యాసన్నచరం సన్నికృష్టచరం ద్విరేఫం భృఙ్గం, ప్రతిక్షణం, సంభ్రమేణ లోలదృష్టిశ్చంచలాక్షీ సతీ లీలారవిన్దేన నివారయన్తీ.

తాం వీక్ష్య సర్వావయవానవద్యాం రతేరపి హ్రీపదమాదధానామ్,
జితేంద్రియే శూలిని పుష్పచాపః స్వకార్యసిద్ధిం పునరాశశంసే. 57

టీ. సర్వావయవానవద్యాం-సర్వ=సమస్తమగు, అవయవ = అంగములయందు, అనవద్యాం = నిర్దుష్టురాలైనదియు, రతేరపి=రతీదేవికిని, హ్రీపదం=లజ్జాకారణమును, ఆదధానాం = కూర్చునట్టి, తాం=ఆపార్వతీదేవిని, వీక్ష్య=చూచి, పుష్పచాపః = మరుఁడు, జితేంద్రియే = జయింపఁబడినయింద్రియములుగల, శూలిని = శివునియందు, పునః=తిరిగి, స్వ కార్య సిద్ధిం=తనకార్యము కొనసాగుటను, ఆశశంసే=కోరెను.

తా. అన్నియవయవములయందు నిర్దుష్టురాలై చక్కదనమ్మున రతీదేవినిమించిన పార్వతీదేవిని జూచి మారుఁడు తిరిగి యీశ్వరుని జయించువిషయములో కార్యసిద్ధిని కోరెను.

వ్యా. తామితి.— సర్వావయవేష్వనవద్యామగర్హ్యామ్ 'అవద్యపణ్య' ఇతి నిపాతః. రతేః కామకలత్రస్యాపి హ్రీపదం లజ్జానిమిత్తమాదధానామ్ - న్యూనతామా

వహాస్తీమిత్యర్థః. తాం పార్వతీం, వీక్ష్య పుష్పచాపః, కామో జితేంద్రియే దుర్జయేఽ పీత్యర్థః. శూలిని శివే విషయే స్వకార్యసిద్ధిం, పునరాశశంసే చకమే. పూర్వం 'సాధ్వస సన్నహస్తః' ఇత్యాదినా కార్యసిద్ధేరుస఼్్ఖలితత్వాభిధానాదిహ పునరిత్యుక్తమ్.

భవిష్యతః పత్యురుమా చ శంభోః
సమాససాద ప్రతిహారభూమిమ్,
యోగాత్ స చాన్తః పరమాత్మసంజ్ఞం
దృష్ట్వా పరం జ్యోతిరుపారరామ. 58

టీ. ఉమాచ = పార్వతీదేవియు, భవిష్యతః పత్యుః = కాఁగలపెనిమిటియగు, శంభోః=శివునియొక్క, ప్రతిహారభూమిం = ద్వారదేశమును, సమాససాద=పొందెను, స చ=ఆశివుఁడును, అన్తః=లోపల, పరమాత్మసంజ్ఞం=పరమాత్మయను పేరుగల, పరం= ముఖ్యమగు, జ్యోతిః=తేజస్సును, దృష్ట్వా = సాక్షాత్కారముఁజేసికొని, యోగాత్ = యోగమునుండి, ఉపారరామ=ఉపరమించెను (మానెను.)

తా. పార్వతీదేవి కాఁబోవు పెనిమిటియొద్దకు వచ్చెను. శివుఁడంతలో పరమాత్మ యను పేరిటి ముఖ్యతేజమును సాక్షాత్కారముఁజేసికొని యోగమును విరమించెను.

వ్యా. భవిష్యతఇతి.—ఉమా చ భవిష్యతః పత్యుః శంభోః ప్రతిహారభూమిం ద్వారదేశం సమాససాద. ని. 'స్త్రీ ద్వార్ద్వారం ప్రతీహారః ఇత్యమరః, స శంభు శ్చాన్తః, పరమాత్మేతి సంజ్ఞా యస్య తత్ పరం ముఖ్యమ్. ని. 'పరం దూరాన్యముఖ్యేషు' ఇతియాదవః. జ్యోతిర్దృష్ట్వా సాక్షాత్కృత్య యోగాద్ధ్యానాత్. ని. 'యోగః సన్నహ నోపాయధ్యాన సఙ్గతియుక్తిషు' ఇత్యమరః. ఉపారరామోపారతః. 'వ్యాఙ్ పరిభ్యో రమః' ఇతి పరస్మైపదమ్.

తతో భుజఙ్గాధిపతేః ఫణాగ్రైరధః కథంచిద్ధృతభూమిభాగః,
శనైః కృతప్రాణవిముక్తిరీశః పర్యఙ్కబన్ధం నిబిడం బిభేద. 59

టీ. తతః=తరువాత, భుజంగాధిపతేః=శేషునియొక్క, ఫణాగ్రైః=పడగల కొనలచేత, అధః=భూమిక్రింద, కథంచిత్ = కష్టముగా, ధృతభూమిభాగః = ధరింపఁబడిన భూభాగముగలవాఁడై, శనైః = మెల్లఁగా, కృతప్రాణవిముక్తిః = ఊపిరివిడుచుటగలవాఁడై, ఈశః = శివుఁడు, నిబిడం = దట్టమగు, పర్యంకబంధం = వీరాసనమును, బిభేద = సడలించెను.

తా. ఈశ్వరుఁడు వాయువులబంధిచి యోగమున నుండఁగా తేలికగా మోయుచున్న భూభాగముగల శేషుఁడు కష్టమువిూఁద

మోాయునట్లుగా నుచ్ఛ్వాసనిశ్వాసములుగలిగి వీరాసనమును విడిచెను.

వ్యా. తత ఇతి.—తతో భుజఙ్గాధిపతేః శేషస్య, ఫణాగ్రైరధో భూమేరధః కథంచిదలియత్నేన ధృతో భూమిభాగః స్వోపవేశనభూభాగో యస్య సతథోక్తః. వాయుధారణాహితలాఘవనివృత్త్యా భగవతో గురుత్వాదితి భావః. శనైః కృతా ప్రాణానాం ప్రాఙ్నిరుద్ధానాం విముక్తిః పునఃసంచారో యేన స కృతప్రాణవిముక్తిరీశో, నిబిడం దృఢం పర్యఙ్కబన్ధం వీరాసనం బిభేద శిథిలీచకార.

తస్మై శశంస ప్రణిపత్య నన్దీ శుశ్రూషయా శైలసుతాముపేతామ్,
ప్రవేశయామాస చ భర్తురేనాం భ్రూక్షేపమాత్రానుమతప్రవేశామ్

టీ. నందీ=నందీశ్వరుఁడు, తస్మై=ఆ శివునికొఱకు, ప్రణిపత్య = నమస్కరించి, శుశ్రూషయా = సేవానిమిత్తముచే, ఉపేతాం=వచ్చిన, శైలసుతాం = పార్వతీదేవిని, శశంస=చెప్పెను. భర్తుః=ఏలికయొక్క, భ్రూక్షేపమాత్ర = భ్రూసంజ్ఞచేతనే, అనుమతప్రవేశాం = అంగీకరింపఁబడిన ప్రవేశముగల, ఏనాం = ఈపార్వతీదేవిని, ప్రవేశయామాస చ=ప్రవేశపెట్టెను.

తా. నంది శివునికి నమస్కరించి సేవాకారణముచే పార్వతీదేవి వచ్చినసంగతిని దెల్పెను. ఈశ్వరుఁడు కనుబొమ్మతోఁ జేయఁబడిన సంజ్ఞచే అంగీకారముఁ దెలిసికొని పార్వతీదేవిని లోపలకుఁ బ్రవేశపెట్టెను.

వ్యా. తస్మాఇతి.—అథ నన్దీ తస్మై భగవతే క్రియాగ్రహణాచ్చతుర్థీ. ప్రణిపత్య నమస్కృత్య, శుశ్రూషయా సేవయా నిమిత్తేనోపేతామ్. సేవార్థమాగతామిత్యర్థః. శైలసుతాం, శశంస నివేదయామాస, భర్తుః స్వామినో, భ్రూక్షేపమాత్రేణ భ్రూసంజ్ఞయైవానుమతప్రవేశామఙ్గీకృతప్రవేశామేనాం శైలసుతాం, ప్రవేశయామాస చ.

తస్యాస్సఖీభ్యాం ప్రణిపాతపూర్వం స్వహస్తలూనశ్శిశిరాత్యయస్య,
వ్యకీర్యత త్ర్యమ్బకపాదమూలే పుష్పోచ్చయః పల్లవభఙ్గభిన్నః. 61

టీ. తస్యాః=ఆపార్వతీదేవియొక్క, సఖీభ్యాం=చెలికత్తెలచేత, స్వహస్తలూనః=తమచేతులతో కోయఁబడిన, పల్లవ భంగభిన్నః = చిగుళ్లతునియలతో కలిసియున్నట్టియు, శిశిరాత్యయస్య=వసంతర్తు సంబంధమగు, పుష్పోచ్చయః=పువ్వులగుంపు, త్ర్యంబకపాదమూలే=శివపాదసన్నిధానమున, ప్రణిపాతపూర్వం=నమస్కారపూర్వకముగా, వ్యకీర్యత=చల్లఁబడెను.

తా. పార్వతీదేవి చెలికత్తియలు పార్వతీదేవి తనహస్తములతో స్వయముగా కోసినట్టియు చిగుళ్లతో మిశ్రమమైయున్నట్టి వసంతర్తు పుష్పముల నీశ్వరుని పాదములకడఁ జల్లిరి.

వ్యా. తస్యా ఇతి.—తస్యాః పార్వత్యాః, సఖీభ్యాం పూర్వోక్తాభ్యాం, స్వహస్తేన లూన ఉపచితః. పల్లవభఙ్గభిన్నః కిసలయశకలమిశ్రః, శిశిరాత్యయస్య వసన్తస్య సంబన్ధీ పుష్పోచ్చయః పుష్పప్రకరః. 'హస్తాదానే చేరస్తేయే' ఇతి ఘఞ్విషయత్వాత్ కవీనామయం ప్రామాదికః ప్రయోగ ఇతి వల్లభః. త్ర్యమ్బకపాదమూలే ప్రణిపాతపూర్వం నమస్కారపూర్వకం వ్యకీర్యత విక్షిప్తః.

ఉమాఽపి నీలాలకమధ్యశోభి విస్రంసయన్తీ నవకర్ణికారమ్,
చకార కర్ణచ్యుతపల్లవేన మూర్ధ్నా ప్రణామం వృషభధ్వజాయ. 62

టీ. ఉమాపి=పార్వతీదేవియు, నీలాలక మధ్యశోభి = నల్లనిముంగురుల నడుమ నొప్పుచున్న, నవకర్ణికారం = నూతనమగు కొండగోగుపువ్వును, విస్రంసయన్తీ=జార్చుచున్నదై, కర్ణచ్యుత పల్లవేన=చెవినుండిజారుచున్నచిగురుగల, మూర్ధ్నా = శిరస్సుచే, వృషభధ్వజాయ=శివునికి, ప్రణామం=నమస్కారమును, చకార=చేసెను.

తా. పార్వతీదేవి తనముంగురులయం దుంచఁబడిన క్రొత్తకొండగోగుపువ్వు జారునట్లును, చెవిసందున నుంచుకొనిన చిగురు క్రిందపడునట్లును వంగి శివునికి నమస్కరించెను.

వ్యా. ఉమేతి.—ఉమాఽపి, నీలాలకానాం మధ్యే శోభత ఇతి తథోక్తమ్. అలకన్యస్తమిత్యర్థః. నవకర్ణికారం విస్రంసయన్తీ, కర్ణాచ్చ్యుతః పల్లవో యస్య తేన మూర్ధ్నా వృషభధ్వజాయ ప్రణామం చకార* క్రియాగ్రహణాత్సంప్రదానత్వమ్.

అనన్యభాజం పతిమాప్నుహీతి సా తథ్యమేవాభిహితా భవేన,
న హీశ్వరవ్యాహృతయః కదాచిత్పుష్ణన్తి లోకే విపరీతమర్థమ్. 63

టీ. సా=ఆమ్రొక్కినపార్వతీదేవి, భవేన=హరునిచే, అనన్యభాజం = ఇతరస్త్రీని కూడనట్టి, పతిం=పెనిమిటిని, ఆప్నుహి=పొందెదవుగాక, ఇతి=అని, తథ్యమేవ=నిజమే, అభిహితా=చెప్పఁబడెను, తథా హి=అదియుక్తమే, ఈశ్వర వ్యాహృతయః=మహాపురుషులమాటలు, కదాచిదపి = ఎప్పుడును, లోకే లోకమునందు, విపరీతం అర్థం=కానియర్థమును, న పుష్ణంతి=బోధింపవు.

తా. పార్వతీదేవి మ్రొక్కఁగా పరమేశ్వరుఁడు వేఱొకకాంతను పెండ్లాడని (అనఁగా సవతిపోరులేని యనుట) ప్రియుని పొందుమని

దీవించెను. న్యాయమే; మహాత్ముల మాటలు కానిసంగతులను చెప్పవు.

వ్యా. అనన్యేతి.—సా కృతప్రణామా దేవీ, భవేన హరేణ, అన్యాం న భజతీతి తమనన్యభాజమ్*భజో ణ్విః' ఇతి ణ్విప్రత్యయః. సర్వనామ్నో వృత్తిమాత్రే పూర్వపదస్య పుంవద్భావః. పతిమాప్నుహీతి, తథ్యం సత్యమేవాభిహితోక్తా - ఉత్తరత్ర తథైవ సంభవాదితి భావః. అభిదధాతేర్బ్రువర్థస్య దుహాదిత్వాదప్రధానే కర్మణి క్తః. తథా హి, ఈశ్వరవ్యాహృతయో మహాపురుషోక్తయః, కదాచిదపి, లోకే భువనే. ని. 'లోకస్తు భువనే జనే' ఇత్యమరః. విపరీతం విసంవాదినమర్థమభిధేయం, న పుష్ణన్తి న బోధయన్తీత్యర్థః.

కామస్తు బాణావసరం ప్రతీక్ష్య పతఙ్గవద్వహ్నిముఖం వివిక్షుః,
ఉమాసమక్షం హరబద్ధలక్ష్యశ్శరాసనజ్యాం ముహురామమర్శ.

టీ. కామస్తు=మారుఁడును, బాణావసరం=బాణమును వేయుటకు సమయమును, ప్రతీక్ష్య=చూచి, (పార్వతీదేవి దగ్గరనున్నదిగాన యిదేసమయమనియోజించి) పతఙ్గవత్=మిడతవలెనే, వహ్నిముఖం = అగ్నినోటిని, (నోటియం దనుట) వివిక్షుః=ప్రవేశించు నిచ్ఛగలవాఁడై, ఉమాసమక్షం పార్వతీదేవిదగ్గర, హరబద్ధలక్ష్యః = శివునిమీఁద పెట్టఁబడిన గుఱిగలవాఁడై, శరాసనజ్యాం=వింటినారిని, ముహుః=మాటికి, ఆమమర్శ=స్పృశించెను.

తా. పార్వతీదేవి శివునివద్దనుండుటయె తనబాణప్రయోగము నకుఁ దగినసమయమని దలంచి అగ్నిలో నుఱుకు మిడతవలె హరుని మీఁద గుఱిపెట్టినబాణముఁ గలవాఁడై నారిని పలుమాఱుస్పృశించెను.

వ్యా. కామ ఇతి.—కామస్తు, బాణావసరం ప్రతీక్ష్యోమాసన్నిధానాదయమేవ బాణప్రయోగసమయ ఇతి జ్ఞాత్వా, పతఙ్గేన తుల్యం పతఙ్గవచ్ఛలభవత్. ని. 'సమౌ పతఙ్గశలభౌ' ఇత్యమరః. 'తేన తుల్యం క్రియా చేద్వతిః' ఇతి వతిప్రత్యయః. వహ్నిముఖం, వివిక్షుః ప్రవేష్టుమిచ్ఛుః విశతేః సన్నన్తాదుప్రత్యయః. ఉమాయాః సమక్షమక్ష్ణః సమీపముమాసమక్షమ్. 'అవ్యయీభావే శరత్ప్రభృతిభ్యః' ఇతి సమాసాన్తోఽచ్ప్రత్యయః. హరే బద్ధలక్ష్యః సన్, శరాసనస్య జ్యాం మౌర్వీం, ముహురామమర్శ పరామృష్టవాన్.

అథోపనిన్యే గిరిశాయ గౌరీ తపస్వినే తామ్రరుచా కరేణ,
విశోషితాం భానుమతో మయూఖైర్మన్దాకినీ పుష్కరబీజమాలామ్.

టీ. అథ=పిమ్మట, గౌరీ=పార్వతీదేవి, తపస్వినే = తపశ్శాలియగు, గిరిశాయ = శివునికొఱకు, తామ్రరుచా = ఎఱ్ఱనికాంతిగల, కరేణ = హస్తముచేత, భానుమతః = సూర్యునియొక్క; మయూఖైః=కిరణములచే, విశోషితాం=ఎండింపఁబడిన, మందాకినీ పుష్కర బీజమాలాం-మందాకినీ = గంగయొక్క, పుష్కర=పద్మములయొక్క, బీజ= గింజలయొక్క, మాలాం=మాలికను, ఉపనిన్యే=సమర్పించెను.

తా. పిమ్మట పార్వతీదేవి సూర్యకిరణములచే నెండింపఁబడిన తామరపూసల తావళమును తనచేతితో శివుని కిచ్చెను.

వ్యా. అథేతి.—అథ గౌరీ తపోఽస్యాస్తీతి తపస్వీ 'అస్ మాయా మేధా స్రజో వినిః' ఇతి వినిప్రత్యయః. తస్మై తపస్వినే గిరిశాయ, తామ్రరుచా రక్తవర్ణేన కరేణ భానుమతోఽంశుమతో మయూఖైర్విశోషితాం మన్దాకిన్యాః పుష్కరాణి పద్మాని తేషాం బీజాని తేషాం మాలాం జపమాలికాముపనిన్యే సమర్పితవతీ.

ప్రతిగ్రహీతుం ప్రణయిప్రియత్వాత్
త్రిలోచనస్తాముపచక్రమే చ,
సంమోహనం నామ చ పుష్పధన్వా
ధనుష్యమోఘం సమధత్త బాణమ్. 66

టీ. త్రిలోచనశ్చ=శివుఁడును, ప్రణయిప్రియత్వాత్=యాచకుల కిష్టుఁడగుట వలన, తాం=ఆతావళమును, ప్రతిగ్రహీతుం=కైకొనుటకు, ఉపచక్రమే=అంగీకరించెను. పుష్పధన్వా చ=మరుఁడును, సంమోహనం నామ=సమ్మోహనమను ప్రసిద్ధిగల, అమోఘం=వ్యర్థముగాని, బాణం=అమ్మును, ధనుషి=వింటియందు, సమధత్త=కూర్చెను.

తా. ఆశ్రితపక్షపాతియగు నీశ్వరుఁడాతావళమును గైకొనుట కంగీకరించెను. మారుఁడు సార్థకమగు సమ్మోహనాస్త్రమును వింట సంధించెను.

వ్యా. ప్రతిగ్రహీతుమితి.—త్రిలోచనశ్చ ప్రణయిప్రియత్వాదర్థిప్రియత్వాత్ తామక్షమాలాం ప్రతిగ్రహీతుం స్వీకర్తుముపచక్రమే. పుష్పం ధనుర్యస్య స పుష్పధన్వా కామశ్చ 'వా సంజ్ఞాయామ్' ఇత్యనఙాదేశః. సమ్మోహ్యతేఽనేనేతి సమ్మోహనం నామ నామేతి ప్రసిద్ధౌ. అమోఘం బాణం సాయకం ధనుషి సమధత్త సంహితవాన్.

హరస్తు కించిత్పరిలుప్తధైర్యశ్చన్ద్రోదయారమ్భ ఇవామ్బురాశిః,
ఉమాముఖే బిమ్బఫలాధరోష్ఠే వ్యాపారయామాస విలోచనాని.

టీ. హరస్తు = హరుఁడును, చంద్రోదయారంభే = చంద్రుఁ డుదయించువేళను, అంబురాశిరివ = సముద్రుఁడువలె, కించిత్ = కొంచెము, పరిలుప్త ధైర్యః = తగ్గిన ధీరతాగుణముగలవాఁడై, బింబఫలాధరోష్ఠే = దొండపండువంటి క్రిందిపెదవిగల, ఉమాముఖే = పార్వతీదేవి మోమునందు, విలోచనాని = నేత్రములను, వ్యాపారయామాస = (ప్రేమతో) ప్రసరింపఁజేసెను.

తా. శివుఁడు కొంచెము ధైర్యముతగ్గినవాఁడై మూఁడుకండ్లతో నెఱ్ఱని పెదవిగల పార్వతీదేవి మోము నభిలాషతోఁ జూచెను.

వ్యా. హరఇతి.—హరస్తు హరోఽపి చన్ద్రోదయారమ్భేఽమ్బురాశిరివ కిఞ్చిదీషత్ పరిలుప్తధైర్యః. న తు ప్రాకృతజనవదత్యన్తలుప్త ధైర్య ఇతి భావః. బిమ్బఫలతుల్యోఽధరోష్ఠో యస్య తస్మిన్నుమాముఖే విలోచనాని వ్యాపారయామాస త్రిభిరపి లోచనైః సాభిలాషమద్రాక్షీదిత్యర్థః. ఏతేన భగవతో రతిభావోదయఉక్తః.

వివృణ్వతీ శైలసుతాఽపి భావమఙ్గైస్స్ఫురద్బాలకదమ్బకల్పైః,
సాచీకృతా చారుతరేణ తస్థౌ ముఖేన పర్యస్తవిలోచనేన. 68

టీ. శైలసుతాపి = పార్వతీదేవియును, స్ఫురద్బాల కదంబకల్పైః = వికసించిన నూతనకడిమితో సమానములగు (పులకరింపఁబడిన), అంగైః = అవయవములతో, భావం = రత్యాఖ్యమగు శృంగారభావమును, వివృణ్వతీ = తెలియఁజేయుచు, చారుతరేణ = మిక్కిలి సుందరమగు, పర్యస్తవిలోచనేన = సిగ్గుచే బెదరినకనులుగల, ముఖేన = మోముతో, సాచీకృతా = అడ్డుగాఁజేయఁబడినదై, తస్థౌ = ఉండెను.

పార్వతీదేవియు పులకరించిన సర్వావయవములుగలదియై ప్రకటనఁజేయఁబడిన శృంగారభావముగలదియై సిగ్గుచే చలించిన నేత్రములుగలదై మోమునడ్డుగాఁ ద్రిప్పుకొని యుండెను.

వ్యా. వివృణ్వతీతి.—శైలసుతాఽపి, స్ఫురద్బాలకదమ్బకల్పైర్వికసత్కోమల నీపసదృశైః పులకితైరిత్యర్థః. 'ఈషదసమాప్తౌ' ఇత్యాదినా కల్పప్ప్రత్యయః. అఙ్గైర్భావం రత్యాఖ్యం వివృణ్వతీ ప్రకాశయన్తీ చారుతరేణ పర్యస్తవిలోచనేన వ్రీడావిభ్రాన్తనేత్రేణ ముఖేనాసాచి సాచి సంపద్యమానా సాచీకృతా తిర్యక్కృతా. ని. 'తిర్యగర్థే సాచి తిరః' ఇత్యమరః. తస్థౌ హ్రియా ముఖం సాచీకృత్య స్థితేత్యర్థః. న కేవలం హరస్యైవ దేవ్యా అప్యుదితో రతిభావ ఇతి భావః.

అథేన్ద్రియక్షోభమయుగ్మనేత్రః పునర్వశిత్వాద్బలవన్నిగృహ్య,
హేతుం స్వచేతోవికృతేర్దిదృక్షుర్దిశాముపాన్తేషు ససర్జ దృష్టిమ్.

టీ. అథ=పిమ్మట, అయుగ్మనేత్రః = విషమాక్షుఁ డగుహరుఁడు, వశిత్వాత్ = జితేంద్రియుఁ డగుటవలన, ఇంద్రియక్షోభం = ఇంద్రియములవికారమును, పునః = మఱియు, బలవత్ = బలముగా, నిగృహ్య = నివారించి, స్వచేతో వికృతేః=తనచిత్త వికారమునకు, హేతుం=కారణమును, దిదృక్షుః=చూడఁదలఁచుకొన్నవాఁడై, దిశాం= దిక్కులయొక్క, ఉపాంతేషు = ప్రాంతములయందు, దృష్టిం = చూపును, ససర్జ = ప్రసరించెను.

తా పిమ్మట జితేంద్రియుఁడు గావున హరుఁడు తనయింద్రియ ముల వికారమునాపి తన మనశ్చాంచల్యమునకుఁ గారణము నఱయు వాఁడై దిక్కులకుఁ దనచూపు నిగిడ్చెను.

వ్యా. అథ అయుగ్మాని నేత్రాణి యస్యసోఽయుగ్మనేత్రస్త్రినేత్రో వశిత్వాజ్జి తేన్ద్రియత్వాదిన్ద్రియక్షోభం పూర్వోక్తమిన్ద్రియవికారం పునర్బలవద్భృశం నిగృహ్య నివార్య స్వచేతోవికృతేః స్వచిత్తవికారస్య హేతుం కారణం దిదృక్షుర్ద్రష్టుమిచ్ఛు ర్దిశాముపాన్తేషు దృష్టిం ససర్జ ప్రసారయామాస.

స దక్షిణాపాఙ్గనివిష్టముష్టిం నతాంసమాకుఞ్చితసవ్యపాదమ్,
దదర్శ చక్రీకృతచారుచాపం ప్రహర్తుమభ్యుద్యతమాత్మయోనిమ్.

టీ. సః=శివుఁడు, దక్షిణాపాంగనివిష్టముష్టిం - దక్షిణాపాంగ = కుడికన్గంటి సన్నిధిని, నివిష్ట=ఉన్నట్టి, ముష్టిం=పిడికిలిగలయట్టియు, నతాంసం = వంచఁబడిన భుజ ములుగలయట్టియు, ఆకుంచితసవ్యపాదం = వంపఁబడిన యెడమకాలుగలయట్టియు, చక్రీకృతచారుచాపం - చక్రీకృత = మండలాకారముగాఁజేయఁబడిన, చారు=సుందర మగు, చాపం=ధనుస్సుగలయట్టియు, ప్రహర్తుం=ఏయుటకు, అభ్యుద్యతం = ఉద్యుక్తుఁ డగు, ఆత్మయోనిం=మారుని, దదర్శ=చూచెను.

తా. ఇట్లీశ్వరుఁడుచూచి కుడికన్గంటివఱకు ఆకర్షించినబాణము పిడికిటియందుఁగల్గి కొంచెమువంగిన యెడమకాలును భుజములునుగల్గి మండలాకారముగానున్న విల్లును ధరించి యేయుట కుద్యుక్తుఁ డగు మారునిఁ జూచెను.

వ్యా. స ఇతి.—భగవాన్దక్షిణాపాఙ్గే నివిష్టా స్థితా ముష్టిర్యస్య తం, నతాంస మాకుఞ్చితః సవ్యపాదో యస్య తమ్ అలీఢాఖ్యస్థానకే స్థితమిత్యర్థః. చక్రీకృతచారు చాపం మణ్డలీకృతసౌమ్యకోదణ్డం ప్రహర్తుమభ్యుద్యతమాత్మయోనిం మనోభవం,దదర్శ. ఆలీఢలక్షణమాహ యాదవః. 'స్థానాని ధన్వినాం పఞ్చ తత్ర వైశాఖమస్త్రియామ్

వితస్త్యన్తరగౌ పాదౌ మణ్డలం తోరణాకృతి, సమానౌ స్యాత్సమపదమాలీఢం పద మగ్రతః, దక్షిణం వామమాకుఞ్చ్య ప్రత్యాలీఢం విపర్యయః' ఇతి.

తపఃపరామర్శవివృద్ధమన్యోర్భ్రూభఙ్గదుష్ప్రేక్ష్యముఖస్య తస్య,
స్ఫురన్నుదర్చిస్సహసా తృతీయాదక్ష్ణః కృశానుః కిల నిష్పపాత 71

టీ. తపఃపరామర్శవివృద్ధమన్యోః - తపఃపరామర్శ = తపస్సుచెర్చచేత, వివృద్ధ మన్యోః=పెఱిగినకోపముగలవాఁడును, భ్రూభఙ్గదుష్ప్రేక్ష్యముఖస్య-భ్రూభంగ=బొమ ముడిచే, దుష్ప్రేక్ష్య = చూడశక్యముగాని, ముఖస్య=మోముగలవాఁడునగు, తస్య= ఆశివునియొక్క, తృతీయాత్ అక్ష్ణః = మూఁడవకంటినుండి, స్ఫురన్=ప్రకాశించు చున్న, ఉదర్చిః = బైలువెడలినజ్వాలగల, కృశానుః=అగ్ని, సహసా = వేగముగా, నిష్పపాత=వెడలెను.

తా. తపస్సుచే పెఱిగిన కోపముగలయట్టియు, బొమముడిచేఁ జూడ నలవికాని మోముగలయట్టి శివుని మూఁడవకంటినుండి జ్వాలలు గల నిప్పులేచెను.

వ్యా. తపఇతి.—తపః పరామర్శేన తపస ఆస్కన్దనేన వివృద్ధమన్యోః ప్రవృద్ధ కోపస్య, భ్రూభఙ్గేన దుష్ప్రేక్ష్యం దుర్దర్శం ముఖం యస్య తస్య హరస్య, తృతీయా దక్ష్ణః. స్ఫురన్దీప్యమాన ఉదర్చిరుద్యాతజ్వాలః కృశానురగ్నిః సహసాఽతర్కితమేవ. ని. 'అతర్కితే తు సహసా' ఇత్యమరః. నిష్పపాత కిల నిశ్చక్రామ ఖలు.

క్రోధం ప్రభో సంహర సంహరేతి యావద్గిరః ఖే మరుతాం చరన్తి,
తావత్స వహ్నిర్భవనేత్రజన్మా భస్మావశేషం మదనం చకార. 72

టీ. ప్రభో=ప్రభువా, క్రోధం=కోపమును, సంహర సంహర=తగ్గింపుము తగ్గిం పుము. ఇతి అని, మరుతాం = దేవతలయొక్క, గిరః=మాటలు, ఖే=ఆకాశమునందు, యావత్=ఎంతలో, చరన్తి=ప్రవర్తించుచున్నవో, తావత్ = అంతలో, భవనేత్ర జన్మా=హరనేత్రమునఁబుట్టిన, స వహ్నిః=ఆయగ్ని, మదనం=మన్మథుని, భస్మావశేషం= బూడిదయే మిగతగలవానినిగాను, చకార=చేసెను.

తా. ప్రభువా! కోపము శాంతింపుమని దేవతలు వేఁడుచుండఁగనే హరనేత్రజాతమగు నగ్ని మారుని బూడిద గావించెను.

వ్యా. క్రోధమితి.—హే ప్రభో స్వామిన్, క్రోధం సంహర సంహర నివ ర్తయ నివర్తయ 'చాపలే ద్వే భవత ఇతి వక్తవ్యమ్'ఇతి వార్తికేన ద్విత్వమ్ 'సంభ్రమేణ

వృత్తిశ్చాపలమ్' ఇతి కాశికా. ఇత్యేవం మరుతాం దేవానాం గిరో వాచః ఖే వ్యోమ్ని యావచ్చరన్తి ప్రవర్తన్తే తావత్తత్కాలమేవ భవస్య నేత్రాజ్జన్మ యస్యాస భవనేత్రజన్మా 'అవర్జ్యో బహువ్రీహిర్వ్యధికరణో జన్మాద్యుత్తరపద' ఇతి వామనః. స వహ్నిర్మదనం, భస్మైవావశేషో యస్య తం భస్మావశేషం చకార దదాహేత్యర్థః.

తీవ్రాభిషఙ్గప్రభవేణ వృత్తిం
మోహేన సంస్తమ్భయతేన్ద్రియాణామ్,
అజ్ఞాతభర్తృవ్యసనా ముహూర్తం
కృతోపకారేవ రతిర్బభూవ.

టీ. తీవ్రాభిషంగప్రభవేణ = తీక్ష్ణమగుదుఃఖమే కారణముగలదియై, ఇంద్రియాణాం=చక్షురాదీంద్రియములయొక్క, వృత్తిం=వ్యాపారమును, సంస్తంభయతా=కట్టుచున్న, మోహేన = మోహముచే, రతిః = మారునిపెండ్లాము, ముహూర్తం=క్షణకాలము, అజ్ఞాతభర్తృవ్యసనా - అజ్ఞాత=తెలియని, భర్తృవ్యసనా = పెనిమిటి నాశనమువలని దుఃఖముగలదియై, కృతోపకారేవ = చేయఁబడిన యుపకారముగలదివలె, బభూవ = ఉండెను.

తా. పొందశక్యముకాని దుఃఖముచే నింద్రియవ్యాపారము నశించి మూర్ఛబోయిన రతీదేవి కామూర్ఛ క్షణకాల మాప్రియవియోగదుఃఖము నెఱుకఁబడకుండఁ జేయుటచే నుపకారప్రాయమే యాయెను.

వ్యా. తీవ్రేతి.—తీవ్రాభిషఙ్గప్రభవేణాతిదుస్సహాభిభవసంభవేన. ని. 'అభిషఙ్గస్త్వభిభవే సఙ్గ ఆక్రోశనేఽపి చ' ఇతి వైజయన్తీ. ఇన్ద్రియాణాం చక్షురాదీనాం వృత్తిం వ్యాపారం సంస్తమ్భయతా ప్రతిబధ్నతా మోహేన మూర్ఛయా కర్త్ర్యా రతిర్మదనభార్యా ముహూర్తమజ్ఞాతం భర్తృవ్యసనం భర్తృనాశో యయా సా తథోక్తా సతీ కృతోపకారేవ బభూవ-సహసా దుఃఖోపనిపాతాన్మమూర్ఛేత్యర్థః. మోహేన దుఃఖసంవేదనాభావాత్తస్యోపకారకత్వోక్తిః.

తమాశు విఘ్నం తపసస్తపస్వీ వనస్పతిం వజ్ర ఇవావభజ్య,
స్త్రీసన్నికర్షం పరిహర్తుమిచ్ఛన్నన్తర్దధే భూతపతిస్సభూతః. 74

టీ. తపస్వీ భూతపతిః = తపోనిష్ఠుఁడగు నీశ్వరుఁడు, తపసః = తపస్సునకు, విఘ్నం=అంతరాయమగు, తం=మరుని, ఆశు=శీఘ్రముగా, వజ్రః=పిడుగు, వనస్పతిమివ = వృక్షమునువలెను, అవభజ్య = ఛేదించి, స్త్రీసన్నికర్షం = స్త్రీసన్నిధానమును,

పరిహర్తుం = తొలఁగించుకొనుటకై. ఇచ్ఛన్ = కోరుచు, సభూతః = ప్రమథులతో, అంతర్దధే = కనుమఱుఁగెను.

తా. తపశ్శాలియగు నీశ్వరుఁడు తపోవిఘ్నమగు కాముని జంపి తపోవిఘ్నకారులగుటచే స్త్రీసాన్నిధ్యముఁ దొలఁగించుకొనుటకై తన ప్రమథగణములతో నంతర్ధాన మాయెను.

వ్యా. తమితి.—తపస్వీ తపోనిష్ఠో భూతపతిః శివస్తపసో విఘ్నమన్తరాయభూతం తం కామమాశు వజ్రోఽశనిర్వనస్పతిం వృక్షమివావభజ్య భఙ్క్త్వా స్త్రీసన్నికర్షం స్త్రీసన్నిధానం పరిహర్తుమిచ్ఛన్ తస్యానర్థహేతుత్వాదితి భావః. సభూతః సగణః సన్నన్తర్దధే.

శైలాత్మజాఽపి పితురుచ్ఛిరసోఽభిలాషం
వ్యర్థం సమర్థ్య లలితం వపురాత్మనశ్చ,
సఖ్యోః సమక్షమితి చాధికజాతలజ్జా
శూన్యా జగామ భవనాభిముఖీ కథంచిత్. 75

టీ. శైలాత్మజాపి = పార్వతీదేవియును, ఉచ్ఛిరసః = గొప్పవాఁడగు, పితుః= తండ్రియొక్క, అభిలాషం = కోర్కెయు, లలితం = చక్కని, ఆత్మనః=తనయొక్క, వపుశ్చ=శరీరమును, వ్యర్థం=నిష్ప్రయోజనమగుటను, సమర్థ్య = విచారించి, సఖ్యోః= సఖురాండ్రయొక్క, సమక్షం=ఎదుటను (అయినదిగదా), ఇతి=అని, అధికజాతలజ్జా= ఎక్కువయగు సిగ్గుగలదియై, శూన్యా = ఉత్సాహములేనిదై, కథంచిత్ = కష్టముచే, భవనాభిముఖీ=ఇంటి కభిముఖముగా, జగామ=పోయెను.

తా. గొప్పవాఁడగు తనతండ్రి కీశ్వరుని కివ్వవలయుననుకోరికయు, తనశరీరసౌందర్యమును వ్యర్థమయినవిగదా యనియు తనకీయవమానము చెలికత్తెలయెదుట నయినదికదా యనియు నిరుత్సాహముతో నింటికిఁ బోయెను.

వ్యా. శైలాత్మజేతి.—శైలాత్మజా పార్వత్యప్యుచ్ఛిరస ఉన్నతశిరసో-మహతః, పితురభిలాషం హరో వరోఽస్త్వితి మనోరథం లలితం సున్దరమాత్మనోవపుశ్చ వ్యర్థం నిష్ఫలం, సమర్థ్య విచార్య సఖ్యోః. సమక్షం పుర, ఇతి చ హేతునాఽధికం జాతలజ్జా - సమానజనసమక్షమవమానస్యాతిదుస్సహత్వాదితి భావః. శూన్యా నిరుత్సాహా సతీ, కథంచిత్ కృచ్ఛ్రేణ భవనస్యాభిముఖీ జగామ.

సపది ముకులితాక్షీం రుద్రసంరమ్భభీత్యా
దుహితరమనుకమ్ప్యామద్రిరాదాయ దోర్భ్యామ్,

సురగజ ఇవ బిభ్రత్ పద్మినీం దన్తలగ్నాం
ప్రతిపథగతిరాసీద్వేగదీర్ఘీకృతాఙ్గః. 76

టీ. సపది=అపుడు, అద్రిః = హిమవంతుఁడు, రుద్రసంరంభభీత్యా = ఈశ్వర కోపమువలనిభయముచే, ముకుళితాక్షీం = మూయఁబడిన కన్నులుగలదైనట్టియు, అనుకమ్ప్యాం=కనికరింపఁదగిన, దుహితరం=కూఁతును, దోర్భ్యాం=చేతులతో, ఆదాయ=గ్రహించి, దన్తలగ్నాం=కోఱలలో తగిలియున్న, పద్మినీం=తామరతూడును, బిభ్రత్=ధరించిన, సురగజ ఇవ = ఐరావతమువలె, వేగదీర్ఘీకృతాంగః = వేగముచే పొడవుగాఁజేయఁబడిన దేహముగలవాఁడై, ప్రతిపథగతిః = మార్గానుసారియగు గమనము గలవాఁడై, ఆసీత్=ఆయెను.

తా. ఈశ్వరాంగ్ని నేత్రాదులచే భీతురాలైనది గనుకనే కనికరింపఁదగినట్టియు, మూయఁబడిన కన్నులుగలకూఁతును హిమవంతుఁడు బాహువులతోఁ బట్టుకొని దంతములయందున్న తామరతూటిచే నైరావతమువలె నున్నట్టియు, పొడవుగాఁ జేయఁబడిన దేహముగల హిమవంతుఁడు మార్గము ననుసరించి పోయెను.

ఇది కుమారసంభవమున మూఁడవసర్గము ముగిసెను.

వ్యా. సపదీతి.—సపద్యద్రిర్హిమవాన్ రుద్రస్య సంరమ్భాత్ కోపాద్భీత్యా. ని. 'సంరమ్భః సంభ్రమే కోపే' ఇతి విశ్వః. ముకుళితాక్షీం నిమీలితనేత్రాం 'బహుబ్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్ షచ్' ఇతి షచ్ప్రత్యయః. 'షిద్గౌరాదిభ్యశ్చ' ఇతి జీష్. అనుకమ్పితుమర్హామనుకమ్ప్యామ్ 'ఋహలోర్ణ్యత్' ఇతి ణ్యత్ప్రత్యయః. దుహితరం దోర్భ్యామాదాయ దన్తయోర్లగ్నాం, పద్మినీం నలినీం బిభ్రత్ సురగజ ఇవ, వేగేన రయేణ దీర్ఘీకృతాఙ్గః. ఆయతీకృతశరీరః సన్, పన్థానం ప్రతిగతా ప్రతిపథా మార్గానుసారిణీ గతిర్యస్య స ప్రతిపథగతిరాసీత్ పన్థానమనుసృత్య జగామేత్యర్థః.

ఇతి శ్రీ మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరివిరచితయా
సంజీవనీసమాఖ్యయా వ్యాఖ్యయా సమేతః శ్రీకాళిదాసకృతౌ
కుమారసంభవే మహాకావ్యే మదనదాహో నామ
తృతీయఃసర్గః.

శ్రీ ర స్తు

# కు మా ర సం భ వ ము

## చ తు ర్థ స ర్గ ము.

అథ మోహపరాయణా సతీ వివశా కామవధూర్విబోధితా,
విధినా ప్రతిపాదయిష్యతా నవవైధవ్యమసహ్యవేదనమ్. 1

అవ. రతీదేవి మూర్ఛపోయెనని చెప్పఁబడెను. ఇప్పుడావార్తను జెప్పుచున్నాఁడు.—

టీ. అథ=అనంతరమున, మోహపరాయణా = మోహపరవశురాలయినట్టియు, సతీ=పతివ్రతయయినట్టియు, వివశా=నిశ్చేష్టురాలగు, కామవధూః = రతీదేవి, అసహ్యవేదనం - అసహ్యా = ఓర్వశక్యముగాని, వేదనం = దుఃఖముగలదియగు, నవవైధవ్యం=క్రొత్తముండమోపితనమును, ప్రతిపాదయిష్యతా=అనుభవించునట్లు సేయుచున్న, విధినా=దైవముచే, విబోధితా=మూర్ఛనుండి మేలుకొలుపఁబడెను.

తా. అట్లు భర్తమరణమునకై చింతించి మూర్ఛవోయినపిమ్మట ఆవిధి యీరతీదేవిచే క్రొత్తముండమోపి యొక్కకష్టము ననుభవింపఁ జేయుటకు మూర్ఛనుండి తేర్చెను. (అనఁగా మూర్ఛపోయి యొడలెఱుఁగకపడియున్న రతీదేవి పాప మీక్రొత్తముండమోపితనమును దాల్చుటకుఁ గొంతసేపటికి మూర్ఛనుండి లేచెను.)

అవ. మూర్ఛితా రతిరిత్యుక్తమ్ - సంప్రతి తద్వృత్తాన్తమేవాహ.—

వ్యా. అథేతి.—అథానన్తరం, మోహో మూర్ఛా పరమయనమాశ్రయో యస్యాః సా మోహపరాయణా మోహైకశరణా సతీ. ని. 'పరాయణమభిప్రేతే తత్పరే పరమాశ్రయే' ఇతి యాదవః. వివశా మూఢత్వాన్నిశ్చేష్టా కామవధూ రతిః, అసహ్యా దుస్సహా వేదనా యస్మింస్తత్తథోక్తం, విధవాయా గతభర్తృకాయా భావో వైధవ్యం, నవం చ తద్వైధవ్యం చేతి నవవైధవ్యం, నవగ్రహణం దుస్సహత్వద్యోతనార్థం, ప్రతిపాదయిష్యతాఽనుభావయిష్యతా క్రియార్థక్రియాయాం ల్రుట్, విధినా దైవేన. ని. 'విధిర్విధానే దైవే చ' ఇత్యమరః. విబోధితా, వైధవ్యానుభవై

కఫలో౽యం విధిరితి భావః. అస్మిన్ సర్గే వియోగినీవృత్తాని. 'విషమే ససజా గురుః సమే సభరా లో౽థ గురుర్వియోగినీ' ఇతి లక్షణాత్.

అవధానపరే చకార సా ప్రలయాన్తోన్మిషితే విలోచనే,
న వివేద తయోరతృప్తయోః ప్రియమత్యన్తవిలుప్తదర్శనమ్. 2

టీ. సా=ఆరతీదేవి, ప్రలయాన్తోన్మిషితే - ప్రలయాన్త = మూర్ఛావసానమున, ఉన్మిషితే=విప్పఁబడిన, విలోచనే=కన్నులను, అవధానపరే=స్మృతిప్రధానముగలవిగా, చకార=చేసెను. ప్రియం=ప్రియుఁడగు మరునిఁగూర్చి, అతృప్తయోః = తృప్తినొందని, తయోః=ఆకన్నులకు, అత్యన్తవిలుప్తదర్శనం - అత్యన్త = మిక్కిలి, విలుప్త=నష్టమగు, దర్శనం=దర్శనముకలవానినిగా, న వివేద=ఎఱుఁగదాయెను.

తా. ఎంతజూచినను తృప్తిదీరని కామరూపముగల రతీదేవి మూర్ఛనుండి తేఱి దిశలను బరీక్షించెనుగాని యగపడకపోవుటకు కారణము భస్మమగుట యనిమాత్రము తెలియకపోయెను. (రతీదేవి కామునిరూపము నెప్పుడు తనివిదీరక చూచుచుండును. అయినను మఱియు చూచుచునే యుండును. అట్టి చక్కనిరూపు తిరిగి యామెకంటికగపడక పోయెననుట)

వ్యా. అవేతి.— సా రతిః, ప్రలయాన్తే మూర్ఛావసానే. ని. 'ప్రలయో నష్టచేష్టతా' ఇత్యమరః. ఉన్మిషితే విలోచనే, అవధానం పరం ప్రధానం యయోస్తే ౽వధానపరే దిదృక్షయా౽వహితే చకార. ద్రష్టవ్యాభావాత్తు న వివేదేత్యాహ- నేతి ప్రియం కామమతృప్తయోస్తృప్తిం న గతయోః. నిత్యదిదృక్షమాణయోరిత్యర్థః, తయోర్లోచనయోః దర్శనక్రియాపేక్షయా సంబన్ధే షష్ఠీ. అత్యన్తం విలుప్తం దర్శనం స్వలోచనయోః కరణయోర్యస్య కర్మభూతస్య తమత్యన్తవిలుప్తదర్శనం సన్తం, న వివేద న జ్ఞాతవతీ. ప్రియనాశాపరిజ్ఞానాద్దిదృక్షాఞ్చక్రే ఇతి తాత్పర్యార్థః.

'అయి జీవితనాథ జీవసీ' త్యభిధాయోత్థితయా తయా పురః,
దదృశే పురుషాకృతి క్షితౌ హరకోపానలభస్మ కేవలమ్. 3

టీ. అయిజీవితనాథ=ఓప్రాణేశ్వరా ! జీవసి=జీవించియుంటివా ? ఇతి=అని, అభిధాయ=పలికి, ఉత్థితయా=లేచిన, తయా = ఆరతీదేవిచే, పురః=ఎదుట, క్షితౌ=భూమియందు, పురుషాకృతి = పురుషునియాకారమువంటి యాకారముగల, కేవలం=ఒక్క, హరకోపానలభస్మ-హర = హరునియొక్క, కోపానల=కోపాగ్నిసంబంధమగు (అనఁగా

హరునికోపాగ్నిచే కాలి బూడిదయైన పురుషాకృతిగాపడియున్న), భస్మ=బూడిద, దదృశే = చూడఁబడెను.

తా. ఓనాప్రాణనాథుఁడా ! బ్రతికియుంటివా ? అని పలికి లేచిన రతీదేవియెదటి భూమిభాగమున పురుషాకారము బోధించునట్టియు పర మేశునికోపాగ్నిచే భస్మముగా చేయఁబడిన బూడిదమాత్రమే యగ పడెను.

వ్యా. అయీతి.—అయీతి ప్రశ్నే. ని. 'అయి ప్రశ్నానునయయోః' ఇతి విశ్వః. అయి జీవితనాథ, జీవసి ప్రాణిషి కచ్చిదిత్యభిధాయోత్థితయా, తయా రత్యా పురోఽగ్రే, క్షితౌ, పురుషస్యాకృతిరివాకృతిర్యస్య తత్పురుషాకృతి కేవలమేకం, హర కోపానలభస్మ దదృశే దృష్టమ్ న తు పురుష ఇతి భావః.

అథ సా పునరేవ విహ్వలా వసుధాలిఙ్గనధూసరస్తనీ,
విలలాప వికీర్ణమూర్ధజా సమదుఃఖామివ కుర్వతీ స్థలీమ్. 4

టీ. అథ=పిమ్మట, పునరేవ=మఱియు, విహ్వలా=పరవశయై, వసుధాలిఙ్గనధూస రస్తనీ-వసుధా=భూమియొక్క, ఆలిఙ్గన=కౌఁగిలించుకొనుటచే, ధూసర=బూడిదరంగు గల, స్తనీ = స్తనములుగలదై, వికీర్ణమూర్ధజా = విరిసి వ్రేలాడుచున్న తలవెండ్రుకలు గలదియై, సా=ఆరతీదేవి, స్థలీం=అస్థావ్యాశ్రమవనభూమిని (అనఁగా నచ్చటనున్న ప్రాణివర్గముననుట), సమదుఃఖాం = సమానముగా దుఃఖముగలదానినిగా, కుర్వతీవ = చేయుచున్నదియువలె, విలలాప=విలాపము చేసెను. (దుఃఖించెననుట.)

తా. పిమ్మటాఁరతీదేవి యెదుటనున్న భస్మరాశి తనపెనిమిటి శరీ రము భస్మముకాగా నయినదే యని తలంచి క్రిందఁబడి పొరలి బూడిద యంటుకొని బూడిదరంగుగలవై యున్న పాలిండ్లతోను క్రిందవ్రేలు చున్న తలవెండ్రుకలతోనుగూడినదై యేడ్చెను. ఆయేడ్పావనమునకుఁ గూడ నీమెతో సమానదుఃఖముగల్గెనా యనున ట్లుండెననుట.

వ్యా. అథేతి.—అథ భస్మదర్శనానన్తరం పునరేవ విహ్వలా విక్లబా, వసుధా లిఙ్గనధూసరస్తనీ - వసుధాలిఙ్గనేన క్షితిలుణ్ఠనేన-ధూసరౌ ధూసరవర్ణౌ - స్తనౌ కుచౌ యస్యాః సా తథోక్తా, 'స్వాంగాచ్చోపసర్జనాదసంయోగోపధాత్' ఇతి జీష్. వికీర్ణ మూర్ధజా-వికీర్ణా విక్షిప్తా మూర్ధజాః కేశాః యస్యాః సా తథోక్తా సా రతిః. స్థలీం వనభూమిం తత్రత్యాన్ ప్రాణిన ఇత్యర్థః. 'జానపదకుణ్డగోణస్థల' ఇత్యాదినా జీష్. సమదుఃఖాం స్వతుల్యశోకాం, కుర్వతీవ, విలలాప పరిదేవితవతీ. ని. 'విలాపః పరిదేవ నమ్' ఇత్యమరః.

ఉపమానమభూద్విలాసినాం కరణం యత్తవ కాన్తిమత్తయా,
తదిదం గతమీదృశీం దశాం న విదీర్యే కఠినాః ఖలు స్త్రియః. 5

టీ. తవ=నీయొక్క, యత్ కరణం=ఏదేహము, కాన్తిమత్తయా = సౌందర్యకారణముచే, విలాసినాం=విలాసవంతులకు, ఉపమానం=పోల్చఁదగినదియై, అభూత్=ఆయెనో, తత్ కరణం=ఆశరీరము, ఇదమ్ = ఇదే, ఈదృశీం దశాం = ఇట్టి యవస్థను, గతం=పొందెను. (అట్లైనను) న విదీర్యే = చీల్పఁబడకుంటిని, స్త్రియః = స్త్రీలు, కఠినాఃఖలు=కఠినులుగదా?

తా. లోకములో చక్కని విలాసవంతుల కేనీశరీరము పోల్పం దగియుండునో, అట్టిశరీర మిదుగో ఇట్టి (యవస్థను బూడిదయగుటను పొందియున్నది.) అట్లు భస్మముగానున్న నీశరీరముఁజూచియు నాకు మృతిలేదనుట యేదికలదో అదె స్త్రీలు కఠినులనుటకుఁ దార్కాణము. (లోకములో చక్కనివానిని మన్మథునివలె నున్నాఁడనుప్రసిద్ధిని బట్టిన దీవాక్యము.)

వ్యా. ఉపేతి—తవ, యత్, కరణం గాత్రం. ని. 'కరణం సాధకతమం క్షేత్రగాత్రేన్ద్రియేష్వపి' ఇత్యమరః. కాన్తిమత్తయా సౌన్దర్యేణ హేతునా, విలాసినాం విలసనశీలానాం 'వౌ కషలస' ఇత్యాదినా ఘినుణ్ప్రత్యయః. ఉపమీయతే యేన తదుపమానమభూత్, తత్కరణమిదమీదృశీం, దశామవస్థాం, గతం ప్రాప్తం భస్మీభూతమిత్యర్థః. తథాఽపి న విదీర్యే న విదీర్ణా భవామి. కర్తరిలట్. తథా హి, స్త్రియః కఠినాః ఖలు-కఠినత్వాదవిదీర్యమాణత్వమిత్యర్థః. కారణాత్ కార్యసమర్థనరూపోఽర్థాన్తరన్యాసః - 'ధీరసంచారిణీ దృష్టిర్గతిర్గోవృషభాఞ్చితా, స్మితపూర్వం తథాఽఽలాపో విలాస ఇతి కీర్తితః.'

క్వ ను మాం త్వదధీనజీవితాం వినికీర్య క్షణభిన్నసౌహృదః,
నళినీం క్షతసేతుబన్ధనో జలసంఘాత ఇవాసి విద్రుతః. 6

టీ. (ఓ ప్రియుఁడా;) క్షతసేతుబన్ధనః=లెగఁగొట్టఁబడినకట్టగల, జలసంఘాతః=నీటిప్రవాహము, నళినీమివ = పద్మలతనువలె, త్వదధీన జీవితాం = నీకు స్వాధీనముగాఁ జేయఁబడిన జీవనముగల, మాం = నన్ను, క్వను వినికీర్య = ఎక్కడపడవైచి, క్షణభిన్నసౌహృదః = ఒకక్షణములోఁ ద్రుంపఁబడిన మైత్రిగలవాఁడవై, విద్రుతః = పారిపోయినవాఁడవై, అసి=అయితివి.

తా. అయ్యో ప్రాణేశ్వరా! పద్మలతకు నీరెట్లు జీవనాధారమో నీవు నా కట్లయియుంటివి. అట్టినన్ను దిక్కుమాలినదానిగా నెక్కడ బడఁద్రోసి యంతటిమైత్రియు త్రెంపివైచి పాఱిపోతివి.

వ్యా. క్వేతి.—హే ప్రియ క్షతసేతుబన్ధనో భగ్నసేతుబన్ధో, జలసంఘాతో జలౌఘో, నలినీమివ జలైకాయత్తజీవితామితి శేషః. త్వదధీనజీవితాం త్వదాయత్త ప్రాణాం, మాం క్వను వినికీర్య క్వత్రవా నిక్షిప్య క్షణభిన్నసౌహృదః క్షణత్యక్తసౌహార్దః సన్, విద్రుతః పలాయితోఽసి, సేతుసౌహృదయోః స్థితిహేతుత్వేన సామ్యమ్ - సుహృదయస్య (సుహృదో)భావః సౌహృదమ్-యువాదిత్వాదణ్ప్రత్యయః. హృదయస్య 'హృల్లేఖయదణ్లాసేషు' ఇతి హృదాదేశః. అణిహృద్భావాన్న 'హృద్భగసిన్ధ్వన్తే పూర్వ పదస్య చ' ఇత్యుభయపదవృద్ధిః. హృద్భూతస్యాణ్విధానే తూభయపదవృద్ధిః స్యాత్ - యథా సుహృదో భావః సౌహార్ద మితి-తదేవాహ వామనః. 'సౌహృదదౌర్హృదశబ్దావణి హృద్భావాత్.' ఇతి.

కృతవానసి విప్రియం న మే ప్రతికూలం న చ తే మయా కృతమ్,
కిమకారణమేవ దర్శనం విలపన్త్యై రతయే న దీయతే. 7

టీ. (ఓ ప్రియుఁడా!) త్వం = నీవు, మే=నాకు, విప్రియం = అప్రియమును, కృతవాన్=చేసినవాఁడవు, న అసి=కాలేదు, మయాచ = నాచేతను, తే=నీకు, ప్రతికూలం=అనిష్టము, న కృతం=చేయఁబడలేదు, అకారణమేవ=నిష్కారణముగానె, విలపన్త్యై=(నీదర్శనమునకై) దుఃఖించుచున్న, రతయే = రతికొఱకు, కిం=ఏల, దర్శనం= దర్శనము, నదీయతే = ఈయఁబడదు.

తా. మనోహరా! నీకు నేనుగాని నాకు నీవుగాని యనిష్టముగా నెన్నఁడు సంచరించుటలేకున్నను రతికేలకో నీవగపడవు. (అనఁగా నాకు అగపడకుండునట్లు మృతినొందితివా యనియు, మన మైకమత్యముగల్గి తొల్లి సంచరించుచుందుమనియు భావము.)

వ్యా. కృతేతి.—హే ప్రియ, త్వం, మే మమ, విప్రియమప్రియం, కృతవాన్నాసి, మయా చ, తే తవ, ప్రతికూలమప్రియం, న కృతమ్ - పరస్పరజీవితస్య పరస్పరాధీనత్వాత్ కుతః పరిభవశఙ్కేతి భావః. అకారణం నిష్కారణమేవ - పరస్పరాపకారరూపకారణాభావేఽపీత్యర్థః. క్రియావిశేషణమేతత్, విలపన్త్యై త్వద్దర్శనార్థిన్యా అపీతి భావః. రతయే, కిం కథం, దర్శనం న దీయతే. క్రియాగ్రహణాచ్చతుర్థీ.

స్మరసి స్మర మేఖలాగుణైరుత గోత్రస్ఖలితేషు బన్ధనమ్,
చ్యుతకేసరదూషితేక్షణాన్యవతంసోత్పలతాడనాని వా. 8

టీ. స్మర=మన్మథుఁడా! గోత్రస్ఖలితేషు=నామమును వ్యత్యాసముగా పిలుచుటల యందు (అనఁగా మఱియొక్క తె పేరుతో పిలుచుటలయందు), మేఖలాగుణైః=మొల నూలుదారములతో, బన్ధనం=కట్టుటను, స్మరసి ఉత = తలఁచుచున్నావా? చ్యుతకేసర దూషితేక్షణాని - చ్యుత=పోయిన, కేసర=కింజల్కములచేత, దూషిత=వారింపఁబడిన, ఈక్షణాని = కన్నులుగల, అవతంసోత్పలతాడనాని - అవతంస = కర్ణాభరణమగు, ఉత్పల=నల్లకలువయొక్క, తాడనాని=ప్రహారములను, స్మరసివా=తలంచుచున్నావా?

తా. (మనము రహస్యముగానుండు వేళల) ఇతరస్త్రీనామముతో నన్నుఁ బిల్వఁగా కోపగించి నాకటిసూత్రముచేఁ గట్టినకట్లను దలఁచు కొంటివా? లేక నాకర్ణమునం దలంకారముకొఱకు నుంచుకొనఁబడిన నల్లకల్వతోఁ గొట్టఁగా ఆపుప్పొడి నీకండ్లలోఁబడి మంటఁ గలుగఁ జేయుటను దలఁచి యిప్పుడు నన్నీప్రకారముగాఁ బ్రతిక్రియఁ జేయ నెంచితివా? ఏల నగపడవు?

వ్యా. విప్రియమాశఙ్కతే-స్మరసీతి.— హేస్మర, గోత్రస్ఖలితేషు నామవ్యత్యాసేషు - అన్యస్త్రీనామ్నా మమాహ్వానేషు. ని. 'గోత్రం నామ్ని చలే కులే' ఇతి విశ్వః. మేఖలాగుణైర్బంధనం, స్మరస్యుత స్మరసి వా. ని. 'వికల్పే కిం కిముత చ' ఇత్యమరః. చ్యుతకేసరైర్భ్రష్టకిఞ్జల్కైర్దూషితే ఈక్షణే యేషు తాని; అవతంసోత్పలతాడనాని సధూళిక్షేపతాడనానీత్యర్థః. స్మరసి వా; అపకారస్మరణాదిదమదర్శనమితి భావః.

'హృదయే వససీ' తి మత్ప్రియం
యదవోచ స్తదవైమి కైతవమ్,
ఉపచారపదం న చేదిదం
త్వమనఙ్గః కథమక్షతా రతిః. 9

టీ. హృదయే=ఎదలో, వససి ఇతి=నివసించియున్నావు అని, మత్ప్రియం = నాకిష్టమగు, యత్=ఏమాటను, అవోచః=పల్కితివో, తత్ = ఆమాటను, కైతవం = అబద్ధమునుగా, మన్యే = తలఁచుచున్నాను. ఇదం=ఈమాట, ఉపచారపదం నచేత్ = ఇచ్చకస్థానమై చేయఁబడనిచో, త్వం=నీవు, అనఙ్గః = అంగరహితుఁడవైయుండఁగా, కథం=ఎట్లు, రతిః=రతి, అక్షతా=నష్టముకానిదై (యెట్లున్నది).

తా. నీవు నాయెదలోనుంటివని నాతోఁ జెప్పినమాట నిజమే యైనచో నీకాశ్రయమైన నేను శరీరముగలదాననై యుండఁగా నాయెదలోనున్న నీవెట్లు దేహరహితుఁడ వయితివి.

వ్యా. హృదయఇతి.—హృదయే వససీతి స్మరవాక్యానువాదః. ఇత్యేవంరూపం, మత్ప్రియం, యదవోచ ఉక్తవానసి. బ్రూఞో లుఙి 'వచ ఉమ్' ఇత్యుమాగమః. తత్, కైతవమవైమి మిథ్యేతి మన్యే. ఇదం వచనం, ఉపచారపదం పరస్య రఞ్జనార్థం యదసత్యభాషణం స ఉపచారః తస్య పదం స్థానమ్ - కైతవస్థానమితి యావత్. న చేత్, త్వమనఙ్గో ఽశరీరః, కథం రతిరక్షతాఽవిసష్టా. ఆశ్రయనాశేఽప్యాశ్రితమవినష్టమితి విరోధాదితి భావః.

పరలోకనవప్రవాసినః ప్రతిపత్స్యే పదవీమహం తవ,
విధినా జనఏష వఞ్చిత స్త్వదధీనం ఖలు దేహినాం సుఖమ్. 10

అవ. నాకొఱకేమియు దుఃఖములేదుగాని లోకులకై విచారించుచున్నానను చున్నది.—

టీ. పరలోకనవప్రవాసినః - పరలోక = పరలోకముఁగూర్చి, నవప్రవాసినః = క్రొత్తఁగావెళ్లిన, తవ=నీయొక్క, పదవీం=మార్గము, అహం=నేను, ప్రతిపత్స్యే = అనుసరించుచున్నాను. విధినా=దైవముచే, ఏషః జనః=ఈజనము, వఞ్చితః = వంచన చేయఁబడినది, దేహినాం = శరీరధారులకు, సుఖం = సౌఖ్యము, త్వదధీనంఖలు=నీస్వాధీనముగదా?

తా. క్రొత్తఁగా పరలోకమున కేగిననిన్ను నేను గలిసికొనియెదను దానికేమిగాని పాపము లోకు లావిధిచే వంచితులైరి. యేలన! దేహధారులందఱకిని సౌఖ్యమిాయ వలయునన్న నద్ది నీయాధీనమైనది. నీవీ లోకమునే విడిచినప్పుడు కటా! జనులకు గతియేమి యాగదా?

అవ. న చ మే కశ్చిద్విచారః కింతు లోకశ్శోచ్యత ఇత్యాహ.—

వ్యా. పరలోకేతి.—పరలోకం ప్రతి - నవప్రవాసినోఽచిరప్రోషితస్య - అనేనానుగమనకాలానతిపాతః సూచ్యతే, తవ - పదవీం మార్గం ప్రతిపత్స్యే త్వామనుగమిష్యామీత్యర్థః. అతో మే నాస్తి విచార ఇతి భావః. కిం తు, విధినా దైవేనైష జనో లోకో, వఞ్చితః ప్రతారితః. దేహినాం సుఖం, త్వదధీనం త్వయ్యధీనం ఖలు. అధిశబ్దస్య శౌణ్డాదికత్వాత్ 'సప్తమీ శౌణ్డైః' ఇతి సమాసః. 'అధ్యుత్తరపదాత్' ఇతి ఖప్రత్యయః. ఏవమన్యత్రాపి-సుఖప్రదాభావే కుతః సుఖమితి భావః.

రజనీతిమిరావగుణ్ఠితే పురమార్గే ఘనశబ్దవిక్లబాః,
వసతిం ప్రియకామినాం ప్రియా స్త్వదృతే ప్రాపయితుం క ఈశ్వరః.

అవ. దానినే చెప్పుచున్నాఁడు.—

టీ. ప్రియ=ప్రియుఁడా! రజనీ తిమిరావగుణ్ఠితే = రాత్రిచీఁకటిచే నావరింపఁబడిన, పురమార్గే = నగరమార్గమున, ఘనశబ్దవిక్లబాః = మేఘగర్జనలచే పరవశులరగు, ప్రియాః=కాంతలను, కామినాం = కాముకులయొక్క, వసతిం=ఇంటినిఁగూర్చి, ప్రాపయితుం = చేర్చుటకు, త్వత్ ఋతే = నీవుదప్ప, కః ఈశ్వరః=ఎవ్వఁడు సమర్థుఁడు?

తా. ప్రియుఁడా! రాత్రిచీఁకటులచే నావరింపఁబడిన రాజమార్గములలో మేఘగర్జనలచే పరవశులగు కాంతలను కాముకులయిండ్లకుఁ జేర్చుటకు నీవుతప్ప సమర్థులు మఱియొక్క రుండిరా? •

అవ. తదేవాహ.—

వ్యా. రజనీతి.—హే ప్రియ, రజనీతిమిరేణ అవగుణ్ఠిత ఆవృతే పురమార్గే, ఘనశబ్దవిక్లబాః గర్జితభీతాః, ప్రియాః కామినాం వసతిం ప్రాపయితుం, త్వదృతేత్వాం వినా 'అన్యారాదితరర్తే' ఇత్యాదినా పఞ్చమీ. క ఈశ్వరః శక్తః. న కశ్చిదిత్యర్థః. న హి కామాంధానాం భీతిరస్తీతి భావః.

నయనాన్యరుణాని ఘూర్ణయన్ వచనాని స్ఖలయన్ పదేపదే,
అసతి త్వయి వారుణీమదః ప్రమదానామధునా విడమ్బనా. 12

టీ. అరుణాని=ఎఱ్ఱని, నయనాని=కండ్లను, ఘూర్ణయన్=త్రిప్పుచు, పదేపదే=ప్రతిమాటయందును, వచనాని = మాటలను, స్ఖలయన్ = తొట్రుపడఁజేయుచు, ప్రమదానాం=మదవతులకు, వారుణీ మదః=మద్యమునిషా, అధునా=ఇప్పుడు, త్వయి=నీవు, అసతి=లేనివాఁడవగుచుండఁగా, విడమ్బనా=నటనము.

తా. ప్రియులతోఁగలపు నీవు లేకుండుటచే వారియొక్క కండ్లు సుడివడుట మాటలలోఁ దొట్రుపాటు స్త్రీలకు మద్యమువలని నిషాయును నిమిత్తమాత్రమేగాని ప్రయోజనకారికాదు.

వ్యా. నయనానీతి.—అరుణాని నయనాని, ఘూర్ణయన్ భ్రమయన్, తథా పదేపదే ప్రతిపదమ్ వీప్సాయాం ద్విరుక్తిః. వచనాని, స్ఖలయన్ విపర్యాసయన్, ప్రమదానాం, వారుణీమదః మద్యమదోఽధునా త్వయ్యసతి, విడంబనాఽనుకృతిమాత్రం-మదనాభావే మదస్య నిష్ఫలత్వాదితి భావః. తథా చ శిశుపాలవధే. 'తాం మదో దయితసంగమభూషః' ఇతి.

అవగమ్య కథీకృతం వపుః ప్రియబన్ధో స్తవ నిష్ఫలోదయః,
బహులేఽపి గతే నిశాకర స్తనుతాం దుఃఖమనఙ్గ మోక్ష్యతి. 13

టీ. అనఙ్గ=మన్మథుఁడా! నిశాకరః=చంద్రుఁడు, ప్రియబంధోః = ప్రియస్నేహితుఁడవగు, తవ=నీయొక్క, వపుః = శరీరమును, కథీకృతం = కథగాఁ జేయఁబడినదానినిగా, అవగమ్య = తెలిసికొని, నిష్ఫలోదయః = నిష్ప్రయోజనమగు నుదయముగలవాఁడై, బహులే = కృష్ణపక్షము, గతేపి = పోయినను, తనుతాం=కృశత్వమును, దుఃఖం=దుఃఖముగా, మోక్ష్యతి=వదలుచున్నాఁడు.

తా. ప్రియుఁడా! చంద్రుఁడు నీశరీరము కథావశిష్టమయినదిగాఁ దెలిసికొని బహుళపక్షముపోయినను తనయుదయము వ్యర్థమని తనయందున్న కార్శ్యత్వమును దిన్నఁగా విడుచుచున్నాఁడు.(అనఁగా మారుఁడు దగ్ధమగువార్త వినే చంద్రుఁడు శీఘ్రముగా మామూలుపూర్ణస్థితికి రాక బహుళపక్షముపోయినను క్రమముగా నభివృద్ధి బొందుచున్నాఁడు. శీఘ్రముగా వృద్ధినొందలేదు. కృష్ణపక్షము పోయినపిమ్మట దినదినము కళాప్రకారముగా నభివృద్ధినిగాంచును చంద్రుఁడని భావము.)

వ్యా. అవగమ్యేతి.—హే అనంగ అశరీర, ప్రియబన్ధోః ప్రియసఖస్య తవ, వపుః శరీరం, కథీకృతమకథా కథా సంపద్యమానం కృతం శబ్దమాత్రావశిష్టమవగమ్య జ్ఞాత్వా, నిష్ఫలోదయః. ఉద్దీప్యాభావాదుద్దీపనవైఫల్యమితి భావః. నిశాకరశ్చన్ద్రో, బహులే కృష్ణపక్షే, గతేఽపి, తనుతాం కార్శ్యం, దుఃఖం యథా తథా కృచ్ఛ్రాత్ మోక్ష్యతి. వృథా వృద్ధిరితి దుఃఖయిష్యత ఇత్యర్థః.

హారితారుణచారుబంధనః కలపుంస్కోకిలశబ్దసూచితః,
వద సంప్రతి కస్య బాణతాం నవచూతప్రసవో గమిష్యతి. 41

టీ. హారితారుణచారుబన్ధనః - హారిత=పచ్చనైనట్టియు, అరుణ = ఎఱ్ఱనగునట్టి, చారు = సుందరమగు, బన్ధనః = తొడిమగలయట్టియు (లేక, పిడిగలయట్టి), కలపుంస్కోకిల శబ్దసూచితః - కల = అవ్యక్తమధురమగు, పుంస్కోకిల = మగకోయిల యొక్క, శబ్ద = నాదముచే, సూచితః = సూచనచేయఁబడిన, నవచూతప్రసవః= క్రొత్తమావిమొగ్గ, సంప్రతి = ఇప్పుడు, కస్య = ఎవనికి, బాణతాం = శరమగుటను, గమిష్యతి=పొందునో, వద=చెప్పుమా?

తా. పసుపుపచ్చయు, నెఱ్ఱనయు గలది గనుక సుందరముగానున్న తొడిమగలదియు మగకోయిల కూయుటచే సూచనచేయఁబడిన

యిూ క్రొత్తమావి మొగ్గ నీకిదివఱలో బాణమగుచుండును. ఇప్పుడెవనికి బాణమగును చెప్పుమా? (అనఁగా చూతబాణముగలవాఁడు మన్మథుఁడే గావునను, వాఁడీలోకమునందె లేడుగావునను, మఱియొక్కమారుఁడు లేడుగావునను మఱియెవ్వరికి బాణమగును.) నీవు పోవుటచేత నీచూతాస్త్రము నావలెనెదిక్కు లేనిదై పోయినదని గర్భితము.

వ్యా. హారితేతి.—హరితం చారుణం చ 'వర్ణో వర్ణేన'ఇతి తత్పురుషః. హరితారుణం-చారుబన్ధనం వృన్తం పుఙ్ఖశ్చ - యస్య స తథోక్తః, కలేన మధురేణ పుంస్కోకిలశబ్దేన పురుషకోకిలనాదేన - సూచితోఽనుమాపితశ్చ - చూతచర్వణకార్యత్వాత్ కలశబ్దస్యేతి భావః. నవచూతప్రసవో నవచూతకుసుమం, సంప్రతి కస్య - బాణతాం శరత్వం-గమిష్యతి వద-అన్యస్య పుష్పబాణస్యాభావాదితి భావః.

అళిపఙ్క్తిరనేకశస్త్వయా గుణకృత్యే ధనుషో నియోజితా,
విరుతైః కరుణస్వనైరియం గురుశోకామనురోదితీవ మామ్.

టీ. త్వయా=నీచే, అనేకశః=పలుమారు, ధనుషః=వింటికి, గుణకృత్యే=(మంచి పనియందు) నారికృత్యమునందు, నియోజితా=నియోగింపఁబడిన, ఇయం అళిపఙ్క్తిః= ఈతుమ్మెదగమి, కరుణస్వనైః = దీనస్వరములుగల, విరుతైః = కూజితములచే, గురుశోకాం = గొప్పదుఃఖమునుగలిగియున్న, మాం=నన్ను, అనురోదితీవ = అనుసరించి యేడ్చుచున్నదియునుంబోలె (యున్నది).

తా. తఱచుగా నీబాణపు టల్లెత్రాడుగా మంచికృత్యమునకుపయోగించు నీతేఁటిగుంపు గొప్పరొదతో దుఃఖించు నన్ను ననుసరించి యేడ్చుచున్నదియుఁబోలెనున్నయది.

వ్యా. అళీతి.—త్వయాఽనేకశో బహుశో, ధనుషః కార్ముకస్య, గుణకృత్యే మౌర్వీకార్యే గుణవత్కర్మణి చ, నియోజితాఽధికృతేయమళిపఙ్క్తిః, కరుణస్వనైర్దీనస్వరైర్విరుతైః కూజితైర్గురుశోకాం దుర్భరదుఃఖామ్. ని. 'గురుస్తు గీష్పతౌ శ్రేష్ఠే గురౌ పితరి దుర్భరే' ఇతి శబ్దార్ణవః. మామనురోదితీవ ఉపసర్గాత్సకర్మకత్వమ్ 'రుదాదిభ్యః సార్వధాతుకే' ఇతీడాగమః.

ప్రతిపద్య మనోహరం వపుః పునరప్యాదిశ తావదుత్థితః,
రతిదూతిపదేషు కోకిలాం మధురాలాపనిసర్గపణ్డితామ్. 16

టీ. తావత్=మఱియు, మనోహరం వపుః=అందమగు దేహమును, ప్రతిపద్య= పొంది, ఉత్థితః= లేచినవాఁడవై, మధురాలాపనిసర్గపండితాం-మధుర = శ్రావ్యమగు

ఆలాప=వాక్యములయందు, నిసర్గ=స్వభావముచే, పండితాం=నేర్పరియగు, కోకిలాం = కోకిలాంగనను, రతి దూతిపదేషు - రతి = సంభోగముయొక్క, దూతి = దూతికల యొక్క, పదేషు=స్థానములయందు, ఆదిశ=ఆజ్ఞాపించుము.

తా. నాథా! నీవు లేచి మంచిరూపముఁ దాల్చి ముద్దుపల్కులు గల (అనఁగా శ్రావ్యకంఠధ్వనిగల) యాఁడుఁగోయిలకు తార్పగత్తె పదవి నిమ్ము.

వ్యా. ప్రతిపద్యేతి.—తావత్ పునరపి మనోహరం, వపుః శరీరం, ప్రతిపద్య ప్రాప్య, ఉత్థితః సన్, మధురాలాపేషు ప్రియోక్తిషు - నిసర్గపండితాం, స్వభావప్రగల్భాం, కోకిలాం, రతిదూతిపదేషు సురతదూతీస్థానేష్వాదిశాజ్ఞాపయ ప్రగల్భానామేవ దౌత్యాధికార ఇతి భావః. జీబంతస్యాపి దూతీశబ్దస్య ఛన్దోభఙ్గభయాద్ధ్రస్వః. వి. 'అపి మాషం మషం కుర్యాచ్ఛన్దోభఙ్గే త్యజేద్గిరమ్' ఇతి కేచిత్. 'ఉణాదయో బహులమ్' ఇతి బహులగ్రహణాద్ధ్రస్వ ఇతి వల్లభః.

శిరసా ప్రణిపత్య యాచితాన్యుపగూఢాని సవేపథూని చ,
సురతాని చ తాని తే రహస్స్మర సంస్మృత్య న శాన్తిరస్తి మే.

టీ. స్మర=మన్మథుఁడా! శిరసా=శిరముతో, ప్రణిపత్య=నమస్కరించి, యాచితాని=వేఁడుకొనుటలును, సవేపథూని=కంపముతోఁగూడిన, ఉపగూఢాని=ఆలింగనములును, తాని=ఆయనుభూతములగు, రహః = రహస్యమందలి, సురతాని చ=రతులను, సంస్మృత్య=తలఁచుకొనఁగా, మే=నాకు, శాన్తిః=ఊఱడింపు, నాస్తి=లేదు.

తా. ఓ ప్రియుఁడా! నీవు చేసిన శిరోవందనములును ఆ వేడుటలును చంచలముతోఁగూడునట్లు నీవు చేసెడు కౌఁగిలింతలును క్రిందమన మనుభవించిన రహస్యక్రీడలనుఁ దలఁచుకొన్న నా కెచ్చటియూఱట? (లేదనుట.)

వ్యా. శిరసేతి.—హే స్మర, శిరసా ప్రణిపత్య యాచితాని, సవేపథూని సకమ్పాని 'ట్వితోఽథుచ్' ఇత్యథుచ్ప్రత్యయః. సాత్త్వికాన్తరోపలక్షణమేతత్. వి. 'స్తమ్భప్రలయరోమాఞ్చాః స్వేదో వైవర్ణ్యవేపథూ, అశ్రు వైస్వర్యమిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః' ఇతి, ఉపగూఢాన్యాలింగనాని చ నపుంసకే భావే క్తః, తాన్యనుభూతప్రకారాణి, రహ ఏకాన్తే, సురతాని చ సంస్మృత్య మే శాన్తిర్నాస్తి. అత్ర సమానకర్తృకత్వం దుర్ఘటం. సమానక్రియాపేక్షాఽస్తీతి కేచిత్.

రచితం రతిపణ్డిత త్వయా స్వయమఙ్గేషు మమేదమా ర్తవమ్,
ధ్రియతే కుసుమ ప్రసాధనం తవ తచ్చారు వపుర్న దృశ్యతే. 18

టీ. రతిపండిత=క్రీడచేయుటలో మొనగాఁడవగు ప్రియుఁడా! త్వయా=నీచే, మమ=నాయొక్క, అఙ్గేషు=అవయవములయందు, స్వయం=నీవు, రచితం=చేయఁబడిన, ఆర్తవం=ఋతుసంబంధమగు (వసంతమనుట), కుసుమప్రసాధనం = పుష్పాలంకారము, ఇదం=ఇదే, ధ్రియతే=ఉంటున్నది, తవ=నీయొక్క, తత్=ఆ, చారు = సుందరమగు, వపుశ్చ=దేహము, న దృశ్యతే=అగపడుచున్నది కాదు.

తా. రతులలో మేటివగునాథుఁడా! నీవలంకరించిన వసంతపుష్పాలంకార మింక నిట్లనేయున్నది. అందమగు నీరూపన్నదో తిరోహితమయినది.

వ్యా. రచితమితి.—హే రతిపండిత రతికుశల, త్వయా మమాఙ్గేష్వవయవేషు, స్వయం రచితమ్, ఋతురస్య ప్రాప్త ఆర్తవం వాసన్తమ్ 'ఋతో రణ్' ఇత్యణ్ప్రత్యయః. కుసుమప్రసాధనం పుష్పాభరణమిదం,ధ్రియతేఽవతిష్ఠతే 'ధృఙ్ అవస్థానే' ఇతి ధాతో స్తౌదాదికాత్ కర్తరి లట్. తవ తత్ ప్రసాధకం చారు సున్దరం వపుస్తు న దృశ్యతే.

విబుధై రసి యస్య దారుణైరసమాప్తే పరికర్మణి స్మృతః,
తమిమం కురు దక్షిణేతరం చరణం నిర్మితరాగ మేహి మే. 19

టీ. దారుణైః=క్రూరకర్మలుగల, (ఈవిశేషణము తననాథుని జంకకచంపుటకు నియోగించుటచే పలుకఁబడినది.) విబుధైః = దేవతలచే (తెలివితక్కువవారనుధ్వని. భార్యాభర్త లొకచోనుండఁగా నెడబాపుచేసి పిలుచుట బుధులకృత్యముకాదు), యస్య=ఏనాపాదముయొక్క, పరికర్మణి = అలంకారముచేయుట, అసమాప్తే=పూర్తి కాని దగుచుండఁగా, స్మృతః=తలఁచఁబడినవాఁడవు, అసి=అయితివో, తం దక్షిణేతరం మే ఇమం చరణం = అట్టియీనా యెడమపాదమును, నిర్మితరాగం = నిర్మింపఁబడిన పారాణిగలదిగా, కురు=చేయుము, ఏహి=రమ్ము.

తా. పాపాత్ములగు దేవతలచే యేనాయలంకారము సగముచేసిన వాఁడవై యుండఁగాఁ బిలువఁబడితివో ఆకారణమున నా యెడమకాలి పారాణిని యలంకరించుట యనుపని మిగిలియున్నది. దానికొఱకుఁ పూర్తిచేయవలయు రమ్ము. (అనఁగా పాపమా రతిమన్మథులు మంచిసంతోషముతో వసంతాలంకారములఁ దాల్చి పారాణి మున్నగు నలం

కారములు చేసికొనుచుండఁగా వారిముచ్చట తీరకమునుపే కార్యాతురులగు దేవతలు మారుని తలంచిరి. వచ్చి యీప్రకారము మడిసినాఁడనుట.)

వ్యా. విబుధైరితి.—దారుణైః క్రూరైః - ప్రాణాన్తికే కర్మణి నియోగాదితి భావః. విబుధైర్దేవైః - అనభిజ్ఞత్వం చ ధ్వన్యతే. యస్య మచ్చరణస్య, పరికర్మణి ప్రసాధనే. ని. 'పరికర్మ ప్రసాధనమ్' ఇత్యమరః. అసమాప్తే సతి, స్మృతోఽసి, తమిమం, దక్షిణేతరం వామం, మే చరణం, నిర్మితరాగం రచితలాక్షారాగం, కుర్వేవాగచ్ఛ.

అహమేత్య పతఙ్గవర్త్మనా పునరఙ్కాశ్రయిణీ భవామి తే,
చతురైస్సురకామినీజనైః ప్రియ యావన్న విలోభ్యసే దివి. 20

టీ. అహం=నేను, పతఙ్గవర్త్మనా=(మిడుతమార్గముచే) అగ్నిహోత్రమార్గమున (సహగమనము చేసి యగ్నిలోఁబడి యనుట), ఏత్య=వచ్చి, పునః=మఱియు, తే=నీయొక్క, అఙ్కాశ్రయిణీ=తొడ నాశ్రయించినదాననై, భవామి = అగుచున్నాను. ప్రియ=ప్రియుఁడా! దివి=స్వర్గమునందు, చతురైః=జాణలగు, సురకామినీ జనైః= అప్సరసలగుంపులచే, యావత్ = ఎంతలో, న విలోభ్యసే = మోహితుఁడవు గావో? (అంతలో నిన్ను గలసికొనియెద ననుట.)

తా. ప్రియుఁడా! యెంతలో చాతుర్యముగల యప్సరలు నిన్ను వారివలలో వేసికొనకుందురో అంతలోపుగా నేను అగ్నిలోఁబడి వచ్చి నీతొడపైఁ గూర్చొనెదను. (అనఁగా ని న్ననుసరించెద ననుట.)

వ్యా. అహమితి.—అహం, పతంగవర్త్మనా శలభమార్గేణ - అగ్నిప్రవేశేనేత్యర్థః. ని. 'పతఙ్గః శలభే చాగ్నౌ మార్జారేఽర్కే శరే ఖగే' ఇతి వైజయన్తీ.ఏత్యాగత్య, పునస్తేఽఙ్కాశ్రయిణ్యుత్సఙ్గవర్తినీ, భవామి సంప్రత్యేవ భవిష్యామి 'వర్తమానసామీప్యే వర్తమానవద్వా' ఇతి లట్. హేప్రియ, దివి స్వర్గే, చతురైః, సురకామినీజనైరప్సరోగణైర్యావన్నవిలోభ్యసే న విలోభయిష్యసే 'యావత్పురానిపాతయోర్లడితి లట్.

మదనేన వినా కృతా రతిః క్షణమాత్రం కిల జీవితేతి మే,
వచనీయమిదం వ్యవస్థితం రమణ త్వామనుయామి యద్యపి. 21

టీ. రమణ=మనోహరుఁడా! త్వాం = నిన్ను, అనుయామి యద్యపి= నే ననుసరించివచ్చినదాననే యగుదును. (అయినప్పటికిని) రతిః = రతీదేవి, మదనేన = మారు

నితో, వినాకృతా=వియోగితురాలై, క్షణమాత్రం=నిమిషకాలము, జీవితా కిల=బ్రతికి యుండెనట, ఇతి=అనే, ఇదం వచనీయం=ఈనింద, వ్యవస్థితం=స్థిరమైనది.

తా. ప్రియుఁడా! నేను నిన్ను గలిసికొనుదాననైనను లోకులు రతి మారునివదలి నిమిష ముండెనట యనునిందకు లోనైతిని గదా?

వ్యా. మదనేనేతి.—హే రమణ, త్వా,మనుయామి యద్యప్యనుగమిష్యా మ్యేవ 'వర్తమానసామీప్యే వర్తమానవద్వా' ఇతి లట్. ని. 'యద్యపీత్యవధారణే' ఇతి కేశవః. కిం తు రతిర్మదనేన, వినాకృతా వియోజితా సతీత్యర్థః. సుప్సుపేతి సమాసః. క్షణమాత్రం జీవితా కిలేతీదం, వచనీయం నిన్దా, మే మమ, వ్యవస్థితం స్థిర మభూత్.

క్రియతాం కథమన్త్యమణ్డనం పరలోకాన్తరితస్య తే మయా,
సమమేవ గతోఽస్యతర్కితాం గతిమఙ్గేన చ జీవితేన చ. 22

టీ. పరలోకాన్తరితస్య = పరలోకమునొందిన, (మృతినొందినయనుట.) తే= నీకు, మయా = నాచే, అన్త్యమండనం = కడపటియలంకారము, కథం క్రియతాం= ఎట్లుగా చేయఁబడును. (ఎందుచేననఁగా?) అఙ్గేన = దేహముతోడను, జీవితేనచ సమం ఏవ=జీవముతోఁగూడ ననుట, అతర్కితాం గతిం = ఊహింపఁబడనిదశను, గతః అసి= పొందితివి.

తా. మృతుఁడవగునీకుఁ గడపటియలంకారమునైన నేనెట్లు నేతును? ప్రాణముతోఁబాటు నీశరీరముకూడ నష్టమాయెను గదా? (జీవశరీరముల నగ్ని భస్మముజేసె ననుట.)

వ్యా. క్రియతామితి.—పరలోకేఽన్తరితస్య వ్యవహితస్య - మృతస్యేత్యర్థః, తే తవ, మయాఽన్త్యమణ్డనం, కథం కేన ప్రకారేణ, క్రియతాం. క్రియతామిత్యత్ర కామచారే లోట్ బోధ్యః. ద్రుతదగ్ధస్య తే యథేచ్ఛమణ్డనమపి న సంభవతీత్యర్థః. కుతః - అఙ్గేన చ జీవితేన చ, సమం సహైవాతర్కితామవిచారితాం, గతిం గతోఽసి, ఇహ మృతశరీరమపి నాస్తి కస్య మణ్డనమితి భావః.

ఋజుతాం నయతస్స్మరామి తే శరముత్సఙ్గనిషణ్ణధన్వనః,
మధునా సహ సస్మితాం కథాం నయనోపాన్తవిలోకితం చ యత్.

టీ. శరం=బాణమును, ఋజుతాం = (సాపు) తిన్నగానగుటను, నయతః = పొందించుచున్నవాఁడవై, ఉత్సంగనిషణ్ణధన్వనః - ఉత్సంగ = తొడయందు, నిషణ్ణ= ఉంచఁబడిన, ధన్వనః = విల్లుగల, తే=నీయొక్క, మధునా సహ = వసంతునితోఁ

గూడ, సస్మితాం=చిఱునవ్వుతోఁ గూడిన, కథాం=మాటలాడుటను, యత్ నయనోపాంత విలోకితం = ఏ నేత్రాంతములనుండి (నన్ను) చూచుటను, తచ్చ = దానిని, స్మరామి = స్మరించుచున్నాను.

తా. బాణమును సాపుచేయుచు తొడయందు విల్లునుంచి చిఱునగవుతో వసంతునితో మాటలాడుచు క్రేగండ్లతో నన్ను జూచుటను దలఁచెదను.

వ్యా. ఋజుతామితి.—శరస్యృజుతామార్జవం, నయత, ఉత్సఙ్గే నిషణ్ణమఙ్కగతం-ధనుర్యస్య తస్య 'ధనుషశ్చ' ఇత్యనఙాదేశః. తే తవ మధునా వసన్తేన సహ. ని. 'మధుర్దైత్యే వసన్తే చ చైత్రే చ' ఇతివిశ్వః. సస్మితాం, కథామాలాపం, తథా యన్నయనోపాన్తవిలోకితమపాఙ్గవీక్షణమ్ - త ఇత్యనుషఙ్గః. తచ్చ స్మరామి.

క్వ ను తే హృదయఙ్గమస్సఖా కుసుమాయోజితకార్ముకో మధుః,
న ఖలూగ్రరుషా పినాకినా గమితస్సోఽపి సుహృద్గతాం గతిమ్.

టీ. హృదయంగమః = ఇష్టుఁడైనట్టియు, తే = నీకు, సఖా = చెలికాఁడును, కుసుమాయోజితకార్ముకః - కుసుమ=పువ్వులతో, ఆయోజిత = కూర్పఁబడిన, కార్ముకః= విల్లుగలవాఁడునగు, మధుః = వసంతుఁడు, క్వను = ఎక్కడ? సోఽపి = అతఁడు కూడ, ఉగ్రరుషా=తీక్ష్ణకోపముగల, పినాకినా=హరునిచే, సుహృద్గతాం = చెలికాఁడగు మన్మథునిఁబొందిన, గతిం=గతిని, (అనఁగా భస్మమగుటను.) న గమితః ఖలు = పొందఁబడలేదుగద?

తా. నీకిష్టుడై నట్టి చెలికాఁడును, నీ ధనువునకు పువ్వులఁ గూర్చునట్టివాఁడును నగు వసంతుఁడేడి? తీవ్రకోపియగు హరునిచే మిత్రుఁడగు మన్మథుఁడు బొందినయవస్థను (అనఁగా బూడిదయగుటను) పొందలేదుగద? (అనఁగా మారునితోఁబాటు వసంతుఁడును మృతి బొందలేదుగద) యని తాత్పర్యము.

వ్యా. క్వేతి.—హృదయం గచ్ఛతీతి హృదయంగమో హృద్యః ఖచ్ప్రకరణే 'గమేః సుప్యుపసంఖ్యానమ్'ఇతి ఖచ్ప్రత్యయః 'అరుర్ద్విషదజన్తస్య ముమ్' ఇతి ముమాగమః. తే తవ, సఖా, కుసుమైరాయోజితమారచితం-కార్ముకం యేన స కార్ముకనిర్మాతా, మధుర్వసన్తః, క్వ ను క్వ వా - గత ఇతి శేషః. అథవా, సోఽప్యుగ్రరుషా తీవ్రకోపేన, పినాకినేశ్వరేణ, సుహృదా మదనేన - గతాం ప్రాప్తాం - గతిం

భస్మతామిత్యర్థః. న గమితః ఖలు న ప్రాపితః కిం. ని. 'జిజ్ఞాసానునయే ఖలు' ఇత్యమరః.

అథ తైః పరిదేవితాక్షరైర్హృదయే దిగ్ధశరైరివాహతః,
రతిమభ్యుపపత్తుమాతురాం మధురాత్మానమదర్శయత్పురః. 25

టీ. అథ=అనంతరమున, తైః పరిదేవితాక్షరైః=ఆ దీనాలాపములచే, హృదయే=హృదయమునందు, దిగ్ధశరైః ఇవ = విషము పూయఁబడిన బాణములచేతనుఁబలె, ఆహతః = కొట్టఁబడినవాఁడై, మధుః=వసంతుఁడు, ఆతురాం = విపన్నురాలగు, రతిం=రతీదేవిని, అభ్యుపపత్తుం = అనుగ్రహించుటకొఱకు, (ఓదార్చుటకని యర్థము.) ఆత్మానం=తనను, పురః = ఎదుట, అదర్శయత్ = చూపెను-ఆవిర్భవించెను.

తా. రతీదేవి దుఃఖసమయములో తనను దలంచినమాటలు బాణములవలె గాడఁగా వసంతుఁడామెనోదార్చుట కగపడెను.

వ్యా. అథేతి.—అథ తైః, పరిదేవితాక్షరైర్విలాపవచనైర్హృదయే,దిగ్ధశరైర్విషలిప్తముఖైః శరైరివాహతః సన్ . ని. 'విషాక్తే దిగ్ధలిప్తకౌ' ఇత్యమరః. మధుర్వసన్త, ఆతురామాపన్నాం, రతిమభ్యుపపత్తుమనుగ్రహీతుమ్ - ఆశ్వాసయితుమిత్యర్థః, ని. 'అభ్యుపపత్తిరనుగ్రహః' ఇత్యమరః. ఆత్మానం పురోఽదర్శయత్ ఆవిరభూదిత్యర్థః.

తమవేక్ష్య రురోద సా భృశం స్తనసంబాధమురో జఘాన చ,
స్వజనస్య హి దుఃఖమగ్రతో వివృతద్వారమివోపజాయతే. 26

టీ. సా=ఆరతీదేవి, తం=ఆవసంతుని, అవేక్ష్య = చూచి, భృశం = మిక్కిలి. రురోద=ఏడ్చెను, స్తనసంబాధం = స్తనములకు నొప్పిగల్గునట్లుగా (గట్టిగా), ఉరః=ఱొమ్మును, జఘాన చ=కొట్టుకొనెను. (దానికికారణముఁ జెప్పుచున్నాఁడు.) స్వజనస్య=స్వీయజనముయొక్క, అగ్రతః = ఎదుట, దుఃఖం=దుఃఖము, వివృతద్వారమివ=తెఱవఁబడినవాకిలివలెనే, ఉపజాయతే=ప్రత్యక్షమగుచున్నది. (అడ్డులేకుండ దుఃఖము పొర్లిపొర్లి వచ్చుననుట).

తా. ఆరతీదేవి యావసంతునిఁ జూచి ఱొమ్ము బాదుకొని యేడ్చెను. ఏలనన? దుఃఖమునొందినవారి దుఃఖము స్వజనముఁ జూచిన వెంటనే తలుపుఁదెఱచుకొనివచ్చినట్లుగా నడ్డములేక వ్యాపించును.

వ్యా. తమితి.—సా రతిస్తం మధుమవేక్ష్య దృష్ట్వా, భృశం రురోద, స్తనౌ సంబాధ్య స్తనసంబాధమ్ 'కరిక్లిశ్యమానే చ' ఇతి ణముల్. ఉరో, జఘాన తాడి

తవతీ చ, తథా హి. స్వజనస్యాగ్రతో దుఃఖం, వివృతమపసారితం = ద్వారం కవాటం - యస్య తదివోపజాయత ఆవిర్భవతి - ఉచ్ఛృఙ్ఖలం ప్రవర్తత ఇత్యుత్ప్రేక్షాభిప్రాయః.

ఇతి చైనమువాచ దుఃఖితా 'సుహృదః పశ్య వసన్త కిం స్థితమ్,
తదిదం కణశో వికీర్యతే పవనైర్భస్మ కపోతకర్బురమ్, 27

టీ. దుఃఖితా = దుఃఖితురాలగు, సా=రతీదేవి, ఏనం = ఈవసంతుని, ఇతి= చెప్పఁబోవుభంగిని, ఉవాచ చ=పలుకునుపల్కెను, వసన్త = వసంతుఁడా! పశ్య= చూడుము. సుహృదః=నీచెలికానికి, కిం స్థితం=ఏమియున్నదో, త దిదం=అయిది, కపోత కర్బురం = పావురమువలె చిత్రవర్ణముగల, కణశః = పొడుమయిన, భస్మ=భస్మము, పవనైః = గాలిచే, వికీర్యతే=చల్లఁబడుచున్నది.

తా. ఇట్లు దుఃఖించుచుండుటయేగాక వసంతునితో నిట్లనుచున్నది. వసంతుఁడా! నీమిత్రునిశరీరము సంబధమగుబూడిదను చూడుము. పావురమువలె పలురంగులుగల యీబూడిదను గాలి చిమ్ముచున్నది.

వ్యా. ఇతీతి.—దుఃఖమస్యాః సంజాతం దుఃఖితా - సంజాతదుఃఖేత్యర్థః. తారకాదిత్వాదితచ్. సా రతిరేనం వసన్తమిత్యువాచ చ - చకారః పూర్వోక్తసముచ్చయార్థః. హే వసన్త పశ్య సుహృదస్తవ్తత్సఖస్య, కిం స్థితం కిముపస్థితం. తదిదం, కపోతకర్బురం పారావతశబలం, కణశశ్చూర్ణీభూతమ్ అల్పార్థాచ్ఛస్ప్రత్యయః. భస్మ పవనైర్వికీర్యతే విక్షిప్యతే, పశ్య - భస్మీభూతస్తే సుహృదిత్యర్థః.

అయి సంప్రతి దేహి దర్శనం స్మర పర్యుత్సుక ఏష మాధవః,
దయితాస్వనవస్థితం నృణాం న ఖలు ప్రేమ చలం సుహృజ్జనే. 28

టీ. అయిస్మర=ఓ మారుఁడా! సంప్రతి = ఇప్పుడు, దర్శనం దేహి = దర్శనమిమ్ము, ఏషః మాధవః = ఈవసంతుఁడు, పర్యుత్సుకః = (నీ దర్శనమునకై) వేడుకపడుచున్నాఁడు, నృణాం = మనుష్యులకు, దయితాసు = ప్రియులయందు, ప్రేమ = మైత్రి, అనవస్థితం = అస్థిరమైనది, సుహృజ్జనే = మిత్రులయందు, ప్రేమ తు=ప్రేమన్ననో, న చలంఖలు=స్థిరమైనది కాదా?

తా. మన్మథుఁడా! నాకు నీవు దర్శనమీయకున్నను మిత్రుఁడగు నీవసంతుఁడు మిక్కిలి వేడ్క నొందుచున్నాఁడు. కాన దర్శన

మిమ్ము. లోకములో పురుషులకు స్త్రీలయందలిమైత్రి యస్థిరమైనను సాటివారగు మిత్రులయెడ నిశ్చలమయినది కదా?

వ్యా. అయీతి.—అయి స్మర,సంప్రతి దర్శనం, దేహి, ఏష, మాధవో వసన్తః, పర్యుత్సుకస్త్వద్దర్శనోత్కణ్ఠితః. త్వామప్యనాదృతవతోఽస్య కో మాధవ ఇత్యాశఙ్క్యాహ—నృణాం పురుషాణాం, దయితాసు, ప్రేమానవస్థితమస్థిరం-చలమిత్యర్థః. సుహృజ్జనే ప్రేమ తు న చలం ఖలు.

అమునా నను పార్శ్వవర్తినా జగదాజ్ఞాం ససురాసురం తవ,
బిసతన్తుగుణస్య కారితం ధనుషః పేలవపుష్పపత్త్రిణః. 29

అవ. ఇట్టి మిత్రులెందఱు లేరని శంకించుకొని యొక్కఁడును లేడనుచున్నాఁడు.-

టీ. నను = ఓమదనుఁడా! పార్శ్వవర్తినా = సహచరుఁడగు, అమునా=ఈ వసంతునిచే, ససురాసురం = దేవరాక్షసులతోఁగూడిన, జగత్ = లోకము, బిసతన్తుగుణస్య-బిస=తామరతూండ్లయొక్క, తన్తు=దారము, గుణస్య = నారిగాఁగల, పేలవపుష్పపత్త్రిణః=కోమలకుసుమములు బాణముగాఁగల, తవ=నీయొక్క, ధనుషః = వింటియొక్క, ఆజ్ఞాం=ఆజ్ఞను, కారితం=చేయింపఁబడినది.

తా. తామరతూడు దారముగలదియు పూవుటమ్ములుగలదియు నగు నీధనువునకు (ఇతరులుకాదు సురాసురులు) లొంగి నీయాజ్ఞాప్రకారముగా వశవర్తులగుచున్నారో, అట్టిప్రభావమునకుఁ గారణమగు వసంతునికైనను నీదర్శనము నిమ్ము. (ఈతనికిఁగూడ దర్శనమీయకుండుట తగదనుట).

అవ. ఈదృశాః సుహృదః కతి న సన్తీత్యాశఙ్క్య న కోఽపీత్యాహ.—

వ్యా. అమునేతి.—నను మదన, పార్శ్వవర్తినా సహచరేణామునా వసన్తేన, ససురాసురం సురాసురసహితం, జగద్బిసతన్తుగుణస్య మృణాలసూత్రమౌర్వీకస్య, పేలవాని కోమలాని - పుష్పాణ్యేవ - పత్త్రిణో బాణా - యస్య తస్య, తవ ధనుష ఆజ్ఞాం కారితం - జగదాజ్ఞాకారితేత్యర్థః. 'హృక్రోరన్యతరస్యామ్' ఇతి జగతః కర్మత్వమ్.

గతఏవ న తే నివర్తతే స సఖా దీప ఇవానిలాహతః,
అహమస్య దశేవ పశ్య మామవిషహ్యవ్యసనేన ధూమితామ్. 30

టీ. సః తే సఖా=ఆ నీచెలికాఁడు, అనిలాహతః దీపఇవ = వాయువుచేకొట్టఁబడిన (ఆర్పఁబడిన) దీపమువలె, గతఏవ = పోనేపోయినాఁడు, న నివర్తతే = మరలి

రాఁడు, అహం = నేను, అస్య=ఆ మన్మథునియొక్క (దీపముయొక్క), దశా ఇవ= వత్తివలె (నున్నాననుట), అవిషహ్యావ్యసనేన=భరింపశక్యముగాని దుఃఖముచేత, ధూమితాం=పుట్టిన ధూమముగల (పొగగల), మాం=నన్ను, పశ్య=చూడుము.

తా. నీచెలికాఁడు గాలి కొట్టిపోయినదీపమువలె పోయినాఁడు. మఱిరాఁడు. నేనన్ననో దీప మాఱిపోఁగా పొగగలవత్తివలె దుఃఖమను పొగగల్గి వత్తివలె నున్నాను.

వ్యా. గత ఇతి.—స తే సఖా, అనిలాహతో వాయుతాడితో, దీప ఇవ గత ఏవ న నివర్తతే, అహమస్య దీపాయమానస్య, దశా వర్తిరివ తిష్ఠామీతి శేషః. ని. 'దశావర్తావవస్థాయాం వస్త్రాన్తే స్యుర్దశా అపి' ఇతి విశ్వః. కుతః, అవిషహ్యావ్యసనేన సోఢుమశక్యదుఃఖప్రకర్షేణ, ధూమితాం సంజాతధూమాం, మాం పశ్య; ధూమవత్త్వాన్నష్టదీపదశాసామ్యం ధూమశ్చ వ్యసనమేవేత్యర్థః.

విధినా కృతమర్ధవైశసం నను మాం కామవధే విముఞ్చతా,
అనపాయిని సంశ్రయద్రుమే గజభగ్నే పతనాయ వల్లరీ 31

టీ. నను=వసన్తుఁడా! కామవధే=కాముని చంపుటలో, మాం=నన్ను, విముంచతా=వదలిన, విధినా=దైవముచే, అర్ధవైశసం=సగము చంపుటయే, కృతం = చేయఁబడినది, (భార్యాభర్త లిరువురు నొక్కటే యాకృతి యను నభిప్రాయముచే సగమని చెప్పఁబడినది. సగముఁ జంపఁగా మిగిలినసగము చంపకయే చచ్చెనని తనను చంపుట యను శ్రమయక్కఱలేకయె తాను మారుని జంపుటచే చచ్చితినని చెప్పుచున్నది) అనపాయిని=అపాయములేనిదని నమ్మిన, సంశ్రయద్రుమే = ఆశ్రయవృక్షము, గజభగ్నే=ఏనుఁగుచే కూల్పఁబడినది కాఁగా, వల్లరీ=తీఁగ, పతనాయ=కూలి పోవుట కొరకు (భవతి=అగుచున్నది).

తా. తీఁగ చెట్టు నాశ్రయించుకొన్న భయము లేదనుకొని యుండఁగా నేనుఁగు చెట్టునుఁ బెల్లగించఁగా లతయు పెల్లగింపఁబడి ప్రత్యేకము లతను పెల్లగించుశ్రమ యేనుఁగునకుఁ గలుగనట్లు నానాథుఁడగు మారుని నే నాశ్రయించి యుండఁగా దైవమను గజము నన్ను పెల్లగించు టక్కఱలేకయే మారోన్మూలనముచేత నే నన్నునుఁ జంపి శ్రమ లేక కృతకృత్యుఁ డాయెను.

వ్యా. విధినేతి. నను వసన్త, కామవధే, మదనవధే, మాం, విముఞ్చతా వర్జయతా - అమారయతేత్యర్థః. విధినా దైవేన, విశసతి హినస్తీతి విశసో ఘాతుకః పచాద్యచ్. విశసస్య కర్మ వైశసమ్ యువాదిత్వాదణ్ప్రత్యయః. అర్ధవైశసమర్ధ

వధః-కృతమ్. వి. 'అర్ధో వా ఏష ఆత్మనో యత్ పత్నీ' ఇతి శ్రుతేః. పత్యుః స్వస్య చాశ్రయాశ్రయిభూతయోరేకపదార్థత్వాభిప్రాయేణార్ధోక్తిః. తథా చైకదేశవధే దేశాన్తరస్యాపి వధనియమనాన్మామపి విధిరఘ్నన్నేవ హతవానితి తాత్పర్యమ్; ఏతదేవోపపాదయతి - అనపాయిన్యనపాయిత్వేన విశ్వస్తే, సంశ్రయద్రుమే ఆశ్రయవృక్షే, గజభగ్నే సతి, వల్లరీ లతా, పతనాయ - భవతీతి శేషః. పతితుమేవ సాఽలమిత్యర్థః. 'తుమర్థాచ్చ భావవచనాత్' ఇతి చతుర్థీ.

తదిదం క్రియతామనన్తరం భవతా బన్ధుజనప్రయోజనమ్,
విధురాం జ్వలనాతిసర్జనాన్ననుమాం ప్రాపయ పత్యురన్తికమ్. 32

అవ. ఇప్పుడు పిమ్మట చేయవలసిన దానిని ప్రార్థించుచున్నది.—

టీ. తత్=ఆకారణమువలన, (ఎట్లైనను చావు తప్పదు గాన) అనన్తరం=పిమ్మట, భవతా=నీచే, ఇదం బంధుజనప్రయోజనం = ముందు చెప్పంబోవు బంధువులు చేయు సహాయ కార్యమును, క్రియతాం= (నీచే) చేయం బడుగాక, నను=వసన్తుఁడా! విధురాం=పరవశురాల నగు, మాం=నన్ను, జ్వలనాతిసర్జనాత్ =నిప్పునిచ్చుటచేత, పత్యుః= (నా) పెనిమిటియొక్క, అంతికం=సమీపమును, ప్రాపయ=పొందించుము.

తా. వసంతుఁడా! దుఃఖముతోఁగూడిన నేను స్వయముగాఁ జితి పేర్చుకొనలేను గనుక అదిచేర్చి నాకు నిప్పునిచ్చి నా పెనిమిటితోఁ జేర్చి యాఖరుబంధుకృత్యము నెఱవేర్పుము.

వ్యా. తదితి.—తత్తస్మాత్కారణాదుక్తప్రకారేణ - అన్యథాఽపి మరణస్యావశ్యంభావాదిత్యర్థః. అనన్తరం, భవతేదం వక్ష్యమాణం, బన్ధుజనప్రయోజనం బన్ధుకృత్యం, క్రియతామ్ - ప్రార్థనాయాం లోట్. తదేవోపదిశతి - నను వసన్త, విధురాం వివశాం, మాం, జ్వలనాతిసర్జనాదగ్నిదానాత్ - పత్యురన్తికం ప్రాపయ అగ్నిప్రవేశం కారయేత్యర్థః.

శశినా సహ యాతి కౌముదీ సహ మేఘేన తటిత్ప్రలీయతే,
ప్రమదాః పతివర్త్మగా ఇతి ప్రతిపన్నం హి విచేతనైరపి. 33

అవ. ఈపని స్త్రీలకుఁ జేయఁదగిన దని చెప్పుచున్నాఁడు.—

టీ. కౌముదీ = వెన్నెల, శశినాసహ = చంద్రునితో, యాతి=పోవుచున్నది, తటిత్ =మెఱపు, మేఘేనసహ=మేఘముతో, ప్రలీయతే=నశించుచున్నది, ప్రమదాః= స్త్రీలు, పతివర్త్మగాః = పెనిమిటి మార్గమునుఁ బొందువారు, ఇతి=అని, విచేతనైరపి= అవివేకులచేతను కూడ, ప్రతిపన్నం హి=తెలియఁబడినది గదా.

తా. చంద్రునితో వెన్నెలయు, మేఘముతో మెఱుపును నశించును. పతివ్రతలు భర్తమార్గము నొందుదురు. ఇట్లవివేకులకును దెలుసును.

అవ. కర్తవ్యశ్చాయమర్థః స్త్రీణామిత్యాహ.—

వ్యా. శశినేతి.—కౌముదీ చన్ద్రికా, శశినా సహ యాతి శశిన్యస్తమితేస్వయం నశ్యతీత్యర్థః. తడిత్ సౌదామనీ, మేఘేన సహ, ప్రలీయతే ప్రణశ్యతి కర్తరి లట్. ప్రమదాః స్త్రియః, పతివర్త్మ గచ్ఛన్తీతి పతివర్త్మగాః పతిమార్గానుగామిన్య, ఇత్యేతద్విచేతనైరల్పచేతనైః - అవివేకిభిరపీత్యర్థః. నాథస్తు 'పృథగ్జనైః' ఇతి పపాఠ. ప్రతిపన్నం జ్ఞాతమ్. 'అలవణా యవాగూః' 'అనుదరా కన్యా' ఇతివదల్పత్వాభిప్రాయేణ విచేతనైరపీతి నిర్దేశః. పతివర్త్మగా ఇత్యత్ర స్మృతిః. వి. 'ఆర్తాఽఽర్తే ముదితే హృష్టా ప్రోషితే మలినా కృశా, మృతే మ్రియేత యాపత్యౌసా స్త్రీజ్ఞేయా పతివ్రతా.'ఇతి.

అమునైవ కషాయితస్తనీ సుభగేన ప్రియగాత్రభస్మనా,
నవపల్లవసంస్తరే యథా రచయిష్యామి తనుం విభావసౌ. 34

టీ. సుభగేన=అందమయిన, అమునా=ఈయెదుటనున్న, ప్రియగాత్రభస్మనా=ప్రియుని మేని బూడిదతో, కషాయితస్తనీ=వన్నెమారిన చనులు గలదాననై, నవపల్లవసంస్తరే యథా=నూతన కిసలయ శయ్యయందువలె, విభావసౌ=అగ్నియందు, తనుం=శరీరమును, రచయిష్యామి=ఉంచుచున్నాను.

తా. అందమగు ప్రియుని బూడిదచే కషాయవర్ణముగా గల చన్నులు గలదాననై నూతనమైన యెఱ్ఱని చిగుళ్లయందువలె నాశరీరమును చితియందలి యగ్నిలో నుంచెదను.

వ్యా. అమునేతి.—అమునా పురోవర్తినా, సుభగేన శోభనేన, ప్రియగాత్రభస్మనైవ - ఏవకారో మణ్డనాన్తరనివృత్త్యర్థః. కషాయితస్తనీ రఞ్జితస్తనీ. ని. 'రాగే క్వాథే కషాయోఽస్త్రీ నిర్యాసే సౌరభేరసే' ఇతి వైజయన్తీ. నవపల్లవసంస్తరే యథా నవపల్లవతల్పఇవ, విభావసౌ వహ్నౌ, తనుం శరీరం, రచయిష్యామి నిధాస్యామీత్యర్థః.

కుసుమాస్తరణే సహాయతాం బహుశస్సౌమ్యగతస్త్వమావయోః,
కురు సంప్రతి తావదాశు మే ప్రణిపాతాఞ్జలియాచితశ్చితామ్. 35

టీ. సౌమ్య=ఓ మంచివాఁడా! త్వం = నీవు, ఆవయోః = (రతీ మన్మథుల మగు) మా యిరువురకును, బహుశః = అనేకమాఱులు, కుసుమాస్తరణే=పూల పాన్పు

నందు, సహాయతాం = సహాయమగుటను, గతః=పొందితివి. సంప్రతి=ఇప్పుడు, ప్రణిపాతాంజలినా = నమస్కారముతోఁ గూడిన దోసిలిచే, యాచితః = వేఁడుకొనఁబడుచున్నావు. ఆశు=వేగముగా, మే=నాకు, చితాం = చితిని, కురు తావత్ = పేర్చిపెట్టుమా.

తా. ఓ వసంతుఁడా! మా యిరువురకును పెక్కుసారులు పూలపాన్పు చేయుట విషయములో సహాయ మైతివి. ఇప్పుడు నమస్కారపూర్వకముగా వేఁడుచుంటిని నాకు వేగము దారుమయమైన యగ్నిశయ్యను గూర్చుము. (చితినసుట)

వ్యా. కుసుమేతి.——హే సౌమ్య సాధో, త్వమావయో రతిపఞ్చబాణయో, ర్బహుశో బహువారం, కుసుమాస్తరణే పుష్పశయనే, సహాయతాం గతః. సంప్రతి, ప్రణిపాతాఞ్జలినా యాచితః అఞ్జలిపూర్వకం ప్రార్థితః సన్నిత్యర్థః. ఆశు మే, చితాం కాష్ఠచయం కురు కురుష్వ; యథేహ తథాఽముత్రోపకర్తవ్యం మిత్రేణేత్యర్థః.

తదను జ్వలనం మదర్పితం త్వరయేర్దక్షిణవాతవీజనైః,
విదితం ఖలు తే యథా స్మరః క్షణమప్యుత్సహతే న మాం వినా.36

టీ. తదను = చితిపేర్చినయనంతరమున, మదర్పితం = నాయందర్పింపఁబడిన, జ్వలనం=అగ్నిని, దక్షిణవాతవీజనైః=మలయవాయువులయొక్క సంచారణములచేత, త్వరయేః=తొందరపఱచుము (తొందరగా మండించుము), (తొందరయేలననఁగా) తే=నీకు, విదితం ఖలు=తెలిసియే యున్నదిగదా? యథా=ఎందుచే, స్మరః = మదనుఁడు, మాం=నన్ను, వినా=విడిచి, క్షణమపి=ఒక క్షణమైనను, నోత్సహతే=సంతోషించఁడు.

తా. నాయం దగ్నినంటించి దక్షిణవాయువులు తొందరగావీచుటకు తొందరపఱచుము. ఎందుకనఁగా? నీమిత్రుఁడగు మారుఁడు నన్నువిడిచి యొక్కక్షణమైనను సంతోషింపఁడని యెఱిఁగియేయుందువుగదా?

వ్యా. తదన్వితి.——తచ్చితాకరణమన్వనంతరం మయ్యర్పితం,జ్వలనమగ్నిం, దక్షిణవాతవీజనైర్మలయమారుతసంచారణైః త్వరయేః త్వరితం జ్వలయేత్యర్థః. త్వరా హేతుమాహ - తే తవ-విదితం ఖలు, మతిబుద్ధిపూజార్థేభ్య శ్చ' ఇతి వర్తమానే క్తః - తద్యోగాత్కర్తరి షష్ఠీ, యథా యేన ప్రకారేణ, స్మరో, మాం వినా, క్షణమపి, నోత్సహతే న హృష్యతి. తథా త్వయా జ్ఞాతమేవేత్యర్థః.

ఇతి చాపి విధాయ దీయతాం సలిలస్యాఞ్జలిరేక ఏవ నౌ,
అవిభజ్య పరత్ర తం మయా సహితః పాస్యతి తే స బాన్ధవః. 37

టీ. అపిచ=ఇంతే కాదు, ఇతి=ఇట్లు, (అగ్నిఁజేరుట) విధాయ=చేసి, నౌ=మా యిద్దఱికిని, ఏక ఏవ=ఒకటియే యగు, సలిలస్య=నీటియొక్క, అంజలిః=దోసిలి, దీయతాం=ఈఁబడుగాక, తం=ఆదోసిటిని, సః తే బాన్ధవః=ఆ నీచెలికాఁడు, పరత్ర=పరలోకమునందు, మయాసహితః = నాతోఁగూడినవాఁడై, అవిభజ్య = విభాగముసేయక, పాస్యతి=త్రాఁగఁగలఁడు.

తా. నీవు నాకగ్ని నిచ్చుటయిన పిమ్మట నొకేజలాంజలిని మా యిద్దఱికి నిచ్చినఁ జాలును. ఎందుకనఁగా ? పరలోకమందును విభాగము చేయక నాతో కలసియె జలమును త్రాగును. అట్లుకలసి త్రాగుటయే యాయన కిష్టము.

వ్యా. ఇతీతి.—అపి, చేత్యేవం, విధాయ కృత్వా, నావావాభ్యామేకఏవ, సలిలస్యాఞ్జలిర్దీయతామ్. తమఞ్జలిం స తే బాన్ధవః సఖాస్మరః, పరత్ర పరలోకే మయా సహితోఽవిభజ్య పాస్యతి.

పరలోకవిధౌ చ మాధవ స్మరముద్దిశ్య విలోలపల్లవాః,
నివపేః సహకారమఞ్జరీః ప్రియచూతప్రసవో హి తే సఖా. 38

టీ. కించ=ఇంతేకాదు, మాధవ = వసంతుఁడా, పరలోకవిధౌ = పిండోదకాది పారలౌకిక క్రియయందు, స్మరం=మన్మథుని, ఉద్దిశ్య = ఉద్దేశించి, విలోలపల్లవాః = చలించుచున్న చిగుళ్లుగల, సహకారమఞ్జరీః=మావి పూగుత్తులను, నివపేః=ఇమ్ము, హి= ఏకారణమువలన ననఁగా? తే=నీయొక్క, సఖా=చెలికాఁడు, ప్రియచూతప్రసవః = ఇష్టమయిన మావిపూవులు గలవాఁడు.

తా. ఇంతేకాదు వసంతుఁడా నీచెలికాఁడగు మారునకు మావి పూవులన్న మిక్కిలిప్రేమ గనుక పారలౌకిక క్రియ లగు పిండము జల తర్పణముల నిచ్చుటతోఁబాటు మావిపూవులను సైతమ్ మిమ్ము.

వ్యా. పరలోకేతి.—కించ, హే మాధవ వసన్త, పరలోకవిధౌ పిణ్డోదకాది కర్మణి, స్మరముద్దిశ్య, విలోలాః పల్లవాః యాసు తాః, సహకారమఞ్జరీశ్చూతవల్లరీ, ర్నివపేర్దేహి. హి యస్మాత్కారణాత్, తే సఖా స్మరః, ప్రియాశ్చూతప్రసవా యస్య స తథోక్తః.

ఇతి దేహవిముక్తయే స్థితాం రతిమాకాశభవా సరస్వతీ,
శఫరీం హ్రదశోషవిక్లబాం ప్రథమా వృష్టిరివాన్వకమ్పయత్. 39

టీ. ఇతి=ఇట్లు, దేహవిముక్తయే=దేహత్యాగమునకు, స్థితాం=కృతనిశ్చయురాలగు, రతిం=రతినిగూర్చి, ఆకాశభవా సరస్వతీ = అశరీరవాక్కు, హ్రదశోషవిక్లబాం= మడుగెండుటచే తల్లడపడు, శఫరీం = ఆఁడుబేడిసచేపను, ప్రథమా వృష్టి రివ=తొలకరివానవలె, అన్వకంపయత్ = కనికరించెను.

తా. ఇట్లు శరీరమును విడుచుట నిశ్చయురాలగు రతీదేవిని ఆకాశవాణి మడుగెండుటచే డిల్లపడు మత్స్యాంగనకు తొలకరి వానమాడ్కి కనికరించెను. (అనఁగా ఆకాశవాణి రతినూఱడించి పల్కెను.)

వ్యా. ఇతీతి.—ఇతి, దేహస్య విముక్తయే శరీరస్య విసర్గాయ, స్థితామ్ కృతనిశ్చయామితి యావత్. రతిమాకాశభవా సరస్వత్యశరీరావాగ్ఘ్రదశోషవిక్లబాం - హ్రదస్య జలాధారస్య - శోషేణ విక్లబాం, శఫరీం ప్రోష్ఠీం. ని. 'ప్రోష్ఠీ తు శఫరీ ద్వయోః' ఇత్యమరః. ప్రథమా, వృష్టిర్వర్ష మివాన్వకమ్పయదనుకమ్పితవతీ, సదయమువాచేత్యర్థః. ని. 'కృపా దయాఽనుకమ్పా స్యాత్' ఇ త్యమరః.

కుసుమాయుధపత్ని దుర్లభ స్తవ భర్తా న చిరాద్భవిష్యతి,
శృణు యేన స కర్మణా గతశ్శలభత్వం హరలోచనార్చిషి. 40

టీ. కుసుమాయుధపత్ని = ఓ రతీదేవి, తవ = నీయొక్క, భర్తా = పెనిమిటి, చిరాత్ =చాలకాలము, దుర్లభః = పొందశక్యముకానివాఁడు, న భవిష్యతి=కాఁడు, (అనఁగా వేగమే నీభర్తను నీవు కలసికొనియెద వనుట) యేనకర్మణా=ఏకర్మచే, సః= ఆ నీభర్త, హరలోచనార్చిషి = ఈశ్వరనేత్రాగ్నిజ్వాలయందు, శలభత్వం = మిడుతయగుటను, గతః=పొందెనో.

తా. ఓరతీ! నీభర్త నీకు వేగముగానే లభ్యమగును. ఏ పాపకర్మ చేసి హరనేత్రాగ్నిజ్వాలలో మిడుతవలె మాడిపోయెనో ఆకర్మను జెప్పెదను వినుము.

వ్యా. కుసుమేతి.—హే కుసుమాయుధపత్ని రతే, తవ భర్తా, చిరాత్ చిరం, దుర్లభో న భవిష్యతి - కింత్వచిరమేవ సులభో భవిష్యతీత్యర్థః. కించ శృణు - తత్కర్మేతి శేషః. యేన కర్మణా స తే భర్తా హరలోచనస్యార్చిర్జ్వాలా. ని. 'జ్వాలాభాసోర్న పుంస్యర్చిః' ఇ త్యమరః. తస్మిఞ్ఛలభత్వం పతఙ్గత్వం గతః. ని. 'సమౌ పతఙ్గశలభౌ' ఇ త్యమరః.

అభిలాషముదీరితేన్ద్రియః స్వసుతాయామకరోత్ప్రజాపతిః,
అథ తేన నిగృహ్య విక్రియామభిశప్తః ఫలమేతదన్వభూత్. 41

అవ. మన్మథుఁ డొనర్చిన కర్మమునే చెప్పుచున్నాఁడు.—

టీ. ఉదీరితేంద్రియః = (మారునిచే) ప్రేరేపింపఁబడిన యింద్రియములు గలవాఁడై, ప్రజాపతిః=బ్రహ్మ, స్వసుతాయాం = (తనకూఁతురగు) సరస్వతీదేవియందు, అభిలాషం = కోరికను, అకరోత్ = చేసెను, అథ = పిమ్మట, తేన=*ఆ బ్రహ్మదేవునిచే, విక్రియాం = ఇంద్రియవికారమును, నిగృహ్య=కట్టి, అభిశప్తః = శపింపఁబడి, ఏతత్ఫలం=ఈ దహనమగుటను, అన్వభూత్ = అనుభవించెను.

తా. మారుఁడు బ్రహ్మయందు తనబాణమును ప్రయోగించి కూఁతురగు సరస్వతిని మోహింపఁ జేసెను. ఇంద్రియనిగ్రహసామర్థ్యము గల బ్రహ్మ యది యడంచుకొని మారుని కీవిధి నీశ్వరుని కోపాగ్నిచే బూడిదవు కావలయునని శపించెను. చేసినకర్మ యనుభవింపక తీరునా?

అవ. తదేవ కర్మోపాచష్టే.—

వ్యా. అభిలాషమితి.—ఉదీరితేంద్రియః ప్రేరితేంద్రియః = స్మరేణేతి శేషః. ప్రజాపతిర్బ్రహ్మా, స్వసుతాయాం సరస్వత్యాం అభిలాషమనురాగమకరోత్. అథ తేన ప్రజాపతినా, విక్రియామిన్ద్రియవికారం, నిగృహ్య నిరుధ్యాభిశప్తః సన్ ఏతత్ఫలం దాహాత్మకం స్వకర్మఫలమన్వభూత్.

పరిణేష్యతి పార్వతీం యదా తపసా తత్ప్రవణీకృతో హరః,
ఉపలబ్ధసుఖస్తదా స్మరం వపుషా స్వేన నియోజయిష్యతి. 42
ఇతి చాహ స ధర్మయాచితః స్మరశాపావధిదాం సరస్వతీమ్,
అశనేరమృతస్య చోభయోర్వశినశ్చామ్బుధరాశ్చ యోనయః.

టీ. ధర్మయాచితః=ధర్ముఁడను ప్రజాపతిచే యాచితుఁడై, సః=ఆబ్రహ్మ, తపసా=తపఃకారణముచే, తత్ప్రవణీకృతః = ఆ పార్వతీదేవియం దభిముఖుం డగు, హరః=హరుఁడు, యదా = ఎప్పుడు, పరిణేష్యతి = పెండ్లియాడుచున్నాఁడో, తదా= అప్పుడు, ఉపలబ్ధసుఖః=పొందఁబడిన యానందముగలవాఁడై, స్మరం = మారుని, స్వేన వపుషా = స్వీయశరీరముతో, నియోజయిష్యతి = కూర్చును, ఇతి=ఇట్లు, స్మర శాపావధిదాం = మన్మథశాపావసానమును ఇచ్చుచున్న, సరస్వతీం = వాక్కును, ఆహ=పలికెను. (శాపమునిచ్చి బ్రహ్మ శాపావసాన మెప్పుడని యడగఁ బడి ధర్మప్రజాపతిచే

* "బ్రహ్మదేవునిచే నింద్రియవికారమును కట్టి" యనుప్రయోగము తెనుఁగు భాషకంత బాగుండదు. మహాకవిచెప్పెనని నమస్కరింపవలయును. సంస్కృతమర్యాదకు నంత కట్టుదిట్టము కాదు.

శాపావసానకాలమునుగూడ చెప్పెను. కోపగించినవానికి శాంతియుకూడ గల్గెనా? యనఁగా) వశినః=జితేంద్రియులును, అంబుధరాశ్చ=మేఘములును, అశనేః=పిడుగునకును, అమృతస్య చ=జలమునకును, ఉభయోః=రెండింటికిని, యోనయః = కారణములు.

తా. ధర్ముఁడు మారనాశముచే సృష్టిప్రసంగము నిలచిపోవునని శాపావసాన మడిగెను. ఉమావివాహానంతరమని బ్రహ్మ చెప్పెను. కోపించినవానికి శాంత మెట్లందురా? ఇంద్రియనిగ్రహముగలవారు మేఘునివంటివారు. కావుననే పిడుగువంటిశాపమును జలముబోలు చల్లని యనుగ్రహమును గలిగియుందురు. (కావుననే లోకసామాన్యులకును జితేన్ద్రియులకును సామ్యము చెప్పుటకువీలు లేదు. సమయమును బట్టి కోపానుగ్రహములు వారిచేతులలో నుండుననుట.)

వ్యా. పరిణేష్యతీతి.—ఇతీతి చ.—ధర్మేణ ధర్మాఖ్యేన ప్రజాపతినా యాచితః ప్రార్థితః, స భగవాన్బ్రహ్మా, తపసా కారణేన, తస్యాం పార్వత్యాం ప్రవణీకృతో౽భిముఖీకృతో, హరః శివో, యదా పార్వతీం, పరిణేష్యత్యుద్వక్ష్యతి, తదోపలబ్ధసుఖః ప్రాప్తానన్దః సన్, స్మరం కామం, స్వేన వపుషా, నియోజయిష్యతి సంగమయిష్యతి, ఇత్యేవం, స్మరశాపస్యావధిదామవసానదాయినీం, సరస్వతీం వాచం చాహ-ఏవం శాపావధిమప్యుక్తవానిత్యర్థః. నను తథా క్రుద్ధస్య కథమీదృశీ శాన్తిరత ఆహ-వశినో జితేన్ద్రియాశ్చామ్బుధరాశ్చాశనేరమృతస్య చేత్యుభయోర్యోనయః ప్రభవాః. శివపక్షే ఽశన్యమృతశబ్దౌ కోపప్రసాదపరౌ, అన్యత్ర వైద్యుతాగ్న్యుదకపరౌ. యుగ్మకమ్.

తదిదం పరిరక్ష శోభనే భవితవ్యప్రియసంగమం వపుః,
రవిపీతజలా తపాత్యయే పునరోఘేన హి యుజ్యతే నదీ. 44

టీ. శోభనే = ఓ కల్యాణురాలా! (ఈ యాకాశవాణి సంబోధనమే రతికి వైధవ్యములేదని సూచించి విప్రలంభమును సూచించినది) తత్ = ఆకారణమువలన, భవితవ్యప్రియసంగమం-భవితవ్య=కాఁగల, ప్రియసంగమం = ప్రియసంయోగముగల, ఇదంవపుః=ఈశరీరమును, పరిరక్ష=రక్షించుకొనుము, రవిపీతజలా = సూర్యునిచే నార్చఁబడిననీరుగల, నదీ=నది, తపాత్యయే = గ్రీష్మర్తువుపోఁగా, (వర్షాకాలమందు) పునః= మఱియు, ఓఘేన=ప్రవాహముతో, యుజ్యతే హి=కూడునుగదా.

తా. కాఁబట్టి నీవు నీయెడబాపు శాశ్వతమనియెంచక దేహమును కాపాడుకొనుము. ఎండకాలములో నెండిన నది వర్షాకాలములో నిండుప్రవాహముగలది కాలేదా?

వ్యా. తదితి.—హే శోభనే, తత్తస్మాత్ కారణాద్భవితవ్యో భవిష్యక్ -ప్రియ సంగమో యస్య తత్తథోక్తమిదం వపుః పరిరక్ష తథా హి. రవిపీతజలా నదీ తపాత్యయే ప్రావృషి. ని. 'ప్రావృట్ తపాత్యయే' ఇతి హలాయుధః. పునరోఘేన ప్రవాహేణ, యుజ్యతే సంగచ్ఛతే హి.

ఇత్థం రతేః కిమపి భూతమదృశ్యరూపం
మన్దీచకార మరణవ్యవసాయబుద్ధిమ్,
తత్ప్రత్యయాచ్చ కుసుమాయుధబన్ధురేనా
మాశ్వాసయత్ సుచరితార్థపదైర్వచోభిః. 45

టీ. ఇత్థం=ఇట్లు, అదృశ్యరూపం = కానరానిరూపముగల, కిమపిభూతం=ఒకానొకప్రాణి, రతేః=రతీదేవియొక్క, మరణవ్యవసాయబుద్ధిం - మరణవ్యవసాయ = మరణప్రయత్నముయొక్క, బుద్ధిం=నిశ్చయమును, మన్దీచకార=నివారించెను, కుసుమాయుధబంధుః చ=వసంతుఁడును, తత్ప్రత్యయాత్ = ఆభూతమందలి విశ్వాసమునుండి, సుచరితార్థపదైః = బాగుచారితార్థ్యముగల పదములుగల, వచోభిః=మాటలచే, ఏనాం=రతీదేవిని, ఆశ్వాసయత్ =ఓదార్చెను.

తా. ఆప్రాణి రతీదేవికి ప్రాణత్యాగప్రయత్నమం దుత్సాహమును సన్నగింపఁజేసెను ఆభూతవాక్యవిశ్వాసమునుండి వసంతుఁడీమె నోదార్చెను.

వ్యా. ఇత్థమితి.— ఇత్థమనేన ప్రకారేణాదృశ్యరూపం కిమపి భూతం కశ్చిత్ప్రాణీ. ని. 'యుక్తే క్ష్మాదావృతే భూతం ప్రాణ్యతీతే సమే త్రిషు' ఇత్యమరః. రతేర్మదనదారాణాం, మరణవ్యవసాయబుద్ధిం మరణోద్యోగబుద్ధిం, మందీచకార నివారయామాసేత్యర్థః. ని. 'మూఢాల్పాపటు నిర్భాగ్యా మన్దాః' ఇత్యమరః. అథ కుసుమాయుధబన్ధుర్వసన్తశ్చ, తత్ప్రత్యయా త్తస్మిన్భూతే విశ్వాసాత్. ని. 'ప్రత్యయోఽధీనశపథజ్ఞానవిశ్వాసహేతుషు' ఇత్యమరః. ఏనాం రతిం, సుష్ఠు చరితార్థాని పదాని యేషాం తైర్వచోభిర్వాక్యైరాశ్వాసయత్. సర్వథా తే దేవతాప్రసాదాత్ ప్రియసంగమో, భవిష్యతీత్యాదివచనైరస్యా దుఃఖమపాచకారేత్యర్థః.

అథ మదనవధూరుపప్లవాన్తం
వ్యసనకృశా పరిపాలయాంబభూవ,
శశిన ఇవ దివాతనస్య లేఖా
కిరణపరిక్షయధూసరా ప్రదోషమ్. 46

టీ. అథ=పిమ్మట, వ్యసనకృశా = దుఃఖముచే కృశించిన, మదనవధూః=రతీదేవి, ఉపప్లవాంతం=ఆపదయొక్కయంతమును, కిరణపరిక్షయధూసరా = కిరణములయొక్క నాశనముచే మలినమైన, దివాతనస్య శశినః=పగటియందైన చంద్రునియొక్క, లేఖా= రేఖ, ప్రదోషమివ=రాత్రినివలె, ప్రతిపాలయాం బభూవ=నిరీక్షించెను.

తా. పగటియందు కళాహీనమైన చంద్రకళ రాత్రినె ట్లెదురు సూచునో అట్లు వ్యసనముచేఁ గృశించినరతి ఆపదయొక్క యవసాన మును నిరీక్షించుచుండెను.

ఇది కుమారసంభవ మహాకావ్యమున రతివిలాపము గల
నాల్గవసర్గము ముగిసెను.

వ్యా. అథేతి.—అథాఽనన్తరం వ్యసనేన దుఃఖేన కృశా మదనవధూరతి రుప ప్లవాన్తం విపదవధిం కిరణపరిక్షయేణ - ధూసరా మలినా, దివాతనస్య దినభవస్య 'సాయం చిరమ్.' ఇత్యాదినా ట్యుప్రత్యయః. శశినశ్చన్ద్రస్య లేఖా ప్రదోషం రాత్రి మివ పరిపాలయాంబభూవ ప్రతీక్షాంచక్రే.

పుష్పితాగ్రావృత్తమ్. 'అయుజి నయుగ రేఫతో యకారో యుజి చ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా' ఇతి లక్షణాత్.

ఇతి శ్రీమన్మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరి విరచితయా
సంజీవినీసమాఖ్యయా వ్యాఖ్యయా సమేతః శ్రీకాళిదాసకృతౌ
కుమారసంభవే మహాకావ్యే రతివిలాపో నామ
చతుర్థః సర్గః.

---

శ్రీ ర స్తు

# కు మా ర సం భ వ ము

## పం చ మ స ర్గ ము.

తథా సమక్షం దహతా మనోభవం
పినాకినా భగ్నమనోరథా సతీ,
నినిన్ద రూపం హృదయేన పార్వతీ
ప్రియేషు సౌభాగ్యఫలా హి చారుతా.

టీ. పార్వతీ = పార్వతీదేవి, తథా=ఆలాగున, సమక్షం = కండ్లయెదట, మనోభవం=మన్మథుని, దహతా = దగ్ధముజేసిన, పినాకినా=శివునిచే, భగ్నమనోరథాసతీ = కొట్టఁబడిన కోర్కెగలదై, హృదయేన=మనస్సుచేత, రూపం=చక్కఁదనమును, నినింద=నిందించెను, తథాహి=యుక్తమేగదా, చారుతా=సౌందర్యము, ప్రియేషు=భర్తలవిషయమున, సౌభాగ్యఫలా=ప్రియవాల్లభ్యప్రయోజనముగలది గదా.

తా. తనకండ్లయెదట మారుని భస్మముజేసిన హరునియందు తనకోర్కె విఫలమని తనచక్కఁదనమును నిందించుకొనెను. న్యాయమే. చక్కఁదనమునకు ఫలము ప్రియమైన వల్లభత్వమె గదా (అనఁగా తనయిష్టమయినప్రియుఁడు గలుగుటయేకదా ప్రయోజనము. అదిలేనప్పుడీచక్కఁదన మేలనని భావము.)

వ్యా. తథేతి.—పర్వతస్యాపత్యం స్త్రీ పార్వతీ, తథా తేన ప్రకారేణాక్ష్ణోః సమీపే సమక్షం పురతః, 'అవ్యయం విభక్తి సమీప సమృద్ధి' ఇత్యాదినాఽవ్యయీభావః. మనోభవం మన్మథం, దహతా భస్మీకుర్వతా, పినాకినేశ్వరేణ, భగ్నః ఖణ్డితో మనోరథోఽభిలాషో యస్యాః సా తథోక్తా సతీ, హృదయేన మనసా, రూపం సౌన్దర్యం నినిన్ద ధిఙ్మేరూపం యద్ధరమనోహరణాయ నాలమితి గర్హితవతీత్యర్థః. యుక్తం చైతదిత్యాహ - తథాహి. చారుతా సౌన్దర్యం, ప్రియేషు పతిషు విషయే, సౌభాగ్యం ప్రియవాల్లభ్యం - ఫలం యస్యాః సా తథోక్తా - సౌన్దర్యస్య తదేవ ఫలం యద్భర్తృసౌభాగ్యం లభ్యతే. నోచేత్ విఫలం తదితి భావః.

ఇయేష సా కర్తుమవన్ధ్యరూపతాం
సమాధిమాస్థాయ తపోభిరాత్మనః,
అవాప్యతే వా కథమన్యథా ద్వయం
తథావిధం ప్రేమ పతిశ్చ తాదృశః ?

టీ. సా=ఆపార్వతీదేవి, సమాధిం=ఏకాగ్రత్వమును, ఆస్థాయ=పొంది, తపోభిః=తపంబులచే, ఆత్మనః=తనకు, అవంధ్యరూపతాం = నిర్దుష్టరూపము గలది యగుటను, కర్తుం=చేసికొనుటకు, ఇయేష=కోరెను, అన్యథా=అట్లుకానినాఁడు, కథం వా=ఎట్లు, తథావిధంప్రేమ=అట్టియనురాగమును, తాదృశః=అట్టి, పతిశ్చ=పెనిమిటియు, ద్వయం=ఈరెండును, అవాప్యతే=పొందఁబడుచున్నది.

తా. పార్వతీదేవి నిర్దుష్టమైన చక్కఁదనము చేసికొనుటకు తపస్సును చేయఁగోరెను. లేనిచో సగముశరీరమిచ్చునంతటి యనురాగమును మృత్యువులేని పెనిమిటియు నెట్లు దొరకును?

అవ. అస్మిన్ సర్గే వంశస్థం వృత్తమ్.—'జతౌ తు వంశస్థముదీరితం జరౌ' ఇతిలక్షణాత్ .—

వ్యా. ఇయేషేతి.— సా పార్వతీ, సమాధిమేకాగ్రతామాస్థాయావలమ్బ్య, తపోభిర్వక్ష్యమాణనియమైః కరణభూతైరాత్మనః స్వస్యావన్ధ్యరూపతాం సఫలసౌన్దర్యం కర్తుమియేషేచ్ఛతి స్మ తపసా శివం వశీకర్తుముద్యుక్తేత్యర్థః. అన్యథా తతోఽన్యప్రకారేణ, కథం వా తద్ద్వయమవాప్యతే. కిం తద్ద్వయమ్. తథా భూతా-విధా ప్రకారో-యస్య తత్తథావిధం, ప్రేమ స్నేహః - యేనార్ధాఙ్గహారా హారస్య భవేదితి భావః. తాదృశః పతిశ్చ - యో మృత్యుంజయ ఇతి భావః. ద్వయమేవ ఖలు స్త్రీణామపేక్షితం యద్భర్తృవాల్లభ్యం జీవద్భర్తృకత్వం చేతి. తచ్చ తపశ్చర్యైకసాధ్యమితి నిశ్చికాయేత్యర్థః. అత్ర మనుః. 'యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుస్తరమ్, తత్ సర్వం తపసా ప్రాప్యం తపో హి దురతిక్రమమ్.' ఇతి.

నిశమ్య చైనాం తపసే కృతోద్యమాం
సుతాం గిరీశప్రతిసక్తమానసామ్,
ఉవాచ మేనా పరిరభ్య వక్షసా
నివారయన్తీ మహతో మునివ్రతాత్.

టీ. సా = మేనకాదేవి, గిరీశప్రతిసక్తమానసాం = హరాసక్తిగల చిత్తము గలదానినిగా, తపసే = తపమ్మునకు, కృతోద్యమాం = నిశ్చయింపఁబడిన యుం

ద్యుక్తిగలదానినిగాను, సుతాం = కూతును, నిశమ్య=విని, ఏనాం = ఈపార్వతీదేవిని, వక్షసా=వక్షస్సుచే, పరిరభ్య=కౌఁగిలించుకొని, మహతః మునివ్రతాత్=తపస్సునుండి, నివారయంతీ=మళ్లించుచు, ఉవాచ=పల్కెను.

తా. ఈశ్వరాసక్తిగలదనియు తపస్సుచేయ నిశ్చయించినదనియు విని కూఁతును కౌఁగిలించుకొని తపస్సునుండి విముఖురాలినిఁ జేయుచు చెప్పఁబోవురీతిని పల్కెను.

వ్యా. నిశమ్యేతి.—మేనా మేనకా చ, గిరీశప్రతిసక్తమానసాం హరాసక్తచిత్తాం, తపసే తపశ్చరణాయ, కృతోద్యమాం కృతోద్యోగాం సుతాం నిశమ్య శ్రుత్వైనాం పార్వతీం, వక్షసా పరిరభ్యాలిఙ్గ్య మహతో, మునివ్రతాత్తపసో, నివారయన్త్యువాచ-మునివ్రతాదిత్యత్ర యద్యపి మునివ్రతస్య మేనకాయా అనీప్సితత్వాత్. 'వారణార్థానామీప్సితః' ఇతి నాపాదానత్వం. తథాఽపి కృతోద్యమామితి మానసప్రవేశోక్తత్వాత్ 'ధ్రువమపాయేఽపాదానమ్' ఇత్యపాదానత్వమేవ స్యాత్-యథాహ భాష్యకారః. 'యచ్చ మిథ్యా సంప్రాప్య నివర్తతే తచ్చ ధ్రువమపాయేఽపాదానమితి ప్రసిద్ధమ్' ఇతి.

మనీషితాః సన్తి గృహేషు దేవతా
స్తపః క్వ వత్సే క్వ చ తావకం వపుః,
పదం సహేత భ్రమరస్య పేలవం
శిరీషపుష్పం న పునః పతత్రిణః. 4

అవ. సామాన్యముగా నిషేధముఁజెప్పి విశేషముగా నిషేధముఁ జెప్పుచున్నాఁడు.-

టీ. వత్సే=బిడ్డా! మనీషితాః=ఇష్టమువచ్చిన, దేవతాః=సురలు, గృహేషు = మనయిండ్లయందు, సన్తి=ఉన్నారు. తపః=తపస్సు, క్వ=ఎక్కడ, తావకం వపుశ్చ క్వ= నీశరీరమెక్కడ, పేలవం=మృదువైన, శిరీషపుష్పం=దిరిసెనపువ్వు, భ్రమరస్య=తుమ్మెదయొక్క, పదం=పాదమును, సహేత=సహించెడిని, పతత్రిణఃపునః=పక్షియొక్క (పాదమును), న=సహించలేదు.

తా. అమ్మాయీ! నీమెత్తని మేనెక్కడ తపంబెక్కడ? మెత్తని దిరిసెనపువ్వు తుమ్మెదకాలిని యోర్చును. కఠినంబగు పక్షికాలు నోర్చునా?

అవ. సామాన్యనిషేధముక్త్వా విశేషనిషేధమాహ.—

వ్యా. మనీషితాఇతి.—హే వత్సే! మనస ఈషితా ఇష్టా మనీషితాః శకన్ధ్వాదిత్వాత్ సాధుః. దేవతాః శచ్యాదయో, గృహేషు సన్తి - త్వం తా ఆరాధ

యేతి శేషః. తపః క్వ తవేదం తావకమ్ 'యుష్మదస్మదోరన్యతరస్యాం ఖఞ్చ' ఇత్యణ్ప్రత్యయః. 'తవకమమకావేకవచనే' ఇతి తవకాదేశః. వపుశ్చ క్వ. తథాహి— పేలవం మృదులం, శిరీషపుష్పం, భ్రమరస్య భృఙ్గస్య, పదం పదస్థితిం, సహేత, పతత్రిణః పునః పక్షిణస్తు, పదం న సహేత. అతిసౌకుమార్యాద్భోగయోగ్యం తే వపుర్న దారుణతపఃక్షమమిత్యర్థః. అత్ర దృష్టాన్తాలంకారః.

ఇతి ధ్రువేచ్ఛామనుశాసతీ సుతాం
శశాక మేనా న నియన్తుముద్యమాత్,
క ఈప్సితార్థస్థిరనిశ్చయం మనః
పయశ్చ నిమ్నాభిముఖం ప్రతీపయేత్. 5

టీ. ఇతి=ఇట్లు, అనుశాసతీ=ఉపదేశము సేయుచు, మేనా=మేనకాదేవి, ధ్రువేచ్ఛాం=స్థిరమైనకోరికగల, సుతాం=కూఁతును, ఉద్యమాత్ = యత్నమునుండి, నియంతుం=వారించుటకు, న శశాక=సమర్థురాలు కాలేకపోయెను. (అదియుక్తమె) ఈప్సితార్థ స్థిర నిశ్చయం=కోరిన ప్రయోజనమున నిశ్చలమగు, మనః=మనస్సును, నిమ్నాభిముఖం = లోఁతునకెదురైన, పయశ్చ=నీరును, కః=ఎవఁడు ? ప్రతీపయేత్=మల్లింపఁగలఁడు.

తా. స్థిరమైన నిశ్చయముగల పార్వతీదేవిమనస్సును మేనక నేకముగా నుపదేశించి వారింపలేదాయెను. నిజమె. పట్టుదలగలమనస్సును లోఁతున కెదురుబోవు నీరును ఎవ్వరు మల్లింపఁ గలరు ?

వ్యా. ఇతీతి.— ఇత్యేవమనుశాసత్యుపదిశన్తీ మేనా ధ్రువేచ్ఛాం స్థిరవ్యవసాయాం, సుతాం పార్వతీముద్యమాదుద్యోగాత్తపోలక్షణాన్నియన్తుం నివారయితుం, న శశాక సమర్థా నాభూత్. తథాహి—ఈప్సితార్థ ఇష్టార్థే - స్థిరనిశ్చయం మనో నిమ్నాభిముఖం పయశ్చ కః. ప్రతీపయేత్ ప్రతికూలయేత్-ప్రతినివర్తయేదిత్యర్థః. నిమ్నప్రవణం పయ ఇవేష్టార్థాభినివిష్టం మనో దుర్వారమితి భావః. అత్ర దీపకానుప్రాణితోఽర్థాన్తరన్యాసాలంకారః.

కదాచిదాసన్నసఖీముఖేన సా
మనోరథజ్ఞం పితరం మనస్వినీ,
అయాచతారణ్యనివాసమాత్మనః
ఫలోదయాన్తాయ తపఃసమాధయే. 6

టీ. కదాచిత్ = ఒకప్పుడు, మనస్వినీ = నిశ్చలచిత్తురాలగు, సా = ఆపార్వతీదేవి, మనోరథజ్ఞం = కోరికనెఱిఁగిన, పితరం = హిమవంతునిఁ గూర్చి, ఆసన్నసఖీ

ముఖేన=ఇష్టసఖురాలనెడు పాయముచేత, ఫలోదయాన్తాయ = ఫలోత్పత్తియే కొసగాఁగల, తపఃసమాధయే=తపోనియమముకొఱకు, ఆత్మనః=తనయొక్క, అరణ్యనివాసం = అడవియందువసించుటను, అయాచత=వేఁడెను.

తా. కోరిక నెఱిఁగినతండ్రిని తనకోర్కె నెఱవేఱువఱకు తా నరణ్యములో తపస్సుఁ జేయుట కనుజ్ఞ నిమ్మని చెలికత్తెద్వారా అడిగెను.

వ్యా. కదాచిదితి.——అథ కదాచిన్మనస్వినీ స్థిరచిత్తా సా పార్వతీ, మనోరథజ్ఞమభిలాషాభిజ్ఞం, పితరం హిమవన్తమాసన్నసఖ్యా ప్తసఖీ-సైవ ముఖముపాయః. ని. 'ముఖం నిఃసరణే వక్త్రే ప్రారమ్భోపాయయోరపి' ఇతి విశ్వః. తేన, ఫలోదయః ఫలోత్పత్తిరన్తోఽవధిర్యస్య తస్మై, తపఃసమాధయే తపోనియమార్థమాత్మనః స్వస్యారణ్యనివాసం వనవాసమయాచత 'దుహ్యాచ్' ఇత్యాదినా ద్వికర్మకత్వమ్.

అథానురూపాభినివేశతోషిణా
కృతాభ్యనుజ్ఞా గురుణా గరీయసా,
ప్రజాసు పశ్చాత్ ప్రథితం తదాఖ్యయా
జగామ గౌరీశిఖరం శిఖణ్డిమత్.

టీ. అథ=తర్వాత, గౌరీ=పార్వతీదేవి, అనురూపాభినివేశతోషిణా-అనురూప=తగిన, అభినివేశ = పట్టుదలచేత, తోషిణా = సంతసించినట్టియుం, గరీయసా=మిక్కిలి పూజ్యుఁడగు, గురుణా=తండ్రిచే, కృతాభ్యనుజ్ఞా=చేయఁబడిన యంగీకారముగలదై, పశ్చాత్=తపస్సిద్ధియైనపిమ్మట, ప్రజాసు=జనులయందు, తదాఖ్యయా = ఆపార్వతీదేవి పేరుచే, ప్రథితం=ప్రసిద్ధమగు, శిఖండిమత్=నెమళ్లుగల, శిఖరం=శిఖరమునుఁగూర్చి, జగామ=వెళ్లెను.

తా. పిమ్మట యీమె పట్టుదలకు సంతసించినట్టియు, గౌరవవంతుఁడు నగు హిమవంతునిచే నంగీకరింపఁబడి ఇప్పుడు మనచే గౌరీశిఖర మను పేరుతో పిలువఁబడునట్టియు విస్తారము నెమళ్లుగల శిఖరమునుఁ గూర్చి యామె తపోనియమమునకై పోయెను.

వ్యా. అథేతి.—— అథ గౌర్యనురూపేణ యోగ్యేనాభినివేశేనాగ్రహేణ - తుష్యతీతి తథోక్తేన, గరీయసా పూజ్యతమేన, గురుణా పిత్రా, కృతాభ్యనుజ్ఞా తపః కుర్వితి కృతానుమతిః సతీ, పశ్చాత్తపః సిద్ధ్యుత్తరకాలం, ప్రజాసు జనేషు, తదాఖ్యయా తస్యా గౌర్యాః సంజ్ఞయా-ప్రథితం గౌరీశిఖరమితి ప్రసిద్ధమిత్యర్థః. శిఖణ్డిమత్ న తు హింస్రప్రాణిప్రచురమితి భావః. శిఖరం శృఙ్గం జగామ యయౌ.

విముచ్య సా హారమహార్యనిశ్చయా విలోలయష్టిప్రవిలుప్తచన్దనమ్,
బబన్ధ బాలారుణబభ్రు వల్కలం పయోధరోత్సేధవిశీర్ణసంహతి. 8

టీ. అహార్యనిశ్చయా = అడ్డుపెట్టశక్యముకానిస్థైర్యముగల, సా=ఆపార్వతీదేవి, విలోలయష్టిప్రవిలుప్తచందనం - విలోల = చలించుచున్న, యష్టి=పేటలచే, ప్రవిలుప్త = పోఁగొట్టఁబడిన, చందనం = గంధముగలదైన, హారం = ముత్యాలహారమును, విముచ్య=తీసివైచి, బాలారుణబభ్రు = బాలసూర్యునివలె కావిరంగుగలదియు, పయోధరోత్సేధవిశీర్ణసంహతి - పయోధర=స్తనములయొక్క, ఉత్సేధ=ఉన్నతముచే, విశీర్ణ=శిథిలమైన, సంహతి=దట్టముగల, వల్కలం=నారచీరను, బబంధ=కట్టుకొనెను.

తా. అడ్డుట కశక్యమగు స్థైర్యము గలగౌరి గంధమును తన యొక్క పేటలచేత కొట్టివేయు ముత్యాలహారమును తీసివైచి బాల సూర్యకాంతిగల నారచీరను కట్టుకొనెను ఆనారచీర దట్టమంతయు పార్వతీదేవి చన్నులరాపిడిచే పలచఁబడెను.

వ్యా. విముచ్యేతి.—అహార్యనిశ్చయా౽నివార్యనిశ్చయా సాగౌరీ విలోలాభి శ్చలాభిః. యష్టిభిః ప్రతిసరైః. ప్రవిలుప్తం ప్రమృష్టం చన్దనం స్తనాన్తరగతం యేన తం తథోక్తం హారం ముక్తావళీం విముచ్య విహాయ బాలారుణబభ్రు బాలార్కపిఙ్గలం పయోధరయోః స్తనయోరుత్సేధేనోచ్ఛ్రాయేణ విశీర్ణా విఘటితా సంహతిరవయవ సంశ్లేషో యస్య తత్తథోక్తం వల్కలం కంఠలంబిస్తనోత్తరీయభూతం బబన్ధ ధారయామాసేత్యర్థః.

యథా ప్రసిద్ధై ర్మధురం శిరోరుహై
ర్జటాభిరప్యేవమభూత్తదాననమ్,
న షట్పదశ్రేణిభిరేవ పఙ్కజం
సశైవలాసఙ్గమపి ప్రకాశతే. 9

టీ. తదాననం=ఆపార్వతీదేవిమోము, ప్రసిద్ధైః=భూషితములగు, శిరోరుహైః=తలవెండ్రుకలచేత, యథా మధురం అభూత్ = ఎట్లు ప్రియమైనదియై యాయెనో, ఏవం=ఇట్లు, జటాభిరపి=జడలచేసైతము, (మనోహరమైనదై యాయెను) న్యాయమె, పంకజం=కమలము, షట్పదశ్రేణిభిరేవ = తుమ్మెదలపంక్తిచేతనే, న=కాదు, సశైవలా సంగమపి = నాచుసంపర్కముతోనైనను, ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

పార్వతీదేవిమోము తలదువ్వి పూవులు మున్నుగునవి ధరించినప్పు డెంతశోభగానుండెనో జడలు గట్టినప్పు డట్లనే ప్రకాశించెను. న్యాయమే. పద్మము తుమ్మెదబారుచేతనే కాని నాచుసంపర్కముతోఁ బ్రకాశించదా ?

వ్యా. యథేతి.—తస్యా దేవ్యా ఆననం తదాననం ప్రసిద్ధైర్భూషితైః. ని. 'ప్రసిద్ధౌ ఖ్యాతభూషితౌ' ఇత్యమరః. రోహన్తీతి రుహాః 'ఇగుపధజ్ఞాప్రీకిరః కః' ఇతి కప్రత్యయః. శిరసి రుహాస్తైః శిరోరుహైర్మూర్ధజైర్యథా మధురం ప్రియం అభూత్. ని. 'స్వాదుప్రియౌ తు మధురౌ' ఇత్యమరః. జటాభిరప్యేవం మధురమభూత్. తథా హి-పఙ్కజం పద్మం షట్పదశ్రేణిభిర్భ్రమరపఙ్క్తిభిరేవ న కిం తు సహ శైవలాసఙ్గేన సశైవలాసఙ్గమపి 'తేన సహేతి తుల్యయోగే' ఇతి బహువ్రీహిః. ప్రకాశతే శైవలేనాపి శోభతఏవేత్యర్థః.

ప్రతిక్షణం సాకృతరోమవిక్రియాం
వ్రతాయ మౌంజీం త్రిగుణాం బభార యామ్,
అకారి తత్పూర్వనిబద్ధయా తయా
సరాగమస్యా రశనాగుణాస్పదమ్. 10

టీ. సా = గౌరీదేవి, ప్రతిక్షణం = ప్రతినిముసమును, కృతరోమవిక్రియాం = చేయఁబడిన గగుర్పాటుగల, త్రిగుణాం=మూఁడుపేటలుగల, యాం మౌంజీం=ఏముంజత్రాడును, వ్రతాయ = తపస్సుకొఱకు, బభార=ధరించెనో, తత్పూర్వనిబద్ధయా=అదే మొదటగా కట్టుకొనఁబడిన, తయా=ఆ ముంజత్రాటిచే, అస్యాః = ఈగౌరీదేవియొక్క, రశనాగుణాస్పదం = మొలత్రాడుకట్టుకొనుస్థలము, సరాగం = ఎఱుపుకలదిగా, అకారి= చేయఁబడెను.

తా. తపోనియమమునకు గౌరీదేవి ముప్పేట ముంజత్రాడును ధరించెను. అది మొలకుఁ గ్రుచ్చుకొనినప్పు డొడలు పులకరించుచుండును. ఈత్రాడుయొక్క కఠినత్వముచే మొల కందెను. ఎఱ్ఱపడెను. ఎట్లుండెను ? ముందు పద్మరాగాదిమణుల దాపించిన నగలచే నెఱ్ఱనగు ననుసూచన నిప్పుడే చేసెను (కందెనని భావము).

వ్యా. ప్రతీతి.—సా దేవీ ! ప్రతిక్షణం క్షణేక్షణే కృతరోమవిక్రియాం పారుష్యాత్ కృతరోమాఞ్చాం త్రిగుణాం త్రిరావృత్తాం యాం మౌఞ్జీం ముఞ్జమయీం మేఖలాం వ్రతాయ తపసే బభార. తదేవ - పూర్వం ప్రథమం యస్య తత్పూర్వం

యథా తథా నిబద్ధయా తయా మాఞ్జ్యాఽస్యా దేవ్యా రశనాగుణస్యాస్పదం స్థానం జఘనం సహ రాగేణ సరాగం సలోహితమకారి కృతం సౌకుమార్యాతిశయాదితి భావః.

విసృష్టరాగాదధరాన్నివర్తితః
స్తనాఙ్గరాగారుణితాచ్చ కన్దుకాత్,
కుశాఙ్కురాదానపరిక్షతాఙ్గులిః
కృతోఽక్షసూత్రప్రణయీ తయా కరః. 11

టీ. తయా=ఆదేవిచేత, విసృష్టరాగాత్ = విడువఁబడిన లాక్షారసముగల, అధరాత్ = అధరోష్ఠమునుండియు, స్తనాంగరాగారుణితాత్ - స్తన = స్తనములయందలి, అంగరాగ=మైపూఁతచేత, అరుణిత=ఎఱ్ఱగాఁజేయఁబడిన, కందుకాచ్చ=బంతివల్లనుండియు, నివర్తితః=మరలింపఁబడినదై, కరః=హస్తము, కుశాంకురాదానపరిక్షతాంగుళిః- కుశాంకుర = లేఁతదర్భయొక్క, ఆదాన = తీయుటచేత, పరిక్షత=కొట్టుకొనిపోఁబడిన, అంగుళిః=వ్రేళ్లుగలదిగాను, అక్షసూత్రప్రణయీ = జపమాలికతో స్నేహితురాలిగాను, కృతః=చేయఁబడెను.

తా. ఆదేవి పెదవులకు లత్తుకనుపూయుట స్తనాంగరాగముచే నెఱ్ఱనగుబంతిని ధరించుట చేయుచేయి యిప్పుడు దర్భకోయుటకు జపమాల త్రిప్పుటకు నుపయోగింపఁబడెను. (ఆరెండుపనుల కీరెండుపనులు వచ్చెననుట.)

వ్యా. విసృష్టేతి.—తయా దేవ్యా విసృష్టరాగాత్ త్యక్తలాక్షారసరఞ్జనాదధరాదధరోష్ఠాన్నివర్తితః. 'నిసృష్టరాగాత్' ఇతి పాఠే నితరాం త్యక్తలాక్షారాగాత్ రాగత్యాగేన నిష్ప్రయోజనత్వాదితి భావః. తథా స్తనాఙ్గరాగేణారుణితాదరుణీకృతాత్. పతనసమయే తస్య స్తనయోరుపరోధాదితి భావః. కన్దుకాచ్చ నివర్తితః కుశాఙ్కురాణామాదానేన లవనేన పరిక్షతా వ్రణితా అఙ్గులయో యస్య స తథోక్తః. కరః పాణిరక్షసూత్రప్రణయ్యక్షమాలాసహచరః, కృతః.

మహార్హశయ్యాపరివర్తనచ్యుతైః
స్వకేశపుష్పైరపి యా స్మ దూయతే,
అశేత సా బాహులతోపధాయినీ
నిషేదుషీ స్థణ్డిల ఏవ కేవలే. 12

టీ. మహార్హశయ్యాపరివర్తనచ్యుతైః - మహార్హ = అమూల్యమగు, శయ్యా= ప్రక్కయందు, పరివర్తన = దొర్లుటచే, చ్యుతైః = జారిన, స్వకేశపుష్పైరపి = తనతల

వెంద్రుకలయం దుంచుకొనఁబడిన పువ్వులచేతనుగూడ, యా=ఏగౌరి, దూయతేస్మ=క్లేశమును బొందుచున్నదో, సా=ఆగౌరి, బాహులతోపధాయినీ=తీగఁవంటిబాహువును దిండుగాఁ జేసికొనుచున్నదియై, కేవలే స్థండిలఏవ = పట్టినేలనే, అశేత=పరుండునది, నిషేమషీ=కూరుచున్నది.

తా. గౌరీదేవి తనప్రక్కమీఁదబరుండి యిటునటు దొరలు నప్పుడు తనతలలోనున్న పువ్వులు రాలి యొడలికి సోకి కష్టముఁబెట్టు చుండును. అట్టి మృదువగు పార్వతీదే విప్పుడన్నో తనచేతిని దిండు గాఁజేసికొని వట్టినేలనె కూర్చొనుచు పరుండుచున్నది (తపోనియమ ముచేత ననుట.

వ్యా. మహార్హేతి.—మహానర్హో మూల్యం యస్యాః సా మహార్హా శ్రేష్ఠా యా శయ్యా తస్యాం పరివర్తనేన లుణ్ఠనేన చ్యుతైర్భ్రష్టైః స్వకేశపుష్పైరపి యా దేవీ దూయతే స్మ క్లిశ్యతి స్మ పుష్పాధికసౌకుమార్యాదితి భావః. సా దేవీ బాహులతా ముపధత్త ఉపధానీకరోతీతి బాహులతోపధాయినీ సతీ కేవలే సంస్తరణరహితే స్థణ్డిలే భూమావేవాశేత శయితవతీ. తథా నిషేదుష్యుపవిష్టా చ. 'క్వసుశ్చ' ఇతి క్వసుః 'ఉగితశ్చ' ఇతి జీప్. భూమావేవ శయనాదివ్యవహారో న జాతూపరీత్యర్థః.

పునర్గ్రహీతుం నియమస్థయా తయా
ద్వయేఽపి నిక్షేప ఇవార్పితం ద్వయమ్,
లతాసు తన్వీషు విలాసచేష్టితం
విలోలదృష్టం హరిణాఙ్గనాసు చ. 13

టీ. నియమస్థయా =వ్రతముననున్న, తయా = ఆగౌరీదేవిచే, ద్వయే అపి = ద్వయమందును, ద్వయం=ద్వయమును, పునర్గ్రహీతుం=మరల పొందుటకొఱకు,నిక్షేపః=దాఁచఁబడువస్తువు, అర్పితం ఇవ = ఉంచఁబడినదివలెనుండెను. (ఏరెంటియం దేరెం డనఁగా?) తన్వీషు=సన్నని, లతాసు=తీఁగలయందు విలాసచేష్టితం = శృంగారచేష్టను హరిణాంగనాసు=ఆఁడులేడులయందు, విలోలదృష్టం=చంచలమగుచూపును.

తా. వ్రతస్థుల కర్హముగాని రెండువస్తువులను నిక్షేపముగా నారెంటియం దుంచఁబడె. నాగౌరీదేవిచే నన్నమాడ్కిగా నుండెను. మరలఁ గైకొను నారెండు నెవ్వి యెచ్చటనఁగా విలాసచేష్టయు చంచల దృష్టియు తీఁగలయందు నాఁడులేడులయందు (తపోనియమముచే విలాసచేష్టయు చంచలదృష్టియు నామెకు ఇప్పుడు లేవనుట).

వ్యా. పునరితి.—నియమస్థయా వ్రతస్థయా తయా దేవ్యా ద్వయే అపి ద్వయం పునర్గ్రహీతుం పునరానేతుం నిక్షేపోఽర్పితమివ నిక్షేపత్వేనార్పితం కిము క్వచిత్. 'ద్వయీషు' ఇతి ప్రామాదికః పాఠః. తత్ర ద్వయే కిం ద్వయమర్పితమిత్యాహ. తన్వీషు లతాసు విలాస ఏవ చేష్టితం విలాసచేష్టితం హరిణాఙ్గనాసు విలోలదృష్టం చఞ్చలావలోకితం చ; వ్రతస్థాయాం తస్యాం తయోరదర్శనాల్లతాదిషు దర్శనాచ్చార్పితమివేత్యుత్ప్రేక్షా న తు వస్తుతోఽర్పణమస్తీతి భావః.

అతన్ద్రితా సా స్వయమేవ వృక్షకా
ఘటస్తనప్రస్రవణైర్వ్యవర్ధయత్,
గుహోఽపి యేషాం ప్రథమాప్తజన్మనాం
న పుత్త్రవాత్సల్యమపాకరిష్యతి. 14

టీ. సా=ఆగౌరీదేవి, అతన్ద్రితా = ప్రాలుమాలికలేనిదై, స్వయమేవ=స్వయముగానె, వృక్షకాన్=చిన్నచెట్లను, ఘటస్తనప్రస్రవణైః = ఘటములనెడు స్తనములనుండి స్రవించిన పయస్సులచే, వ్యవర్ధయత్=అభివృద్ధిపఱచెను. గుహోఽపి=కుమారస్వామియు, ప్రథమాప్తజన్మనాం = మొదటపొందఁబడిన పుట్టువుగల (భ్రాతృలగు), యేషాం = ఏవృక్షములసంబంధమగు, పుత్త్రవాత్సల్యం=పుత్త్రప్రేమను, నాపాకరిష్యతి=మరలించలేకపోవును.

తా. ఆగౌరి యోపికతో తన స్తన్యపానమునువలెను ఘటోదకములతో స్వంతముగాఁ బెంచబడిన చిన్నచెట్లయందు ప్రేమ తనకు ముందు కుమారస్వామి పుట్టినప్పుడు సైతము వీనిమీఁదిప్రేమ పోనియంతప్రేమ ధరించెను.

వ్యా. అతన్ద్రితేతి.—సా దేవీ! స్వయమేవాతన్ద్రితాఽసంజాతతన్ద్రా సతీ * తారకాదిత్వాదితచ్ప్రత్యయః. వృక్షకాన్ స్వల్పవృక్షాన్ * 'అల్పే' ఇత్యల్పార్థేకప్రత్యయః. ఘటా ఏవ స్తనా తయోః. ప్రస్రవణైః ప్రసృతపయోభిర్వ్యవర్ధయత్. గుహః కుమారోఽపి ప్రథమాప్తజన్మనాం ప్రథమలబ్ధజన్మనాం అగ్రజాతానామిత్యర్థః. యేషాం వృక్షకాణాం సంబన్ధి పుత్త్రవాత్సల్యం సుతప్రేమ నాపాకరిష్యతి. ఉత్తరత్ర కుమారోదయేఽపి న తేషు పుత్త్రవాత్సల్యం నివర్తిష్యత ఇత్యర్థః.

అరణ్యబీజాఞ్జలిదానలాలితా
స్తథా చ తస్యాం హరిణా విశశ్వసుః,
యథా తదీయైర్నయనైః కుతూహలాత్
పురస్సఖీనామమిమీత లోచనే. 15

టీ. అరణ్యబీజాంజలిదానలాలితాః=నెవెరధాన్యముల దోసెళ్లనిచ్చుటచే లాలన చేయఁబడిన, హారిణాః=లేడులు, తథా విశశ్వసుః=అట్లుగా విశ్వాసముగలవి యాయెను, యథా = ఎట్లనఁగా, కుతూహలాత్ = వేడుకవలన, తదీయైః నయనైః = ఆలేడుల కండ్లతో, సఖీనాం = చెలికత్తెలయొక్క, పురః=ఎదుట (స్వీయమునగు), లోచనే = కండ్లను, అమిమీత=కొలచెనో.

తా. ఆగౌరీదేవి నెవెరలు మున్నగు ధాన్యములతో లాలించుట చేత తనకండ్లతో వానికండ్లను కొలుచుకొనునంత మచ్చికగలవై లేడులు చేయఁబడినవి.

వ్యా. అరణ్యేతి.— అరణ్యబీజానాం నీవారాదీనామఞ్జలయస్తేషాం దానేన లాలితా హారిణాశ్చ తస్యాం దేవ్యాం తథా విశశ్వసుః విస్రమ్భం జగ్ముః. ని. 'సమౌ విస్రంభవిశ్వాసౌ' ఇత్యమరః. యథా కుతూహలాదౌత్సుక్యాత్తదీయైర్హారిణసంబన్ధిభిర్నయనైర్నేత్రైః కరణైః స్వకీయే లోచనే సఖీనాం పురః పురతః. అనేన తేషాం సంబన్ధసహత్వముక్తమ్ అమిమీత అక్షిపరిమాణతారతమ్యజ్ఞానాయమానం చకారేత్యర్థః. కేచిత్తు సా పార్వతీ తదీయైర్నేత్రైః కుతూహలాత్ పురోఽగ్రే వర్తమానానాం సఖీనాం లోచనే అమిమీత ప్రత్యస్థత్వాన్నాత్మన ఇత్యాహుః. 'మాఙ్ మానే' ఇత్యస్మాద్ధాతోర్లఙ్. ఇయమేవ ఖలు విశ్వాసస్య పరా కాష్ఠా యదక్షిపీడనేఽపి న క్షుభ్యన్తీతి భావః.

కృతాభిషేకాం హుతజాతవేదసం
త్వగుత్తరాసఙ్గవతీమధీతినీమ్,
దిదృక్షవస్తామృషయోఽభ్యుపాగమ
న్న ధర్మవృద్ధేషు వయస్సమీక్ష్యతే. 16

టీ. కృతాభిషేకాం=చేయఁబడిన స్నానముగలయట్టియు, హుతజాతవేదసం = హోమముచేయఁబడిన యగ్నిహోత్రముగలదియు, త్వగుత్తరాసంగవతీం=వల్కలముచే నుత్తరీయముగాఁ జేయఁబడినట్టియు, అధీతినీం=స్తుతిపాఠాదులను చేయునట్టి, తాం = ఆగౌరీదేవిని, దిదృక్షవః = చూచుకోర్కెగలవారై, ఋషయః = ఋషులు, అభ్యుపాగమన్=వచ్చిరి. ధర్మవృద్ధేషు=ధర్మముచే పెద్దవారివిషయములో, వయః=వయస్సు, న సమీక్ష్యతే=చూడఁబడదు.

తా. స్నానము హోమము నారచీరధారణము స్తుతిపాఠము గల యాగౌరీదేవిని మునులు చూడవచ్చిరి. ధర్మముచే గొప్పవారి విషయములో వయస్సెన్నఁబడదు.

వ్యా. కృతేతి.—కృతాభిషేకాం కృతస్నానాం హుతజాతవేదసం హుతాగ్నికామ్ కృతహోమామిత్యర్థః. త్వచా వల్కలేనోత్తరాసఙ్గవతీముత్తరీయవతీం త్వగుత్తరాసఙ్గవతీమ్ అధీతమస్యా అస్తీత్యధీతినీం స్తుతిపాఠాది కుర్వతీమ్. 'ఇష్టాదిభ్యశ్చ' ఇతీనిప్రత్యయః. తాం దేవీం దిదృక్షవో ద్రష్టుమిచ్ఛవఋర్షయో మునయోఽభ్యుపాగమన్ సముపాగతాః. న చాత్ర కనిష్ఠసేవాదోష ఇత్యాహ. ధర్మవృద్ధేషు వయో న సమీక్ష్యతే న ప్రమాణీక్రియతే సతి ధర్మజ్యైష్ఠ్యే వయోజ్యైష్ఠ్యం న ప్రయోజకమిత్యర్థః. తథా చ మనుః. 'న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః. యో వా యువాఽప్యధీయానస్తం దేవాః స్థవిరం విదుః' ఇతి.

విరోధిసత్త్వోజ్ఝితపూర్వమత్సరం ద్రుమైరభీష్టప్రసవార్చితాతిథి,
నవోటజాభ్యన్తరసంభృతానలం తపోవనం తచ్చ బభూవ పావనమ్.

టీ. విరోధిసత్త్వోజ్ఝితపూర్వమత్సరం = స్వభావవిరోధములుగల జంతువులచే విడువఁబడిన పూర్వవిరోధముగలదియు, ద్రుమైః=చెట్లచే, అభీష్టప్రసవార్చితాతిథి = కోరఁబడినపండ్లచే పూజింపఁబడిన యతిథులుగలదియు, నవోటజాభ్యంతర సంభృతానలం = క్రొత్తపర్ణశాలలనడుమ పూజింపఁబడిన యగ్నులుగలదియునగు, తచ్చ తపోవనం=ఆతపోవనము, పావనం=పవిత్రమైనది. బభూవ=ఆయెను.

తా. స్వభావవిరోధముగలజంతువులు విరోధమును బాయుటచేతను, చెట్లు కోరినపండ్ల నతిథుల కిచ్చుటచేతను, క్రొత్త పర్ణశాలలయం దగ్నిహోమము చేయఁబడినది యగుటచేతను ఆపార్వతీదేవియొక్క తపోవనము పవిత్రమైనదై యాయెను.

వ్యా. విరోధిభిః-సత్త్వైర్గోవ్యాఘ్రాదిభిః. ఉజ్ఝితపూర్వమత్సరం త్యక్తపూర్వవైరం-హింసారహితమిత్యర్థః. ద్రుమైరభీష్టప్రసవేనేష్టఫలేనార్చితాః పూజితా అతిథయో యస్మిన్ తత్తథోక్తం, నవానాముటజానాం పర్ణశాలానామభ్యన్తరేషు సంభృతాః సంచితాః. అనలా అగ్నయో యస్మింస్తత్తథోక్తం తచ్చ తపోవనం పావయతీతి పావనం బభూవ అహింసాతిథిసత్కారాగ్నిపరిచర్యాభిర్జగత్పావనం బభూవేత్యర్థః.

యదా ఫలం పూర్వతపస్సమాధినా
న తావతా లభ్యమమంస్త కాంక్షితమ్,
తదాఽనపేక్ష్య స్వశరీరమార్దవం
తపో మహత్ సా చరితుం ప్రచక్రమే. 18

టీ. సా.=ఆగౌరీదేవి, యదా=ఎప్పుడు, తావతా = అంతమాత్రమగు, పూర్వ తపస్సమాధినా=పూర్వమునందు తాను చేయుచున్న నియమముచే, కాంక్షితం ఫలం = కోరినకోర్కె, లభ్యం నామం స్త = పొందశక్యముకానిదానిగా తలఁచెనో, తదా = అప్పుడు, స్వశరీరమార్దవం=తనశరీరమృదుత్వమును, అనపేక్ష్య = లెక్కపెట్టక, మహత్ తపః=గొప్పతపస్సును, చరితుం=ఆచరించుటకు, ప్రచక్రమే=ఉపక్రమించెను.

తా. గౌరీదేవి తాను చేయుతపమునకు తాగోరినఫలము లభ్యముకాదని యెపుడు తోఁచి తనశరీరమార్దవమును లెక్కింపక కఠిన తపం బొనర్పసాగెను.

వ్యా. యదేతి.—సా దేవీ, యదా యస్మిన్ కాలే తావతా తావన్మాత్రేణ పూర్వతపఃసమాధినా పూర్వేణానుష్ఠీయమానప్రకారేణ తపోనియమేన కాఙ్క్షితం ఫలం లభ్యం లబ్ధుం శక్యం నామం స్త అశక్యమమం స్తేత్యర్థః. తదా తత్కాలే అవిలమ్బేనేత్యర్థః. స్వశరీరస్య మార్దవం మృదుత్వం సౌకుమార్యమనపేక్ష్యావిగణయ్య మహద్దుశ్చరం తపశ్చరితుం సాధయితుం ప్రచక్రమ ఉపచక్రమే.

క్లమం యయౌ కన్దుకలీలయాఽపి యా
తయా మునీనాం చరితం వ్యగాహ్యత,
ధ్రువం వపుః కాంచనపద్మనిర్మితం
మృదు ప్రకృత్యా చ ససారమేవ చ. 19

టీ. యా=ఏగౌరీదేవి, కందుకలీలయాపి = చెండాడుటచేసయితము, క్లమం = శ్రమను, యయౌ=పొందెనో, తయా=ఆమెచే, మునీనాం=మునులయొక్క, చరితం= చరిత్రము (అనఁగా తీవ్రతపము), వ్యగాహ్యత=ప్రవేశింపఁబడెను, ధ్రువం=నిజముగా, అస్యాః వపుః=ఈమెదేహము, కాంచనపద్మనిర్మితం = బంగారుతామరపువ్వుచేఁ జేయఁబడినది, ప్రకృత్యా = పద్మస్వభావముచే, మృదు చ=సుకుమారమైనదియు, ససారం = కఠినమైనదియును.

తా. చెండాడి యలయికఁజెందు గౌరీదేవిచే నిప్పుడు తీవ్రతపం బొనర్పఁబడెను. నిజముగా నీమెయొడలు బంగారుకమలముచే నిర్మింపఁబోలు. కావుననే పద్మస్వభావమునుబట్టి మార్దవమున్నను కాంచనస్వభావముచే కఠినముగల్గి తపంబుల కోర్చెననుట.

వ్యా. క్లమమితి.—యా దేవీ, కన్దుకలీలయా కన్దుకక్రీడయాఽపి, క్లమం యయౌ గ్లానిం ప్రాప తయా దేవ్యా మునీనాం చరితం తీవ్రం తపో వ్యగాహ్యత

ప్రవిష్టమ్; అత్రోత్ప్రేక్షతే-ధ్రువమస్యా వపుః కాఞ్చనపద్మేన సువర్ణకమలేన నిర్మితం ఘటితమ్, అత ఏవ ప్రకృత్యా పద్మస్వభావేన, మృదు చ సుకుమారమపి కాఞ్చనస్వ భావేన ససారం చ కఠినమేవ తథా చ తదుపాదానకత్వాద్దేవ్యావపుషః సుకుమార స్యాపి తీవ్రతపఃక్షమత్వమిత్యుత్ప్రేక్షార్థః.

శుచౌ చతుర్ణాం జ్వలతాం హవిర్భుజాం
శుచిస్మితా మధ్యగతా సుమధ్యమా,
విజిత్య నేత్రప్రతిఘాతినీం ప్రభా
మనన్యదృష్టిస్సవితారమైక్షత. 20

టీ. శుచౌ = గ్రీష్మకాలమందు, శుచిస్మితా = స్వచ్ఛమందహాసముగల, సుమధ్యమా=గౌరీదేవి, జ్వలతాం = మండుచున్న, చతుర్ణాం హవిర్భుజాం = నాల్గగ్నుల యొక్క, మధ్యగతా=నడుమనున్నదై, నేత్రప్రతిఘాతినీం=కండ్లను మిఱుమిట్లుగొల్పు, ప్రభాం=సూర్యతేజస్సును, విజిత్య = జయించి, అనన్యదృష్టిః = ఇతరదృష్టిలేనిదై, సవితారం=సూర్యుని, ఐక్షత=చూచెను.

తా. మనోహరమగు మధ్యభాగమును నవ్వునుంగల యాగౌరీదేవి యెండకాలమున నాల్గుదిక్కులయందు నగ్నులనుంచుకొని యైదవ యగ్నిగా సూర్యుని నిశ్చలదృష్టితో చూచుచు సూర్యతేజమునోర్చినదై తపం బొనర్చెను. ఇదియె పంచాగ్నిమధ్యను తపంబన.

వ్యా. శుచావితి.—శుచౌ గ్రీష్మే శుచిస్మితా విశదమన్దహాసా సుమధ్యమా పార్వతీ జ్వలతాం దీప్తిమతాం చతుర్ణాం హవిర్భుజామగ్నీనాం మధ్యగతా సతీ నేత్రే ప్రతిహన్తీతి తాం నేత్రప్రతిఘాతినీం ప్రభాం సావిత్రం తేజో విజిత్య న విద్యతేఽన్యత్ర దృష్టిర్యస్యాః సాఽనన్యదృష్టిః సతీ సవితారం సూర్యమైక్షత దదర్శ. వి. 'గ్రీష్మే పఞ్చాగ్నిమధ్యస్థో వర్షాసు స్థణ్డిలేశయః' ఇతి స్మరణాత్. పఞ్చాగ్నిమధ్యే తపశ్చచారేత్యర్థః. తత్ర సవితైవ పఞ్చమోఽగ్నిః. వి. 'అగ్నిః సవితా సవితైవాగ్నిః' ఇతి శ్రౌతలిఙ్గాత్.

తథాఽతితప్తం సవితుర్గభస్తిభి
ర్ముఖం తదీయం కమలశ్రియం దధౌ,
అపాఙ్గయోః కేవలమస్య దీర్ఘయో
శ్శనైః శనైః శ్యామికయా కృతం పదమ్. 21

టీ. సవితుః గభస్తిభిః = సూర్యకిరణములచే, తథా అతితప్తం = అట్లు మిక్కిలి తపింపఁబడిన, తదీయం ముఖం = ఆగౌరీదేవిమోము, కమలశ్రియం = కమలకాంతిని,

దధౌ=ధరించెను, అస్య = ఈ మోముయొక్క, దీర్ఘయోః = పొడవగు, అపాంగయోః కేవలం=కడగండ్లయందుమాత్రము, శనైఃశనైః=మెల్లమెల్లఁగా, శ్యామికయా=నల్పుచే, పదం=స్థానము, కృతం=చేయఁబడెను.

తా సూర్యకిరణములకు కమలని కమలముభంగి పార్వతీదేవి మోము కమలకున్నను మార్దవముగల క్రేగండ్లయందుమాత్రము నల్పుపుట్టినది.

వ్యా. తథేతి.—సవితుః సూర్యస్య గభస్తిభిః కిరణైస్తథా పూర్వోక్తప్రకారే ణాతితప్తం సంతప్తం, తస్యా ఇదం తదీయం ముఖం కమలశ్రియం కమలస్య శోభాం దధౌ ప్రాప. యథా రవితాపాత్కమలం న మ్లాయతి ప్రత్యుత వికసతి తథా తదీయం ముఖమాసీదితి భావః. కింత్వస్య ముఖస్య దీర్ఘయోరపాఙ్గయోః కేవలం నేత్రాన్తయో రేవ శనైః శనైర్మన్దం మన్దం శ్యామికయా కాలిమ్నా పదం స్థానం కృతం తయోః సౌకుమార్యాదిత్యర్థః.

అయాచితోపస్థితమమ్బు కేవలం రసాత్మకస్యోడుపతేశ్చ రశ్మయః,
బభూవ తస్యాః కిల పారణావిధిర్న వృక్షవృత్తివ్యతిరిక్తసాధనః.

టీ. అయాచితోపస్థితం=యాచించు టక్కఱలేక పొందఁబడిన, అంబు కేవలం= నీరుమాత్రము, రసాత్మకస్య = అమృతాత్ముఁడగు, ఉడుపతేః = చంద్రునియొక్క, రశ్మయశ్చ=కిరణములును, తస్యాః=ఆమెకు, పారణావిధిః=భోజనకర్మ, బభూవకిల=ఆయెను గదా. వృక్షవృత్తివ్యతిరిక్తసాధనః = చెట్లజీవనముకన్న వ్యతిరేకోపాయముగలది, న బభూవ=కాలేదు.

తా. ఆమె యాచించక లభ్యమగుజలములను చంద్రకిరణము లనుఁ గ్రోలుచు తపం బొనర్చెను. కావుననే చెట్లజీవనమువంటి జీవనము గలది యాయె ననుట. (అయాచితజలమనఁగా వర్షోదకమనుట, ప్రత్యేక ముగా జీవనోపాయమునకు నీరైనను సంపాదింప లేదనుట.)

వ్యా. అయాచితేతి.—అయాచితోపస్థితమప్రార్థితోపనతం కేవలమమ్బూదకం రసాత్మకస్యామృతమయస్యోడూనాం నక్షత్రాణాం పతిశ్చన్ద్రస్తస్య-రశ్మయశ్చ తస్యాః పార్వత్యాః పారణావిధిరభ్యవహారకర్మ బభూవ తావన్మాత్రసాధనకోఽభూదిత్యర్థః. సాధ్యసాధనయోరభేదేన వ్యపదేశః సాధనాన్తరవ్యావృత్త్యర్థః. కిలేతి ప్రసిద్ధౌ వృక్షాణాం యావృత్తిర్జీవనోపాయస్తద్వ్యతిరిక్తం సాధనముపాయో యస్య స తథో క్తః. పారణావిధిర్న బభూవ, వృక్షోప్యయాచితోపస్థితేన మేఘోదకేనేన్దుకిరణైశ్చ జీవతీతి ప్రసిద్ధమ్. అమ్బికాఽపి తావన్మాత్రమవాలమ్బతేత్యర్థః.

నికామతప్తా వివిధేన వహ్నినా
నభశ్చరేణేన్ధనసంభృతేన సా,
తపాత్యయే వారిభిరుక్షితా నవై
ర్భువా సహోష్మాణమముఞ్చదూర్ధ్వగమ్. 23

టీ. వివిధేన = ఐదువిధములగునట్టియు, నభశ్చరేణ = ఆకసమునందుఁ జరించు నట్టియు, (సూర్యరూపమున) ఇన్ధనసంభృతేన=కట్టెలచే ప్రజ్వలింపఁజేయఁబడినట్టిదియు (అగు), వహ్నినా=అగ్నిచే, (భూమియందు కట్టె మథించఁగాఁబుట్టినవి నాల్గు ఆకసమున రవిరూపమగు నైదువహ్నులను పంచాగ్నులందురు) నికామతప్తా=మిక్కిలి తపింపఁబడి, సా=ఆదేవి, తపాత్యయే=గ్రీష్మావసానమున, నవైః వారిభిః=క్రొత్తనీరులచే, ఉక్షితా= తడుపఁబడి, భువా సహ=భూమితోఁగూడ, ఊర్ధ్వగం=పైకిలేచిన, ఊష్మాణం = ఆవిరిని, అముంచత్=విడిచెను.

తా. పంచాగ్నిహోత్రమధ్య తపంబుజేసిన యాదేవియొడలి నుండియు తపింపఁబడిన భూమినుండియు తొలకరివానలచే నావిరి పైకిలేచెను. (ఈమెతపస్సుచే క్రాగినది. భూమి తపముచే క్రాగినది కావున)

వ్యా. నికామేతి.—వివిధేన పంచవిధేనేత్యర్థః. నభశ్చరేణ ఖేచరేణ ఆదిత్య రూపేణేత్యర్థః. ఇన్ధనసంభృతేన కాష్ఠసమిద్ధేన, వహ్నినా నికామమత్యన్తం తప్తా సా ఉమ్బితా తపాత్యయే గ్రీష్మాన్తే ప్రావృషీత్యర్థః. నవైర్వారిభిరుక్షితా సిక్తా సతీ భువా వఞ్చాగ్నితప్తయా సహోర్ధ్వగమూర్ధ్వప్రసృతముష్మాణం బాష్పమముఞ్చత్. ని. 'గ్రీష్మోష్మబాష్పముష్మాణమ్' ఇతి యాదవః.

స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేధనిపాతచూర్ణితాః.
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోదబిన్దవః.

టీ. ప్రథమోదబిందవః=తొలిసీటిచుక్కలు, తస్యాః=ఆదేవియొక్క, పక్ష్మసు= కనుఱెప్పలయందు, క్షణం=క్షణము, స్థితాః=నిలిచినవియు, తాడితాధరాః=కొట్టంబడిన పెదవిగలవియు, (పిమ్మట) పయోధరోత్సేధనిపాతచూర్ణితాః=పాలిండ్లయొక్క యుపరి భాగమునందుపడుటచే శిథిలములయినవియు, (పిమ్మట) వలీషు = కడుపుమడతలయందు, స్ఖలితాః=తొట్రుపాటుగలవియునై, చిరేణ=కొంతసేపటికి, నాభిం=పొక్కిలిని, ప్రపేదిరే=ప్రవేశించినవి.

తా. తపోనియమములో నామె యున్నప్పుడుపడిన తొలకరివాన చినుకులు మొదట కనురెప్పలమీఁదఁబడి పెదవిమీఁదికి జారి కుచములపైఁబడి వళులమీఁదనలముకొని చాలసేపటికి నాభిలోఁ బ్రవేశించినవి.

వ్యా. స్థితా ఇతి.— ఉదకస్య బిన్దవ ఉదబిన్దవః. 'మన్థౌదన' ఇత్యాదినోదకశబ్దస్యోదాదేశః. ప్రథమ ఉదబిన్దవః. ప్రథమవిశేషణాద్బిన్దూనాం విరలత్వం బహువచనాన్నాతివిరలత్వం చ గమ్యతే. తథా చ చిరత్వనాభ్యన్తరగమనయోర్నిర్వాహః. తస్యాః పార్వత్యాః, పక్ష్మసు నేత్రలోమసు క్షణం స్థితాః స్థితిం గతాః. స్థితా ఇత్యనేన పక్ష్మణాం సాన్ద్రత్వం క్షణమితి స్నైగ్ధ్యం చ గమ్యతే. అనన్తరం తాడితో వ్యథితోఽధర ఓష్ఠో యైస్తే తథోక్తాః. ఏతేనాధరస్య మార్దవం గమ్యతే. తతః పయోధరయోః స్తనయోరుత్సేధ ఉపరిభాగే నిపాతేన పతనేన చూర్ణితా జర్జరితాః కుచకాఠిన్యాదితి భావః. తదను వలీషూదరరేఖాసు స్ఖలితాః. నిమ్నోన్నతత్వాదితి భావః. ఇత్థం చిరేణ న తు శీఘ్రం ప్రతిబన్ధబాహుల్యాదితి భావః. నాభిం, ప్రపేదిరే ప్రవిష్టా న తు నిర్గతాః. ఏతేన నాభేర్గామ్భీర్యం గమ్యతే. అత్ర ప్రతిపదమర్థవత్త్వాత్ పరికరాలంకారః.

శిలాశయాం తామనికేతవాసినీం
నిరన్తరాస్వన్తరవాతవృష్టిషు,
వ్యలోకయన్నున్మిషితైస్తడిన్మయై
ర్మహాతపస్సాక్ష్య ఇవ స్థితాః క్షపాః. 25

టీ. నిరంతరాసు = ఎడములేని, అంతర వాత వృష్టిషు=నడుమనడుమ గాలులుగల వానలయందు, అనికేతవాసినీం = గృహమునవసింపనిదియు, శిలాశయాం=రాతియందు పరున్నదియునగు, తాం = ఆపార్వతీదేవిని, మహాతపస్సాక్ష్యే = గొప్పతపస్సుయొక్క సాక్ష్యములో, స్థితాః=ఉన్నట్టి, క్షపాః=రాత్రులు, తడిన్మయైః=మెఱుపులనే, ఉన్మిషితైః=చూపులతో, వ్యలోకయన్నివ=చూచినవో యనునట్లుండెను.

తా. తెరిపిలేక గాలి వానలుగానున్నపు డామె బట్టబయిట బండమీఁద పరుండఁగా, ఆతపంబునకు సాక్ష్యమిచ్చెడు రాత్రులుకనులార చూచుచున్నవోయన మెఱుపులు మెఱయుచుండెను.

వ్యా. శిలాశయామితి.—నిరన్తరాసు నీరన్ధ్రాస్వన్తరే మధ్యే వాతో యాసాం తాదృశ్యో యా వృష్టయస్తాస్వన్తరవాత వృష్టిషు, న నికేతే గృహే వసతీత్యనికేతవాసినీమ్. అనావృతదేశవాసినీమిత్యర్థః. శిలాయాం శేత ఇతి శిలాశయాం శిలాతలశాయి

నీప్ 'అధికరణే శేతేః' ఇత్యచ్ప్రత్యయః. తాం పార్వతీం సాక్షాద్ద్రష్ట్రా సాక్షీ 'సాక్షాద్ద్రష్టరి సంజ్ఞాయామ్' ఇతీనిప్రత్యయః. తస్య కర్మ సాక్ష్యం-మహాతపసః సాక్ష్యే స్థితాః శుపా స్తడిన్మయైర్విద్యుద్రూపైరున్మిషితైరవలోకనై ర్వ్యలోకయన్నివ. ఇవేతి చక్షుషా విలోకనమేవోత్ప్రేక్ష్యతే. సాక్ష్యం తు. 'ఆదిత్యచన్ద్రావనిలోఽనలశ్చ ద్యౌర్భూమి రాపో హృదయం యమశ్చ, అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సంధ్యే ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్.' ఇతి ప్రమాణసిద్ధత్వాన్నోత్ప్రేక్ష్యమిత్యనుసంధేయమ్.

నినాయ సాఽత్యన్తహిమోత్కిరానిలాః
సహస్యరాత్రీరుదవాసతత్పరా,
పరస్పరాక్రన్దిని చక్రవాకయోః
పురో వియుక్తే మిథునే కృపావతీ.

టీ. సా=ఆదేవి, అత్యన్తహిమోత్కిరానిలాః=మిక్కిలి మంచుజిమ్ముగాలులుగల, సహస్య రాత్రీః=పుష్యమాసరాత్రులను, ఉదవాసతత్పరా=నీటియందు వసింప నాసక్తురాలై, పరస్పరాక్రన్దిని=ఒండొరులఁ బిలచుకొనుచున్నట్టియు, పురః=ముందు, వియుక్తే=ఎడఁబాసిన, చక్రవాకయోః, మిథునే = చక్రవాకజంటయందు, కృపావతీ=జాలిగలదై, నినాయ=వెళ్లించెను.

తా. మంచుకాలమున నీటిలో నిలిచి తనయెదుట నెడబాసిన స్త్రీపురుషచక్రవాకము లన్యోన్యముఁ బిలుచుకొనుచుండఁగాఁ జూచుచు జాలిపడుచు కాలము గడపెను.

వ్యా. నినాయేతి.—సా పార్వతీ ఉత్కిరన్తి క్షిపన్తీత్యుత్కిరాః. 'ఇగుపధజ్ఞా' ఇత్యాదినా కః. అత్యన్తం హిమానాముత్కిరా అనిలా యాసు తాః. సహస్యరాత్రీః పౌషరాత్రీః. ని. 'పౌషే తైషసహస్యౌ ద్వౌ' ఇత్యమరః. ఉదకే వాస ఉదవాసః. 'పేషం వాస వాహన ధిషు చ' ఇత్యుదాదేశః. ఉదవాసే తత్పరా ఆసక్తా తథా పరస్పరమాక్రన్దిన్యన్యోన్యమాక్రోశిని, పురోఽగ్రే వియుక్తే విరహిణి వియోగం ప్రాప్త ఇతి యావత్. చక్రవాకీ చ చక్రవాకశ్చ చక్రవాకౌ తయోశ్చక్రవాకయోర్మిథునే ద్వన్ద్వే కృపావతీ సతీ నినాయ. దుఃఖిషు కృపాలుత్వం మహతాం స్వభావ ఇతి చక్రవాకమిథునే కృపా-న తు కామితయేతి వాచ్యానవకాశః. వి. 'అప్సు వాసస్తు హేమన్తే క్రమశో వర్ధయేత్తపః' ఇతి మనుః.

ముఖేన సా పద్మసుగన్ధినా నిశి ప్రవేపమానాధరపత్త్రశోభినా,
తుషారవృష్టిక్షతపద్మసంపదాం సరోజసంధానమివాకరోదపామ్.

టీ. సా ఆమె, నిశి=రాత్రియందు, పద్మసుగంధినా = పద్మవాసనగలయట్టియు, ప్రవేపమానాధరపత్త్రశోభినా=మిక్కిలి వణఁకుచున్న క్రిందిపెదవియను తామరరేకుచే ప్రకాశించుచున్న, ముఖేన=మోముతో, తుషారవృష్టిక్షతపద్మసంపదాం=మంచుకురియుటచే కొట్టఁబడిన పద్మసంపదగల, అపాం=నీటికి, సరోజసంధానమివ=పద్మఁపుఁగూర్పును వలె, అకరోత్=చేసెను.

తా. చలిచే వణఁకుచు తపోనియమముచే నీటిలో నిల్చినదేవి చలించుచున్న తామరరేకుమాడ్కి నున్న క్రిందుపెదవిచే హిమప్రసారముచే పద్మనాశనమయి శోభదగ్గినకాలనికి ఆశోభను బూర్తిచేయుచున్నట్లుండెను. తామరపూవు వాసనవంటినిట్టూర్పులతో వాసననుఁ గూడ నీటికి సంక్రమింపఁ జేసెనని భావము. (హిమంతర్తువులో నీటిలో నిల్చి తపం బొనర్చెననుట.)

వ్యా. ముఖేనేతి.—సా పార్వతీ నిశి రాత్రౌ పద్మవత్, సుగన్ధినా సురభిణా 'గన్ధస్యేత్' ఇత్యాదినేకారః. ప్రవేపమానః కమ్పమానోఽధర ఓష్ఠ ఏవ పత్త్రం దలం తేన శోభత ఇతి తథోక్తేన ముఖేన తుషారవృష్ట్యా తుహినవర్షేణ క్షతా నాశితాః. పద్మసంపదో యాసాం తాసామపాం సరోజసంధానం పద్మసంఘట్టనమకరోదివ. ఇత్యుత్ప్రేక్షాలంకారః. పద్మాన్తరం తుహినేనోపహన్యతే తన్ముఖపద్మం తు న తథేతి వ్యతిరేకాలంకారో వ్యజ్యత ఇత్యుభయోః సంకరః.

స్వయంవిశీర్ణద్రుమపర్ణవృత్తితా పరాహి కాష్ఠా తపసస్తయా పునః, ·
తదప్యపాకీర్ణమతఃప్రియంవదాం వదన్త్యపర్ణేతి చ తాం పురావిదః.

టీ. స్వయం విశీర్ణద్రుమపర్ణవృత్తితా = తానై రాలినచెట్టాకు జీవనముగాఁ జేయుట, తపసః పరాకాష్ఠా హి=తపంబున కతిశయమగు గొప్పఁదనముగదా, తయా పునః=ఆదేవిచే, తదపి అపాకీర్ణం=అదియు విడువఁబడినది, అతః = ఈకారణమువలన, ప్రియంవదాం తాం=ప్రియమునుబల్కు నాదేవిని, పురావిదః = పురాణముల నెఱిఁగినవారు, అపర్ణేతి చ=అపర్ణయనియు, వదన్తి=చెప్పుచున్నారు.

తా. లోకములో రాలినయాకులనుదిని తపంబొనర్చుట గొప్పదియగు తపోవధిగానెన్నుదురు. ఈమె యన్ననో ఆపర్ణములనుకూడ విడుచుటచే నపర్ణయని పెద్దలు బిలిచిరి.

వ్యా. స్వయమితి.— స్వయం విశీర్ణాని స్వతశ్చ్యుతాని ద్రుమపర్ణాన్యేవ వృత్తిర్జీవనం యస్య తస్య భావస్తత్తా తపసః. పరా కాష్ఠా పరముత్కర్షో హి. ని.

'కాష్ఠాఃకక్షైస్తే స్థితా దిశి' ఇత్యమరః. తయా దేవ్యా పునస్తత్ పర్ణవర్తనమప్యపాకీర్ణం అపాకృతమ్. అతః పర్ణాపాకరణాద్ధేతోః, ప్రియం వదతీతి ప్రియంవదా 'ప్రియవశే వదః ఖచ్' ఇతి ఖచ్ప్రత్యయః. 'అరుర్ద్విషదజన్తస్య ముమ్' ఇతి ముమాగమః. తాం పార్వతీం, పురావిదః పురాణజ్ఞాస్తపఃకరణసమయేఽవిద్యమానం పర్ణభక్షణం యస్యాః సాఽపర్ణేతి వదన్తి. నామాన్తరసముచ్చయార్థశ్చకారః. అత్ర 'అపర్ణామ్' ఇత్యపపాఠః. ఇతి శబ్దాభిహితే ద్వితీయానుపపత్తేః. యథాహ వామనః. 'నిపాతేనాప్యభిహితే కర్మణి న కర్మవిభక్తిః. పరిగణనస్య ప్రాయికత్వాత్.' ఇతి; స్వయం ప్రియంవదాః పరేషామపి ప్రియవాదభాజనాని భవన్తీతి భావః.

మృణాళికాపేలవమేవమాదిభి
ర్వ్రతైః స్వమఙ్గం గ్లపయన్త్యహర్నిశమ్,
తపశ్శరీరైః కఠినైరుపార్జితం
తపస్వినాం దూరమధశ్చకార సా. 29

టీ. మృణాళికా పేలవం స్వం అంగం = తామరతూడువలె మెత్తని తనదేహమును, ఏవం ఆదిభిఃవ్రతైః=అగ్నిజలస్థలములను నిలుచుట మున్నగువ్రతములచే, అహర్నిశం=రాత్రింబవళ్లు, గ్లపయంతీ=కృశింపఁజేయుచు, సా=ఆదేవి, తపస్వినాం = తపశ్శాలురయొక్క, కఠినైః శరీరైః=దృఢమగుశరీరములచే, ఉపార్జితం=సంపాదింపఁబడిన, తపః=తపస్సును, దూరం=మిక్కిలి, అధశ్చకార=క్రిందుచేసెను.

తా. మిక్కిలి దేహము మృదువైనను కఠినతపములొనర్చి దృఢకాయులరగు మునులతపంబులను మించెనని తాత్పర్యము.

వ్యా. మృణాళికేతి.—మృణాలికాపేలవం పద్మినీకన్దకోమలం స్వం స్వకీయమఙ్గం శరీరమేవముక్తప్రకారతోయాగ్నిమధ్యవాసవ్రతమాదిశేషాం తైర్వ్రతైరహశ్చ నిశా చాహర్నిశమ్ సమాహారే ద్వంద్వైకవద్భావః. అత్యన్తసంయోగే ద్వితీయా. గ్లపయన్తీ కర్శయన్తీ సా పార్వతీ కఠినైః క్లేశసహైరిత్యర్థః. శరీరైః ఉపార్జితం సంపాదితం తపస్వినామృషీణాం తపో దూరమత్యన్తమధశ్చకార తిరశ్చకార అతిశిశ్య ఇత్యర్థః. తపస్విభిరప్యేవం తపః కర్తుం న శక్యత ఇతి తాత్పర్యార్థః.

అథాజినాషాఢధరః ప్రగల్భవాగ్జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా,
వివేశ కశ్చిజ్జటిలస్తపోవనం శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా. 30

టీ. అథ=పిమ్మట, అజినాషాఢధరః = నల్లలేడిచర్మను మోదుగుకఱ్ఱను ధరించినట్టియు, ప్రగల్భవాక్ = ప్రౌఢవాక్కులుగలయట్టియు, బ్రహ్మమయేన తేజసా=వైదిక

మగువర్చస్సుతో, జ్వలన్నివ = వెలుఁగుచున్నవాఁడువలెనున్నట్టియు, కశ్చిత్ = ఒక, జటిలః=జటాధరుఁడు (బైరాగి), శరీరబద్ధః = శరీరముగాచేయఁబడిన, ప్రథమాశ్రమో యథా=బ్రహ్మచర్యాశ్రమమెయాయన్నట్లుగా (ఉన్నవాఁడనుట), తపోవనం = (అయమ్మ యొక్క) తపస్సుఁజేయువనమునుగూర్చి, వివేశ=ప్రవేశించెను.

తా. లేడిచర్మను పాలాశదండమును ధరించి ప్రౌఢమగుమాట లాడుచు బ్రహ్మతేజస్సొలుకుచున్న యొక్కబైరాగి బ్రహ్మచర్యాశ్రమ మీరూపము ధరించెనా యన్నట్లున్నవాఁడై యమ్మవారియాశ్రమము లోనికి ప్రవేశించెను.

వ్యా. అథేతి.—అథానన్తరమజినం కృష్ణమృగత్వక్ ఆషాఢః ప్రయోజనమస్యే త్యాషాఢః పాలాశదణ్డః. ని. 'పాలాశో దణ్డ ఆషాఢః' ఇత్యమరః. 'విశాఖాషాఢాదణ్ మన్థదణ్డయోః' ఇత్యణ్ప్రత్యయః. తయోర్ధరస్తథోక్తః. ప్రగల్భవాక్ ప్రౌఢవచనో బ్రహ్మమయేన వైదికేన తేజసా బ్రహ్మవర్చసేనేత్యర్థః. జ్వలన్నివ స్థితః ఇవశబ్దో నిర్ధార ణార్థః. కశ్చిదనిర్దిష్టో జటిలో జటావాన్ బ్రహ్మచారీతి శేషః. పిచ్ఛాదిత్వాదిలచ్ప్ర త్యయః. శరీరబద్ధో బద్ధశరీరః. శరీరవానిత్యర్థః. ఆహితాగ్న్యాదిషు పాఠాత్సాధుః. ప్రథమాశ్రమో యథా బ్రహ్మచర్యాశ్రమఇవ యథాశబ్ద ఇవార్థే. తపోవనమ్ దేవ్యా ఇతి శేషః. వివేశ ప్రవిష్టవాన్.

తమాతిథేయీ బహుమానపూర్వయా
సపర్యయా ప్రత్యుదియాయ పార్వతీ,
భవన్తి సామ్యేఽపి నివిష్టచేతసాం
వపుర్విశేషేష్వతిగౌరవాః క్రియాః. 31

టీ. ఆతిథేయీ పార్వతీ = అతిథులయందిష్టురాలగు పార్వతీదేవి, తం=అబ్రహ్మ చారిని, బహుమానపూర్వయా = గౌరవపూర్వకమగు, సపర్యయా=పూజచే, ప్రత్యుది యాయ=ఎదుర్కొనెను. సామ్యే అపి=సమత్వము కలిగియున్నను, నివిష్టచేతసాం=స్థిర చిత్తముగలవారికి, వపుర్విశేషేషు = వ్యక్తివిశేషములయందు, అతిగౌరవాః=మిక్కిలి గౌరవములుగల, క్రియాః=వ్యాపారములు, భవన్తి=అగుచున్నవి.

తా. అతిథులయందిష్టముగలదేవి యాబైరాగిని కడుగౌరవ ముచేఁ బూజించెను. (తనబోటి తపశ్శాలియే వానిని బూజింపనేల ?) ఆకృతివిశేషములలో చిత్తస్థైర్యముగలవారు గౌరవాతిశయముఁ జూపుదురు.

వ్యా. తమితి.—అతిథిషు సాధ్వ్యతిథేయీ. 'పథ్యతిథి' ఇత్యాదినా ఢఞ్ప్రత్యయః. 'టిడ్ఢాణఞ్' ఇత్యాదినా జీప్. పార్వతీ తం బ్రహ్మచారిణం బహుమానపూర్వయా బహుమానః పూర్వో యస్యాస్తయా - గౌరవపూర్వయేత్యర్థః. సపర్యయాఽర్చయా. ని. 'సపర్యార్చార్హణాః సమాః' ఇత్యమరః. ప్రత్యుదియాయ ప్రత్యుజ్జగామ. కథం సమానేఽపి తస్యాస్తాదృశీ ప్రతిపత్తిరత ఆహ. సామ్యే సత్యపి నివిష్టచేతసాం స్థిరచిత్తానాం వపుర్విశేషేషు వ్యక్తివిశేషేష్వతిశయితం గౌరవం యాసు తా అతిగౌరవా అతిగౌరవసహితాః, క్రియాః చేష్టా భవంతి ప్రవర్తంత ఇత్యర్థః. సాధవో న సామ్యాభినివేశిన ఇతి భావః.

విధిప్రయుక్తాం పరిగృహ్య సత్క్రియాం
పరిశ్రమం నామ వినీయ చ క్షణమ్,
ఉమాం స పశ్యన్ ఋజునైవ చక్షుషా
ప్రచక్రమే వక్తుమనుజ్ఝితక్రమః. 32

టీ. సః=ఆబైరాగి, విధిప్రయుక్తాం=శాస్త్రరీతిగాఁ జేయఁబడిన, సత్క్రియాం=పూజను, పరిగృహ్య=పొంది, క్షణం=క్షణకాలము, పరిశ్రమంచ=ఆయాసమును, వినీయ నామ=తీర్చుకొన్నట్లునటించి, ఉమాం = పార్వతీదేవిని, ఋజునైవ చక్షుషా=విలాసము మున్నగునవి లేనికంటితో, పశ్యన్ = చూచుచున్నవాఁడై, అనుజ్ఝితక్రమః=విడువని పరిపాటికలవాఁడై, వక్తుం=పల్కుటకు, ప్రచక్రమే=ఉపక్రమించెను.

తా. ఆబైరాగి విధ్యుక్తముగాఁ బూజఁగొని ఆయాసముపోవుటను నటించి ధారాళముగా నాదేవిని చూచుచు సక్రమముగా చెప్పఁబోవురీతిని మాటలాడుట కుపక్రమించెను.

వ్యా. విధీతి.—స బ్రహ్మచారీ, విధినా- ప్రయుక్తామనుష్ఠితాం సత్క్రియాం పూజాం పరిగృహ్య స్వీకృత్య క్షణం పరిశ్రమం విశ్రామం చ వినీయనామ - నామేత్యపరమార్థే అధోమామృజునైవ విలాసరహితేనైవ చక్షుషా పశ్యన్ననుజ్ఝితక్రమోఽత్యక్తోచితపరిపాటీకః సన్ వక్తుం ప్రచక్రమే ప్రారేభే.

అపి క్రియార్థం సులభం సమిత్కుశం
జలాన్యపి స్నానవిధిక్షమాణి తే,
అపి స్వశక్త్యా తపసి ప్రవర్తసే
శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్. 33

టీ. క్రియార్థం= హోమాదికర్మకొఱకు, సమిత్కుశం = సమిధలు దర్భలును సులభమపి=కష్టములేక దొరుకునుగదా? జలాని=నీళ్లు, తే=నీకు, స్నానవిధిక్షమాణిఅపి=

స్నానము చేయుటకుఁ దగియున్నవికదా? స్వ శక్త్యా = శక్తికొలది చే, తపసి=తపమ్మున, ప్రవర్తసే అపి=ప్రవర్తించుచుంటివా? ఖలు=ఎందువలన ననఁగా? శరీరం = ఒడలు, ఆద్యం ధర్మసాధనం=(అన్నిధర్మములకు) మొదటిసాధనముగదా?

తా. (ఓబాలా) హోమాదులకు సమిధలు దర్భలు దొరుకునా? నీకు స్నానమునకు నీళ్లున్నవా? శక్తికొలఁదిగా తపం బొనరించు చున్నావా? అన్ని కార్యములకు దేహము ముఖ్యము గనుక మిక్కిలి తపం బొనర్చినచో రోగాదులు వచ్చి దేహారోగ్యము చెడును పుణ్యకర్మలు నశించును కావున శక్తిని మించక తపం బొనర్చుచుంటివా?

వ్యా. అపీతి.—అత్రాపిశబ్దః ప్రశ్నే. క్రియార్థం హోమాదికర్మానుష్ఠానార్థం సమిధశ్చ కుశాశ్చ సమిత్కుశం 'జాతిరప్రాణినామ్' ఇతి ద్వన్ద్వైకవద్భావః. సులభ మపి సులభం కచ్చిత్? జలాని తే తవ స్నానవిధిక్షమాణి స్నానక్రియాయోగ్యాన్యపి కచ్చిత్? కిఞ్చ స్వశక్త్యా నిజసామర్థ్యానుసారేణ తపసిప్రవర్తసేఽపి? దేహమపీడయి త్వా తపశ్చరసి కచ్చిదిత్యర్థః. యుక్తం చ నాత్మైతత్. ఖలు యస్మాచ్ఛరీరమాద్యం ధర్మసాధనం. ధర్మస్తు కాయేన వాచా బుద్ధ్యా ధనాదినా చ బహుభిః సాధ్యతే-తేషు చ వపురేవ ముఖ్యం సాధనం- సతి దేహే ధర్మార్థకామమోక్షలక్షణశ్చతుర్వర్గః సాధ్య తే-అత ఏవ. వి. 'సతతమాత్మానమేవ గోపాయీత' ఇతి శ్రుతిః.

అపి త్వదావర్జితవారిసంభృతం
ప్రవాళమాసామనుబన్ధి వీరుధామ్,
చిరోజ్ఝితాలక్తకపాటలేన తే
తులాం యదారోహతి దన్తవాససా. 34

టీ. త్వదావర్జితవారిసంభృతం = నీచే పోయఁబడిననీటిచే పుట్టింపఁబడిన, ఆసాం వీరుధాం=ఈలతలయొక్క, ప్రవాళం=చిగురుఁ అనుబంధ్యపి=వర్ధిల్లుచున్నదా? యత్ = ఏచిగురు, చిరోజ్ఝితాలక్తకపాటలేన = చిరకాలమునుండి విడువఁబడిన లత్తుకగలఁడగుట తెలుపుతోఁగూడిన యెఱుపుగల, తే = నీయొక్క, దంతవాససా = అధరోష్ఠముతో తులాం=సాటిని, ఆరోహతి=పొందుచున్నదో.

తా. నీచే పోయఁబడిననీళ్ళచేఁ బుట్టింపఁబడిన యీతీఁగలచి గురు వర్ధిల్లుచున్నదా? ఎట్టిదాచిగురు? చిర కాలమునుండి నీవు లత్తుకబూ

యక యుండుటచే పాటలవర్ణముగల నీక్రిందు పెదవితో సామ్యమును బొందుచున్నది.

వ్యా. అపీతి.—త్వయాఽఽవర్జితేన సిక్తేన వారిణా సంభృతం జనితమాసాం వీరుధాం లతానాం ప్రవాలం పల్లవమనుబన్ధ్యప్యనుస్యూతం కిం. యత్ప్రవాలం చిరోజ్ఝితశ్చిరకాలత్యక్తో లాక్షారాగో యేన తత్తథాఽపి పాటలం స్వభావరక్తమిత్యర్థః. తేన చిరోజ్ఝితాలక్తకపాటలేన, తే తవ దన్తవాససాఽధరేణ. ని. 'ఓష్ఠాధరౌ తు రదనచ్ఛదౌ దశనవాససీ' ఇత్యమరః. తులాం సామ్యమారోహతి గచ్ఛతీత్యర్థః. అత్ర తులాశబ్దస్య సాదృశ్యవాచిత్వాత్తద్యోగేఽపి 'తుల్యార్థైరతులోపమాభ్యామ్' ఇతి న తృతీయాప్రతిషేధస్తత్ర సూత్రే సదృశవాచిన ఏవ గ్రహణాదితి.

అపి ప్రసన్నం హరిణేషు తే మనః
కరస్థదర్భప్రణయాపహారిషు,
య ఉత్పలాక్షి ప్రచలైర్విలోచనై
స్తవాక్షిసాదృశ్యమివ ప్రయుఞ్జతే. 35

టీ. కరస్థదర్భప్రణయాపహారిషు = చేతియందున్న దర్భను విశ్వాసముచే నపహరించుచున్న, హరిణేషు=లేళ్లయందు, తే మనః=నీయొక్క మనస్సు, ప్రసన్నమపి=నిర్మలమైనదికదా? ఉత్పలాక్షి=నల్లకల్వంబోలు కన్నులుగలదానా! యే=ఏలేళ్లు, ప్రచలైః, విలోచనైః = చంచలనేత్రములచే, తవ=నీయొక్క, అక్షిసాదృశ్యం = నేత్రసాధర్మ్యమును, ప్రయుంజతే ఇవ=అభినయించుచున్నవిపలెనున్నవో, (అట్టిలేళ్లయం దనుట.)

తా. ఓచిన్నదానా! చంచలదృష్టుల నిన్ననుకరించుచున్నవైయే లేళ్లున్నవో యవి చనువుచే నీచేతిలోనిదర్భల లాగికొనుచుండఁగా నీకు వానియందు కోపము రాలేదుగదా? తపశ్శాలులకుఁ గోపముండరాదు.

వ్యా. అపీతి.—కరస్థాః దర్భాః - ప్రణయేన స్నేహేనాపహారంతీతి తే తథోక్తేషు సాపరాధేష్వితిభావః. 'కరస్థదర్భప్రణయాపరాధిషు' ఇతిపాఠే. దర్భాణాం ప్రణయేన ప్రార్థనయాఽపరాధిషు హరిణేషు విషయే తే మనః ప్రసన్నమపి న క్షుభితం కిం. సాపరాధేష్వపి న కోపితవ్యం తపస్విభిరితి భావః. హేఉత్పలాక్షి యే హరిణాః ప్రచలైశ్చఞ్చలైర్విలోచనైర్నేత్రైస్తవాక్షిసాదృశ్యం ప్రయుఞ్జత ఇవాభినయన్తీవ.

ప్రసన్నత్వాన్మృగనేత్రాణి త్వన్నయనైః సామ్యముపయాన్తీతి భావః. 'ఉత్పలక్షేప చలైః' ఇతిపాఠాన్తర ఉత్పలకమ్పచలైః. భావానయనేన ద్రవ్యానయనమితిన్యాయేన క్షిప్యమాణోత్పలచలై రిత్యర్థః.

యదుచ్యతే పార్వతి పాపవృత్తయే
న రూపమిత్యవ్యభిచారి తద్వచః,
తథా హి తే శీలముదారదర్శనే
తపస్వినామప్యుపదేశతాం గతమ్. 36

టీ. పార్వతి=ఓ పార్వతీ ! రూపం=సౌందర్యము, పాపవృత్తయే=పాపవ్యాపారమునకు, న ఇతి యత్ వచః ఉచ్యతే=కాదనియేమాట చెప్పఁబడుచున్నదో, తద్వచః= ఆమాట, అవ్యభిచారి=తప్పనిది, తథాహి=అలాగుననే, ఉదారదర్శనే = గొప్పకన్నులు గలదానా! (జ్ఞానాధికురాలా !) తే=నీయొక్క, శీలం=సద్వృత్తి, తపస్వినామపి = తపశ్శాలురకును, ఉపదేశతాం=ఉపదేశమగుటను, గతం=పొందినది.

తా. ఓపార్వతీ ! చక్కఁదనము పాపమొనర్పదు అనుమాట సత్యమైనది నిజమే. ఎందుచే ననఁగా: జ్ఞానురాలా ! నీనడవడిని మునులును నేర్చుకొనుచున్నారు గదా ? (నీవే యుదాహరణ యనుట)

వ్యా. యదితి.—హే పార్వతి ! రూపం సౌమ్యాకృతిః పాపవృత్తయే పాపాచరణాయ న భవతీతి యదుచ్యతే లోకైరితి శేషః. తద్వచో న వ్యభిచరతి న స్ఖలతీత్యవ్యభిచారి సత్యం. వి. 'యత్రాకృతిస్తత్ర గుణాః' 'న సురూపాః పాపసమాచారా భవన్తి' ఇత్యాదయో లోకవాదా న విసంవాదమాసాదయంతీత్యర్థః. కిమితిజ్ఞాయతే తథాహి-హే ఉదారదర్శనే అయతాక్షి సురూపే ఇత్యర్థః. అథవోన్నతజ్ఞానే వివేకవతీత్యర్థః. తే తవ శీలం సద్వృత్తమ్. ని. 'శీలం స్వభావే సద్వృత్తే' ఇత్యమరః. తపస్వినామప్యుపదిశ్యతేఽనేనేత్యుపదేశః ప్రవర్తకం ప్రమాణం తత్తాముపదేశతాం గతం ప్రాప్తం. మునయోఽపి త్వాం వీక్ష్య స్వవృత్తే ప్రవర్తన్త ఇతి భావః.

వికీర్ణసప్తర్షిబలిప్రహాసిభి
స్తథా న గాంగైః స్సలిలైర్దివశ్చ్యుతైః,
యథా త్వదీయైశ్చరితై రనావిలై
ర్మహీధరః పావిత ఏష సాన్వయః. 37

టీ. ఏష మహీధరః=ఈహిమవంతుఁడు, వికీర్ణసప్తర్షిబలిప్రహాసిభిః-వికీర్ణ = వెదచల్లఁబడిన, సప్తర్షిబలిప్రహాసిభిః = సప్తర్షులపూజకుఁ జెందినపూవులచే నవ్వుచున్నవియు, దివశ్చ్యుతైః = అంతరిక్షమునుండి జారుచున్నవియు, (నగు) గాఙ్గైః సలిలైః= గంగోదకములచేఁగూడ, న తథా=అట్లు పవిత్రుఁడు కాలేదు. యథా=ఎట్లు, అనావిలైః త్వదీయైః చరితైః=నిష్కల్మషములగు నీచరిత్రలచే, సాన్వయః = వంశముతోఁగూడ, పావితః=పవిత్రుఁడాయెనో.

తా. ఈహిమవంతుఁడు సప్తర్షులపూజాపుష్పములచే నవ్వుచున్నవివలె నున్నవియు, ఆకాశమునుండి జారుచున్నవియునగు గంగోదకములచేఁగూడ నిర్మలమగు గుణములుగల నీచే వంశముతోఁ బవిత్రుఁడైనట్లు పవిత్రుఁడు కాలేదు.

వ్యా. వికీర్ణేతి.—ఏష మహీధరః హిమవాన్, సప్త చ తే ఋషయశ్చ సప్తర్షయః. 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' ఇతి సమాసః. వికీర్ణైః పర్యస్తైః సప్తర్షీణాం సంబన్ధిభిర్బలిభిః పుష్పోపహారైః. ప్రహసన్తి యే తథోక్తైర్దివోఽన్తరిక్షాచ్చ్యుతైర్గాఙ్గైః సలిలైస్తథా న పావితః, అనావిలైరకలుషైస్త్వదీయైశ్చరితైర్యథా సాన్వయః సపుత్రపౌత్రః పావితః పవిత్రీకృతః.

అనేన ధర్మస్సవిశేషమద్య మే
త్రివర్గసారః ప్రతిభాతి భావిని,
త్వయా మనోనిర్విషయార్థకామయా
యదేక ఏవ ప్రతిగృహ్య సేవ్యతే. 38

టీ. భావిని=మంచియభిప్రాయముగలదానా ! అనేన = ఈకారణముచే, ధర్మః= ధర్మము అనుపురుషార్థము, సవిశేషం = అతిశయముతో, అద్య = ఇప్పుడు, మే=నాకు, త్రివర్గసారః=ధర్మకామార్థములలో శ్రేష్ఠమై, ప్రతిభాతి = తోఁచుచున్నది, యత్ = ఎందువలన, మనోనిర్విషయార్థకామయా=మనస్సునకు విషయముగాని అర్థకామములుగల, త్వయా=నీచే, ఏకఏవ=ధర్మమొక్కటియే, ప్రతిగృహ్య = స్వీకరించి, సేవ్యతే = సేవింపఁబడుచున్నదో.

తా. మంచియభిప్రాయములుగలదానా! ధర్మార్థకామములను త్రివర్గములో నేకారణముచే మిగిలినరెండింటిని మనస్సులోఁదలఁచక ధర్మమునుమాత్రమును స్వీకరించితివో యక్కారణమువలన త్రివర్గములో ధర్మమే శ్రేష్ఠమయినదని స్వీకరించఁబడినది

వ్యా. అనేనేతి.—హే భావిని ప్రశస్తాభిప్రాయే అనేన కారణేన ధర్మః సవిశేషం సాతిశయమద్య మే త్రయాణాం ధర్మకామార్థానాం వర్గస్త్రివర్గః. ని. 'త్రివర్గో

ధర్మకామార్థైశ్చతుర్వర్గః సమోక్షకైః' ఇత్యమరః. తత్ర సారః శ్రేష్ఠః ప్రతిభాతి. యద్యస్మాత్కారణాన్మనసో నిర్విషయావర్థకామౌ యస్యాస్తయా త్వయైకో ధర్మ ఏవ ప్రతిగృహ్య స్వీకృత్య సేవ్యతే యత్త్వయాఽర్థకామౌ విహాయ ధర్మ ఏవావలమ్బితః. అతః సర్వేషాం నః స శ్రేయానితి ప్రతిపద్యత ఇత్యర్థః.

ప్రయుక్తసత్కారవిశేషమాత్మనా
న మాం పరం సంప్రతిపత్తుమర్హసి,
యతస్సతాం సన్నతగాత్రి సఙ్గతం
మనీషిభిస్సాప్తపదీనముచ్యతే. 39

అవ. ఇప్పుడు కోరికను దెలిసికొనుటకు ప్రస్తావన జేయుచున్నాఁడు.—

టీ. ఆత్మనా=నీచే, ప్రయుక్తసత్కారవిశేషం=చేయఁబడిన పూజావిశేషముగల, మాం=నన్ను. పరం = అన్యునిగాను, సంప్రతిపత్తుం = తెలిసికొనుటకు, నార్హసి=తగవు. సన్నతగాత్రి=వంగిన శరీరముగలదానా! యతః=ఎందువలన, మనీషిభిః = విద్వాంసులచే, సతాం=సత్పురుషులయొక్క, సంగతం=స్నేహము, సాప్తపదీనం=సప్తపదముల నుచ్చరించుటచే సాధ్యమయినదిగా, ఉచ్యతే=చెప్పఁబడుచున్నదియో.

తా. నీచే పూజావిశేషములనందిన నన్నన్యునిగా భావింపకుము. కారణమేమనఁగా: విద్వాంసులు సన్మైత్రిని యేడుమాటలచే లభ్యమగుదానినిగాఁ జెప్పుచున్నారు. (మనకన్నవో యేడుమాటలకంటె మించెను గనుక స్నేహధర్మముచే నన్ను బరునిగా నెంచకంటిననుట.)

అవ. సంప్రతి మనోరథం జిజ్ఞాసుః ప్రస్తౌతి.—

వ్యా. ప్రయుక్తేతి.—ఆత్మనా త్వయా ప్రయుక్తః. సత్కారవిశేషః పూజావిశేషో యస్య తం మాం పరమన్యం, సంప్రతిపత్తుమవగన్తుం నార్హసి హే సన్నతగాత్రి సన్నతాఙ్గి 'అఙ్గగాత్రకణ్ఠేభ్యః' ఇతి వక్తవ్యాన్జీష్. యతః కారణాన్మనస ఈషిభిర్మనీషిభిర్విద్వద్భిః శకన్ధ్వాదిత్వాత్ సాధుః. సతాం సంగతం సఖ్యం సప్తభిః పదైరాపద్యత ఇతి సాప్తపదీనం సప్తపదోచ్చారణసాధ్యముచ్యతే - తచ్చావయోస్త్వత్కృతసత్కారప్రయోగాదేవ సిద్ధమిత్యర్థః. 'సాప్తపదీనం సఖ్యమ్' ఇతి నిపాతనాత్ సాధుః.

అతోఽత్ర కిఞ్చిద్భవతీం బహుక్షమాం
ద్విజాతిభావాదుపపన్నచాపలః,
అయం జనః ప్రష్టుమనాస్తపోధనే
న చేద్రహస్యం ప్రతివక్తుమర్హసి. 40

టీ. తపోధనే=తపోధనురాలగు గౌరీ! అతః=సఖ్యమువలననే, అత్ర=ఈప్రసంగములో, బహుక్షమాం = మిక్కిలి యోర్పుదానవగు (మిక్కిలి శాంతిగలదానవగు), భవతీం=నిన్ను, ద్విజాతి భావాత్ = బ్రాహ్మణభావమువలన, ఉపపన్నచాపలః=పొందఁబడిన చపలత్వముగల, (అధ్యస్తమగు ధృష్టత్వముగల,) అయంజనః=ఈజనుఁడు (నేను), కించిత్ ప్రష్టుమనాః = కొంచెమడుగుటకు కోరికగలవాఁడు, రహస్యం న చేత్=గోప్యముకానియెడల, ప్రతివక్తుం=ప్రత్యుత్తరము నిచ్చుటకు, అర్హసి=తగుదువు.

తా. తపశ్శీలురాలా ! స్నేహధర్మమువలన మిక్కిలి శాంతస్వభావురాల వగు నిన్ను బ్రాహ్మణచాపల్యముచే కొంచెము ప్రశ్నించెదను. అది రహస్యము కానిచో జబాబు నీయుము.

వ్యా. అతఇతి.—హే తపోధనే, అతః సఖ్యాద్ధేతోరత్ర ప్రస్తావే బహుక్షమాం బహూక్తిసహాం యద్వా క్షమావతీం, భవతీం త్వాం ద్విజాతిభావా ద్బ్రాహ్మణత్వా దుపపన్నచాపలః సులభధార్ష్ట్యోయోఽయం జనః. స్వయ మిత్యర్థః. కిఞ్చిత్ ప్రష్టుం మనో యస్య స కించిత్ ప్రష్టుమనాః ప్రష్టుకామః. 'తుమ్ కామమనసోరపి' ఇతి మకారలోపః. రహసి భవం రహస్యం గోప్యం న చేత్, ప్రతివక్తుమర్హసి.

కులే ప్రసూతిః ప్రథమస్య వేధస
స్త్రిలోకసౌన్దర్యమివోదితం వపుః,
అమృగ్యమైశ్వర్యసుఖం నవం వయ
స్తపఃఫలం స్యాత్కిమతః పరం వద. 41

అవ. అడుగఁబోవుదానిని చెప్పుచున్నాఁడు.—

టీ. ప్రథమస్యవేధసః = హిరణ్యగర్భునియొక్క, కులే=వంశంబున, ప్రసూతిః=ఉత్పత్తి, వపుః=శరీరము, త్రిలోకసౌందర్యం=ముల్లోకముల చక్కఁదనము, ఉదితమివ=ఒకస్థలమునకుఁ జేర్చినదివలెనున్నది. ఐశ్వర్యసుఖం=భాగ్యముయొక్కసౌఖ్యము, అమృగ్యం=వెదక నక్కఱలేదు. వయః=వయసు, నవం=లేఁతది, అతః పరం=దీనికంటె నధికమగు, అన్యత్=ఇతరము, కిం=ఏది, తపఃఫలం=తపస్సునకుఫలము, స్యాత్=అగును. వద=చెప్పుము.

తా. తపస్సువలన సంపాదించవలసినవన్నియు నీకు సిద్ధముగా నుండఁగా నీతపస్సేలను? కులముజూచిన హిరణ్యగర్భుఁడు వంశకర్త గలది. ముల్లోకముల చక్కఁదన మొక్కెడచేరినట్లు చక్కఁదనము.

ఐశ్వర్యము చెప్ప నక్కఱలేదు. వయస్సు లేతది. దీనికంటె యేమికోరి తపస్సు చేయుచుంటివి చెప్పుమా.

అవ. ప్రష్టవ్యమాహ.—

వ్యా. కులఇతి.—ప్రథమస్య వేధసో హిరణ్యగర్భస్య, కులేఽన్వవాయే ప్రసూతిః ఉత్పత్తిః. వి. 'యజ్ఞార్థం హి మయా సృష్టో హిమవానచలేశ్వరః' ఇతి బ్రహ్మపురాణవచనాత్, వపుః శరీరం త్రయాణాం లోకానాం సౌన్దర్యమివోదితమేకత్ర సమాహృతమ్, ఐశ్వర్యసుఖం సంపత్సుఖమమృగ్య మన్వేషణీయం న భవతి. కిం తు సిద్ధమేవేత్యర్థః. వయో నవం యౌవనమిత్యర్థః. అతః పర మతోఽన్యత్ కిం తపః ఫలం స్యాద్వద అస్తి చేదితి శేషః. న కిఞ్చిదస్తీత్యర్థః.

భవత్యనిష్టాదపి నామ దుస్సహా న్మనస్వినీనాం ప్రతిపత్తి రీదృశీ,
విచారమార్గప్రహితేన చేతసా న దృశ్యతే తచ్చ కృశోదరి త్వయి.

టీ. దుస్సహాత్ = ఓర్వశక్యముకాని, అనిష్టాదపి=(భర్త మున్నగువారిచే చేయఁబడిన) అప్రియమువలననయితము, మనస్వినీనాం=ధీరురాండ్రగు స్త్రీలకు, ఈదృశీ=ఇట్టి, ప్రతిపత్తిః=ప్రవృత్తి, భవతినామ=కలుగవచ్చును. విచారమార్గప్రహితేన = విచారమార్గమునందు నడపఁబడిన, చేతసా=చిత్తముచే, తచ్చ=ఆయనిష్టంబును, కృశోదరి=సూక్ష్మమగుకడుపుగల యో పార్వతీదేవి, త్వయి=నీయందు, న దృశ్యతే=అగపడదు.

తా. ఓపార్వతీ! ప్రియులవలనఁగల్గిన యప్రియములచే ధీరురాండ్రిట్లు తపశ్చర్య పూనుటకలదు కాని యదియు నీయొద్ద నసంభవము (కావున నేలతపంబునకుఁ బూనితివనుట)

వ్యా. భవతీతి.—దుస్సహాత్ సోఢు మశక్యాదనిష్టా ద్భర్త్రాదికృతాదపి, మనస్వినీనాం ధీరస్త్రీణా మీదృశీ తపశ్చరణలక్షణా ప్రతిపత్తిః ప్రవృత్తిః. ని. 'ప్రతిపత్తిస్తు గౌరవే ప్రాప్తౌ ప్రవృత్తౌ ప్రాగల్భ్యే' ఇతి కేశవః. భవతి నామ నామేతి సంభావనాయాం విచారమార్గే ప్రహితేన చేతసా చిత్తేన తదనిష్టం చ, హే కృశోదరి త్వయి న దృశ్యతే విచార్యమాణే తదపి నాస్త్యసంభావితత్వా దిత్యర్థః.

అలభ్యశోకాభిభవేయమాకృతి
ర్విమాననా సుభ్రు కుతః పితుర్గృహే,

పరాభిమర్శో న తవాస్తి కః కరం
ప్రసారయేత్ పన్నగరత్నసూచయే. 43

అవ. అనిష్టమైనది లేకపోవుటనే విస్తరించి చెప్పుచున్నాఁడు.—

టీ. హేసుభ్రు=ఓమంచికనుబొమలుగలదానా! ఇయం ఆకృతిః = ఈనీయాకారము, అలభ్యశోకాభిభవా=పొందశక్యముగాని భర్త్రాదితిరస్కారముగలది, (దుఃఖము లేని దీయాకారమనుట) పితుర్గృహే = తండ్రియొక్కయింటియందు, విమాననా కుతః = తిరస్కారమెక్కడిది? పరాభిమర్శః = ఇతరులవలని తిరస్కారము, తవ=నీకు, నాస్తి=లేదు పన్నగరత్నసూచయే = సర్పమణిశలాకను గ్రహించుటకు, కః=ఎవ్వఁడు, కరం=హస్తమును ప్రసారయేత్ = చాపును.

తా. ఓసుందరురాలా! నీయాకారము దుఃఖమున కనర్హమైనది, నీకు కోపముకలుగుటకుఁ గారణముఁ గానను. పుట్టినింట నవమానము లేదుగద. ఇతరతిరస్కార మసంభవము. ఎందుకనఁగా! పాము తల మీఁదనున్న మాణిక్యమున కెవ్వఁడు చేచాపును? నీతో విరోధము చేయుటట్టిదె గాన దానికి నెవ్వఁడును సాహసింపఁడు. తపంబునకుఁ గారణ మేమనుట.

అవ. అనిష్టాభావమేవ ప్రపఞ్చయతి.—

వ్యా. అలభ్యేతి.— హే సుభ్రు, ఇయం త్వదీయా ఆకృతిర్మూర్తిరలభ్యోఽలబ్ధుమనర్హః శోకేన భర్త్రాద్యవమానజేన దుఃఖేనాభిభవస్తిరస్కారో యస్యాః సా తథోక్తా దృశ్యత ఇతి శేషః. అసంభావితశ్చాయమర్థ ఇత్యాహ - పితుర్గృహే విమాననాఽవమానః. కుతః న సమ్భావ్యత ఏవేత్యర్థః. 'సుభ్రూః కుతస్తాతగృహేఽవమాననమ్' ఇతి పాఠాన్తరకరణం తు సాహసమేవోక్తోపపత్తిసంభవాత్ - అన్యత్రాపి 'సుభ్రు త్వం కుపితే త్యపాస్తమశనం త్యక్తా కథా యోషితామ్.' ఇత్యాదిప్రయోగదర్శనాద్వంశస్థవృత్తే పాదాదౌ జగణభఙ్గప్రసఙ్గాచ్చేత్యలం గోష్ఠీభిః. న చాన్యస్మాద్భావీత్యాహ - పరాభిమర్శః పరధర్షణం తు తవ నాస్తి. పన్నగరత్నసూచయే ఫణిశిరోమణిశలాకాం గ్రహీతుమిత్యర్థః. 'క్రియార్థోపపదస్య చ కర్మణి స్థానినః' ఇతి చతుర్థీ. కరం హస్తం కః ప్రసారయేత్. 'సుభ్రు' ఇత్యత్ర భ్రూశబ్దస్యోవఙ్స్థానీయత్వాత్ 'నేయఙువఙ్స్థానావస్త్రీ' ఇతి నదీసంజ్ఞాప్రతిషేధాత్ 'అమ్బార్థనద్యోర్హ్రస్వః' ఇతి హ్రస్వత్వం నాస్తి. తేన హ్రస్వః ప్రామాదికః ఇతి కేచిత్; అన్యే తు 'అప్రాణిజాతేశ్చారజ్జ్వాదీనామ్' ఇత్యత్ర 'అలాబూః' 'కర్కన్ధూః' ఇత్యూకారాన్తాదప్యూఙ్ప్రత్యయముదాజహార భాష్యకారః. ఏతస్మాదేవ జ్ఞాపకాత్ క్వచిదూకారాన్తస్యాప్యూఙన్తత్వాన్నదీత్వే హ్రస్వత్వమిత్యాహుః. అత ఏవాహ వామనః. 'ఊకారాదప్యూఙ్ ప్రకృతేః' ఇతి.

కిమిత్యపాస్యాభరణాని యౌవనే
ధృతం త్వయా వార్ధకశోభి వల్కలమ్,
వద ప్రదోషే స్ఫుటచన్ద్రతారకా
విభావరీ యద్యరుణాయ కల్పతే. 44

టీ. హేగౌరి=ఓ పార్వతీదేవి! కిమితి = ఏకారణముచే, యౌవనే=వయసునందు, త్వయా=నీచే, ఆభరణాని = నగలను, అపాస్య=విడిచి, వార్ధకశోభి = ముదిమిలో ప్రకాశించు, వల్కలం=నారచీర, ధృతం=ధరింపఁబడినది, ప్రదోషే=సాయంకాలమునందు, స్ఫుటచంద్రతారకా=ప్రకటమయినచంద్రుఁడు నక్షత్రములుగల, విభావరీ=రాత్రి, అరుణాయ=అనూరునికొఱకు, యది కల్పతే=కల్పింపఁబడునా, వద=చెప్పుమా.

తా. ఓగౌరి ఎందుకీవయస్సులో నగలుతీసి ముసలివాండ్రకర్హమగు నారచీరను ధరించితివి. చంద్రనక్షత్రములతో శోభిలు సంధ్యాసమయ మనూరునితోకూడుట కర్హముకాదుగదా?

వ్యా. కిమితి.—హే గౌరి కిమితి కేన హేతునా, యౌవనే త్వయా ఆభరణాన్యపాస్య విహాయ వృద్ధస్య భావో వార్ధకం మనోజ్ఞాదిత్వాద్వుఞ్ప్రత్యయః. ని. 'వార్ధకం వృద్ధసంఘాతే వృద్ధత్వే వృద్ధకర్మణి' ఇతి విశ్వః. తత్ర శోభత ఇతి వార్ధకశోభి వల్కలం ధృతం. ప్రదోషే రజనీముఖే స్ఫుటాః ప్రకటాశ్చన్ద్రస్తారకాశ్చ యస్యాః సా స్ఫుటచన్ద్రతారకా విభావరీ రాత్రిరరుణాయ సూర్యసూతాయ కల్పతే యద్యరుణం గన్తుం కల్పతే కిం. వద బ్రూహి. 'క్రియార్థోపపదస్య'ఇత్యాదినా చతుర్థీ. దీప్యమానశశాఙ్కతారకే ప్రదోషే యద్యరుణ ఉదేతి తతో విభూషణాపరిహారేణ తవ వల్కలధారణం సంఘటత ఇతిభావః.

దివం యది ప్రార్థయసే వృథా శ్రమః
పితుః ప్రదేశాస్తవ దేవభూమయః,
అథోపయన్తారమలం సమాధినా
న రత్నమన్విష్యతి మృగ్యతే హి తత్. 45

అవ. తపస్సు నిరాకరించుటకుఁ జెప్పుచున్నాఁడు.—

టీ. దివం=స్వర్గమును, ప్రార్థయసే యది = కోరెదవా? శ్రమః = తపఃక్లేశము, వృథా=వ్యర్థము, (ఏలనన?) తవ=నీయొక్క, పితుః = తండ్రియగు హిమవంతునియొక్క, ప్రదేశాః=స్థలములు, దేవభూమయః=దేవతాభూములు, అథవా=అట్లుగాక

ఉపయన్తారం=వరుని, ప్రార్థయసేయది = కోరెదవా? సమాధినా = తపస్సుచే, అలం = చాలును, (నిలుపుమనుట) రత్నం=మణి, (గ్రహీతారం=గ్రహించువానిని) నాన్విష్యతి= వెదకదు, తత్ = ఆమణి, (కావలసినవారిచే ననుట) మృగ్యతే హి=వెదకఁబడుచున్నది గదా?

తా. నీవు తపస్సును స్వర్గవాంఛచే చేయనక్కఱలేదు. దేవతానివాసములు నీ తండ్రియగు హిమవంతుని ప్రదేశములు. వరుని గూర్చి తపం బొనర్చెదవా అదియు నసంభవమె. మాణిక్యము నన్నెవరు ధరింతురని పోయి యడుగదు. మఱేమన ధరించువారిచే మణి యెక్కడ నున్నదని వెదకఁబడును గాన దానికై యైనను తపంబు చాలించుము.

అవ. తపఃప్రయోజనం నిరాకర్తుమాహ.—

వ్యా. దివమితి.—దివం స్వర్గం, ప్రార్థయసే కామయసే, యది తర్హి, శ్రమస్తపశ్చరణప్రయాసో వృథా నిష్ఫలః. యది స్వర్గార్థం తప్యసే తతః శ్రమం మాకార్షీః, కుతః - తవ, పితుర్హిమవతః ప్రదేశా దేవభూమయః స్వర్గపదార్థాః తత్రత్యా ఇత్యర్థః. అథోపయన్తారం వరం ప్రార్థయసే తర్హి సమాధినా తపసా - అలం - తపో న కర్తవ్యమిత్యర్థః. నిషేధ్యస్య నిషేధం ప్రతి కరణత్వాత్తృతీయా. తథాహి రత్నం కర్తృ నాన్విష్యతి న మృగయతే - గ్రహీతారమితి శేషః. కిం తు తద్రత్నం మృగ్యతే గ్రహీతృభిరితి శేషః. న హి వరార్థం త్వయా తపసి వర్తితవ్యం కిం తు తేనైవ త్వదర్థమితి భావః.

నివేదితం నిశ్వసితేన సోష్మణా మనస్తు మే సంశయమేవ గాహతే,
న దృశ్యతే ప్రార్థయితవ్య ఏవ తే భవిష్యతి ప్రార్థితదుర్లభః కథమ్.

అవ. వరుని చెప్పు మాట వినిన పిమ్మటనే దేవియొక్క నిట్టూర్పును కనిపెట్టి ప్రశ్నలయందు జబాబీయమికి తానే శంకించి చెప్పుచున్నాఁడు.—

టీ. సోష్మణా=వేఁడిగల, నిశ్వసితేన = నిట్టూర్పుచే, నివేదితం=తెలియచేయఁబడెను, (అయినను) మనస్తు=మనసైతే, మే=నాకు, సంశయమేవ = సందేహమునే, గాహతే=ప్రవేశించుచున్నది, (ఎందుకనఁగా?) తే=నీకు, ప్రార్థయితవ్య ఏవ=కోరఁదగినవాఁడే, న దృశ్యతే=కనఁబడఁడు, ప్రార్థితదుర్లభః=కోరఁబడియుం బొందశక్యము కానివాఁడు, కథం భవిష్యతి=ఎట్లు కాఁగలఁడు. (కాలేదనుట.)

తా. వరుని ప్రసంగములో నీవు విడిచిన వేఁడినిట్టూర్పు నీతపస్సు వరునికొఱకని తెలియుచున్నను నామనస్సులో సందేహమున్నది. నీ

వంటిదానవు కోరఁదగినవాఁడే లేఁడు. నీవు కోరినను పొందనివాఁడున్నాఁడా?

అవ. వరవాచకాక్షరశ్రవణానన్తరమేవ దేవ్యా ఉష్ణోచ్ఛ్వాసమాలక్ష్య ప్రశ్నేషు చ ప్రత్యుత్తరమనుపలభ్య స్వయమేవాశఙ్క్యాహ.—

వ్యా. నివేదితమితి.—సోష్మణా, నిశ్వసితేన నిశ్వాసవాయునా, నివేదితంచిన్తానుభావేనోష్ణోచ్ఛ్వాసేన తే వరార్థిత్వం సూచితమిత్యర్థః. తర్హి కిం ప్రశ్నవ్యసనేనేత్యాహ - మనస్తు తథాఽపి మే సంశయమేవ గాహతే ప్రాప్నోతి. కుతః తే తవ 'కృత్యానాం కర్తరి వా' ఇతి షష్ఠీ. ప్రార్థయితవ్యః ప్రార్థయితుమర్హో వివ న దృశ్యతే. ప్రార్థితదుర్లభః ప్రార్థితో యో దుర్లభః స కథం భవిష్యతి - నాస్త్యేవేత్యర్థః.

అహో స్థిరః కోఽపి తవేప్సితో యువా
చిరాయ కర్ణోత్పలశూన్యతాం గతే,
ఉపేక్షతే యః శ్లథలమ్బినీర్జటాః
కపోలదేశే కలమాగ్రపిఙ్గలాః. 47

అవ. పతిప్రార్థనార్థమె తపంబని సిద్ధాంతముజేసి చెప్పుచున్నాఁడు.—

టీ. అహో=చిత్రము, తవ ఈప్సితః=నీకు (నీచే) కోరఁబడినట్టి, కోపి యువా=ఒకానొక యౌవనవంతుఁడు, స్థిరః=కఠినుఁడు, (అయి యుంటున్నాఁడు) (ఎందువలన ననఁగా?) యః=ఎవఁడు, చిరాయ=చిరకాలమునుండి, కర్ణోత్పలశూన్యతాం = చెవియందుంచుకొనఁ దగువిలాసమగు నల్లగల్వతో శూన్యమగుటను, గతే = పొందిన, కపోలదేశే=చెక్కిలియందు, శ్లథలంబినీః = విరియఁబడి వ్రేలాడుచున్నట్టియు, కలమాగ్రపింగలాః=వరిమొలకలం బోలి పసుపురంగు గల, జటాః=జడలను, ఉపేక్షతే = ఉపేక్ష చేసినాఁడో.

తా. అహో యేమి వింత! నీవు కోరినపురుషుఁడు వజ్రమువలె గట్టి హృదయము గలవాఁడు. ఎందుకనియెదవా? విలాసోత్పలము కర్ణమందు లేకయున్న చెక్కిళ్లయందు చింపిరిగా చేయఁబడి సంస్కారము లేక సస్యముల యగ్రములవలె పచ్చబారిన తలవెండ్రుకలు వ్రేలాడుచు జడలు గట్టఁగాఁ జూచి కనికరించలేదో ఆకతంబున

అవ. అథ పతిప్రార్థనామేవ సిద్ధవత్కృత్యాహ.—

వ్యా. అహో ఇతి.— అహో చిత్రం తవేప్సిత అప్తుమిష్టో యువా కోఽపి స్థిరః కఠినః-వర్తత ఇతి శేషః. కుతః - యో యువా చిరాయ చిరాత్ ప్రభృతి కర్ణో

త్ఫలశరాన్యతాం గతే ప్రాప్తే కపోలదేశే గణ్డస్థలే శ్లథాః శిథిలబన్ధనా - అత ఏవ లమ్బిన్యస్తాః శ్లథలమ్బినీః కలమాః శాలివిశేషా స్తేషామగ్రాణి - తద్వత్పిఙ్గలాజటా, ఉ పే క్షతే, యస్త్వామీదృశీం దృష్ట్వా న వ్యథతే స నూనం వజ్రహృదయ ఇత్యర్థః.

మునివ్రతై స్త్వామతిమాత్రకర్శితాం
దివాకరాప్లుష్టవిభూషణాస్పదామ్,
శశాఙ్కలేఖామివ పశ్యతో దివా
సచేతసః కస్య మనో న దూయతే. 48

టీ. మునివ్రతైః=చాంద్రాయణాదులచేత, అతిమాత్రకర్శితాం=మిక్కిలి యెండి నట్టియు, దివాకరాప్లుష్టవిభూషణాస్పదాం=సూర్యునిచే కమలింపంబడిన యాభరణస్థానములు గలదానవు గనుకనే, దివా=పగటియందు, శశాంకలేఖామివ=చంద్రరేఖనువలె, పశ్యతః=చూచుచున్న, సచేతసః=చైతన్యముగల, కస్య=ఎవనియొక్క, మనః=మనస్సు, న దూయతే=వ్యాకులము కాదు ?

తా. సూర్యకిరణములచే నగలుంచుకొను తావులు కళలు తప్పియుండఁగా చాంద్రాయణాదివ్రతములచే నెండిన నీశరీరము పగటియందు కళతగ్గిన చంద్రరేఖమాడ్కి నున్న నిన్ను చూచిన చైతన్యముగల యేమనుజుని మనము వ్యాకులము కాదు (అగు ననుట.)

వ్యా. మునివ్రతైరితి.—మునివ్రతైశ్చాన్ద్రాయణాదిభిరతిమాత్రమత్యన్తం కర్శితాం కృశీకృతాం దివాకరేణ - సూర్యేణ 'అప్లుష్టాని దగ్ధాని - వాతాతపసంస్పర్శాత్ మృదుత్వాచ్చ శ్యామీకృతాని - విభూషణాస్పదాని భూషణస్థానాని - యస్యాస్తాం తథోక్తామ్ అతఏవ దివా అహని శశాఙ్కరేఖామివ స్థితాం త్వాం పశ్యతః సచేతసో జీవతః కస్య పుంసో మనో న దూయతే న పరితప్యతే. అపి తు సర్వస్యైవేత్యర్థః.

అవైమి సౌభాగ్యమదేన వఞ్చితం
తవ ప్రియం యశ్చతురావలోకినః,
కరోతి లక్ష్యం చిరమస్య చక్షుషో
న వక్త్రమాత్మీయమరాలపక్ష్మణః. 49

టీ. తవ=నీయొక్క, వల్లభం=ఇష్టుని, సౌభాగ్యమదేన = సౌందర్యగర్వముచే, వంచితం=మోసపడిన వానినిగాను, అవైమి = తెలుసుకొనుచున్నాను. యః=ఎవఁడు, చతురావలోకినః = అందమైన చూపుగలయట్టియు, అరాలపక్ష్మణః = వంకరయైన

తెప్పలుగల, అస్య చక్షుషః = ఈనీనేత్రమునకు, ఆత్మీయం వక్త్రం=తన మొగమును, చిరం=చిరకాలము, లక్ష్యం=గురిగా, న కరోతి=చేయఁడో.

తా. అందమైన చూపులుగల వంకరయైన కనుతెప్పలుగల నీవిలాసమగు నేత్రమునకు చిరకాలము కనపడకయున్న నీప్రియుఁ డెవఁడైతే గలడో వాఁడు తనసౌందర్యగర్వముచే రాఁబోవు సంపదను పోఁగొట్టుకొనుచున్నాఁడని తలఁచెదను.

వ్యా. అవైమీతి.—తవ ప్రియం వల్లభం సౌభాగ్యమదేన సౌన్దర్యగర్వేణ కర్త్రా వఞ్చితం విప్రలబ్ధమవైమి వేద్మి యః ప్రియశ్చతురం మధురం.అవలోకత ఇతి - చతురావలోకినో అరాలపక్ష్మణః కుటిలరోమ్ణః. ని. 'అరాలం వృజినంజిహ్మమ్' ఇత్య మరః. అస్య త్వదీయస్య చక్షుష ఆత్మీయం వక్త్రం ముఖం చిరం లక్ష్యం విషయం న కరోతి-దృష్టిపథం న గచ్ఛతీత్యర్థః. తదయం గర్వేణ హతోనిష్ఫలాత్మలాభో జాత ఇతి భావః.

కియచ్చిరం శ్రామ్యసి గౌరి విద్యతే
మమాపి పూర్వాశ్రమసంచితం తపః,
తదర్ధభాగేన లభస్వ కాఙ్క్షితం
వరం తమిచ్ఛామి చ సాధు వేదితుమ్. 50

టీ. గౌరి=పార్వతీ, కియచ్చిరం=ఎంతపెద్దకాలము, శ్రామ్యసి = కష్టపడెదవు? మమాపి=నాకును, పూర్వాశ్రమసంచితం=బ్రహ్మచర్యాశ్రమమున సంపాదించిన, తపః= తపస్సు, విద్యతే=ఉన్నది. తదర్ధభాగేన=అందు సగము భాగముతో, కాంక్షితంవరం = కోరఁబడినప్రియుని, లభస్వ = పొందుము. తం=అతనిని, సాధు వేదితుంచ = లెస్సగాఁ దెలిసికొనుటకును, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. ఓపార్వతీ! ఎంతకని తపస్సుచే కష్టము నందెదవు. బ్రహ్మ చర్యాశ్రమమున నేను సంపాదించిన తపస్సులో సంగోరు వంతు తీసి కొనుటకును ఆ నీవరుని తెలుపుటకును గోరుచున్నాను.

వ్యా. కియదితి.—హేగౌరి కియత్కిం ప్రమాణకమ్ - కిమవధికమిత్యర్థః. చిరం శ్రామ్యసి తపస్యసి-అత్యన్తసంయోగే ద్వితీయా మమాపి పూర్వాశ్రమః ప్రథమా శ్రమో బ్రహ్మచర్యాశ్రమ-స్తత్ర-సంచితం సంపాదితం, తపో విద్యతే, అర్ధశ్చాసౌ భాగశ్చ తేన-తస్య తపసోఽర్ధభాగేనైకదేశేన కాఙ్క్షితమిష్టం వరముపయన్తారం లభస్వ; తంవరం సాధు సమ్యగ్వేదితుం జ్ఞాతుం ఇచ్ఛామి. యద్యసౌ యోగ్యో భవతి తదా మమాపి సమ్మతిరితిభావః.

ఇతి ప్రవిశ్యాభిహితా ద్విజన్మనా
మనోగతం సా న శశాక శంసితుమ్,
అథో వయస్యాం పరిపార్శ్వవర్తినీం
వివర్తితానఞ్జననేత్రమైక్షత 51

టీ. ఇతి=ఇట్లు, ద్విజన్మనా=బ్రాహ్మణునిచే, ప్రవిశ్య = ప్రవేశించి, అభిహితా=అడుగఁబడినదై, సా=ఆమె, మనోగతం=మనములో నున్న (వరుని), శంసితుం = చెప్పుటకు, న శశాక=సమర్థురాలు కాలేకపోయెను. (లజ్జచే ననుట.) అథో=పిమ్మట, పరిపార్శ్వవర్తినీం=ప్రక్కనున్న, వయస్యాం=చెలిని, వివర్తితానంజననేత్రం=త్రిప్పఁబడిన కాటుకలేనికండ్లుగల్గునట్లుగా, ఐక్షత=చూచెను.

తా. ఆబ్రాహ్మణునిచే నిట్లడుగఁబడి లజ్జచే చెప్పలేక ప్రక్కనున్న చెలిని తపోనియమముచే కాటుకలేని కనులు త్రిప్పుటలతో (కనుసంజ్ఞలతో)చూచెను. (తనవరు నాయనకుఁ దెల్ప మనెను)

వ్యా. ఇతీతి.—ఇతీత్థం, ద్విజన్మనా ద్విజేన, ప్రవిశ్యాన్తర్గత్వా - అన్తవద్రహస్యముద్భావ్యేత్యర్థః. అభిహితోక్తా, సా పార్వతీ, మనోగతం హృదిస్థం, వరం శంసితుం వక్తుం న శశాక సమర్థా నాభూత్ లజ్జయేతి శేషః. అథోఽనన్తరం, పరిపార్శ్వవర్తినీం. వయస్యాం సఖీం, వివర్తితం, విచాలితమనఞ్జనం వ్రతవశాద్వర్జితకజ్జలం-నేత్రం యస్మిన్ కర్మణి తత్తథైక్షత-నేత్రసంజ్ఞయైవ ప్రత్యుత్తరం వాచయాంచకారేత్యర్థః.

సఖీ తదీయా తమువాచ వర్ణినం
నిబోధ సాధో తవ చేత్ కుతూహలమ్,
యదర్థమంభోజమివోష్ణవారణం
కృతం తపస్సాధనమేతయా వపుః. 52

టీ. తదీయా=ఆ పార్వతీదేవి సంబంధముగల, సఖీ=సఖురాలు, తం వర్ణినం=ఆ బ్రహ్మచారినిఁగూర్చి, ఉవాచ = పలికెను. సాధో=ఓ విద్వాంసుఁడా! తవ=నీకు (శ్రోతుం=వినుటకు), కుతూహలం=వేడ్క, (అస్తి) చేత్=(ఉన్న) యెడల, యదర్థం=ఎందుకొఱకు, ఏతయా=ఈమెచే, అంభోజం=కమలము, ఉష్ణవారణమివ=గొడుగువలె, వపుః=శరీరము, తపస్సాధనం = తపస్సునకు సాధనముగా, కృతం = చేయఁబడెనో, నిబోధ=తెలిసికొనుము.

తా. ఆపార్వతీదేవి చెలికత్తె యిట్లనెను, విద్వాంసుఁడా! నీకు విన నిచ్ఛ యున్నయెడల యెండకు కమలమును గొడుగును చేసినట్లు

వలె తపస్సాధనమునకు శరీరమీామె యేల నుపయోగించెనో చెప్పెదను వినుము.

వ్యా. సఖీతి.—తస్యాః పార్వత్యాః - ఇయం తదీయా, సఖీ వయస్యా. తం- 'వర్ణః ప్రశస్తః' ఇతి క్షీరస్వామీ. సోఽస్యాస్తీతి వర్ణినం బ్రహ్మచారిణం 'వర్ణాద్బ్రహ్మచారిణి' ఇతీనిప్రత్యయః. ఉవాచ బ్రూతే స్మ. కి మితి-హేసాధో విద్వన్, తవకుతూహలం చేత్-శ్రోతుమస్తీతి శేషః. తర్హి నిబోధావగచ్ఛ - ఆకర్ణయేత్యర్థః. 'బుధ అవగమనే' ఇతి ధాతో ర్శ్యావాదికాల్లోట్. శ్రోతవ్యం కిం తదాహ - యస్మైలాభాయేదం యదర్థమ్ 'అర్థేన సహ నిత్యసమాసః సర్వలిఙ్గతా చేతి వక్తవ్యమ్' ఇతి వార్తికనియమాత్క్రియావిశేషణమ్. ఏతయా పార్వత్యా, ఉమ్భోజం పద్మ,ముష్ణవారణమాతపత్రమివ, వపుః శరీరం, తపఃసాధనం కృతం - తపఃప్రవృత్తికారణ ముచ్యతే శ్రూయతామిత్యర్థః.

ఇయం మహేన్ద్రప్రభృతీనధిశ్రియ
శ్చతుర్దిగీశానవమత్య మానినీ,
అరూపహార్యం మదనస్య నిగ్రహాత్
పినాకపాణిం పతిమాప్తుమిచ్ఛతి. 53

టీ. మానినీ = శచ్యాదులమించి యుండవలెనని యహంకారముగల, ఇయం= ఈ పార్వతీదేవి అధిశ్రియః=అధికైశ్వర్యముగల, మహేంద్రప్రభృతీన్=ఇంద్రుఁడు మున్నగు, చతుర్దిగీశాన్ = ఇంద్రయమవరుణకుబేరులను, అవమత్య = తిరస్కరించి, మదనస్య, నిగ్రహాత్ = మారుని యడఁచినందువలన. (కాముఁకుడు కాకుండుటవలన) అరూపహార్యం=రూపముచే వంచింపశక్యముకాని వాఁడును, పినాకపాణిం = పినాకము హస్తమందుఁగలవాఁడును నగు శివుని, పతిం=పెనిమిటిని గాను, ఆప్తుం = పొందుటకు, ఇచ్ఛతి=కోరుచున్నది.

తా. ఐశ్వర్యవంతులగు శచ్యాదులను జయింపఁదలఁచి ఇంద్రాదులను ధిక్కరించి రూపముచే జయింప శక్యుఁడు కానట్టియు మారుని జయించిన పినాకపాణిని పతినిగాఁ గోరుచు తపస్సుఁ జేయుచున్నది.

అవ. 'దృఙ్మనఃసఙ్గసంకల్పా జాగరః కృశతాఽరతిః, హ్రీత్యాగోన్మాదమూర్ఛాన్తా ఇత్యనఙ్గదశా దశ.' ఇతి తత్రాస్యాః కాశ్చిద్దశాః క్రమమనాదృత్యైవ యోజయతి 'ఇయ'మిత్యాదిభిః షడ్భిః శ్లోకైః.—

వ్యా. ఇయమితి.—మానినీ ఇన్ద్రాణీప్రభృతీరతిశయ్య వర్తితవ్యమిత్యభిమానవతీ, ఇయం పార్వత్యధిశ్రియోఽధికైశ్వర్యాన్, మహేన్ద్రప్రభృతీనిన్ద్రాదీం, శ్చతసృణాం దిశామీశానిన్ద్రవరుణయమకుబేరాన్ 'తద్ధితార్థ -' ఇత్యాదినోత్తర

పదసమాసః. అవమత్యావధూయ మదనస్య నిగ్రహాన్నిబర్హణాద్ధేతోః అకాముకత్వా దిత్యర్థః. రూపేణ సౌందర్యేణ హార్యో వశీకరణయో న భవతీతి తమరూపహార్యం పినాకః పాణౌ యస్య తం పినాకపాణిం హారం 'ప్రహరణార్థేభ్యః పరే నిష్ఠాసప్తమ్యౌ భవతః' ఇతి సాధు. పతిం భర్తారమాప్తుమిచ్ఛతి ఏతేన సంకల్పావస్థా సూచితా.

అసహ్యహుంకారనివర్తితః పురా
పురారిమప్రాప్తముఖశ్శిలీముఖః,
ఇమాం హృది వ్యాయతపాతమక్షిణో
ద్విశీర్ణమూర్తేరపి పుష్పధన్వనః. 54

టీ. పురా=తొల్లి, అసహ్యహుంకారనివర్తితః = సహింపశక్యముకాని హుంకారముచే మల్లింపఁబడినట్టియుం, పురారిం=ఈశ్వరుని, అప్రాప్తముఖః = పొందఁబడని యగ్రభాగముగల, విశీర్ణమూర్తేః అపి = నశించిన రూపుగలవాఁడైనప్పటికిని, పుష్పధన్వనః=మన్మథునియొక్క, శిలీముఖః = బాణము, ఇమాం=ఈమెను, హృది=హృదయమందున, వ్యాయతపాతం=లోఁతైనప్రవేశముకల్గునట్లు, అక్షిణోత్=బాధించెను.

తా. పూర్వము మారుఁడీశ్వరునిపైఁ బ్రయోగించిన బాణము కొనసయైనను హరుని హుంకారముచే నాయన నంటక మరలినదై దగ్ధదేహముగలవాఁడైనను ప్రయోగించినబాణ మీమెయెదలో లోఁతుగా గ్రుచ్చుకొనెను. (మృదువుగానుండుట బాధగదా.)

వ్యా. అసహ్యేతి.—పురా పూర్వమసహ్యేన సోఢుమశక్యేన హుంకారేణ శాస్త్రేణ నివర్తితః అత ఏవ పురారిం హారమప్రాప్తముఖోఽప్రాప్తఫలో విశీర్ణమూర్తేర్నష్టశరీరస్యాపి పుష్పధన్వనః కామస్య శిలీముఖో బాణ ఇమాం పార్వతీం హృది వ్యాయతః సుదూరావగాఢ ఇతి యావత్. తాదృక్పాతః ప్రహారోయస్మిన్ కర్మణి తత్తథాఽక్షిణోదకర్శత్ దగ్ధదేహస్యాపి మార్గణో లగ్నః. వి. 'మృదుః సర్వత్ర బాధ్యతే' ఇతి భావః. అనేన 'వివృణ్వతీ శైలసుతాఽపి భావమ్' ఇత్యత్రోక్తం చక్షుః ప్రీతిమనఃసఙ్గాఖ్యమవస్థాద్వయమనన్తరావస్థోపయోగితయాఽనూద్య కార్శ్యావస్థా సూచితా.

తదాప్రభృత్యున్మదనా పితుర్గృహే
లలాటికాచన్దనధూసరాలకా,
న జాతు బాలా లభతే స్మ నిర్వృతిం
తుషారసంఘాతశిలాతలేష్వపి. 55

టీ. తదా ప్రభృతి = అదిమొదలు, పితుర్గృహే = తండ్రి యింటియందు, ఉన్మదనా=మిక్కిలి మోహముగలదై, లలాటికాచందనధూసరాలకా=నుదుటిబొట్టుయొక్క చందనముచే బూడిదరంగుగల ముంగురులు గలదై, బాలా=ఈచిన్నది, జాతు=ఒకప్పుడును, తుషారసంఘాతశిలాతలేష్వపి = మంచుగుంపుల నెడు శిలా ప్రదేశములయందును (అనఁగా ఘనీభవించిన మంచునందు సైతమనుట), నిర్వృతిం=సుఖమును, న లభతేస్మ= పొందకుండినది కదా?

తా. అదిమొదలీమె తండ్రియింటనుండి చుక్కబొట్టుగాఁ బెట్టుకొన్న గంధముమీఁద పొరలుచున్న వగుటచే రంగుమారిన తలవెండ్రుకలు గలదై మంచుగడ్డలయందు కూడ సౌఖ్యమునందదు (తాపము మంచునుకూడా చలిలేనిదానిగాఁ జేయుచున్న దనుట.)

వ్యా. తదేతి.—తదేతి చ్ఛేదః తదా ప్రభృతి తత ఆరభ్యేత్యర్థః. సప్తమ్యర్థ స్యాపి దా ప్రత్యయస్య పఞ్చమ్యర్థే లక్షణా ప్రభృతియోగే పఞ్చమీనియమాత్, పితుర్గృహ ఉన్మదనోత్కటమన్మథా, లలాటస్యాలంకారో లలాటికా తిలకః 'కర్ణలలాటాత్ కనలంకారే' ఇతి కన్ప్రత్యయః. తస్యాశ్చన్దనేన ధూసరా ధూసర వర్ణా అలకాశ్చూర్ణకున్తలా యస్యాః సా తథోక్తా బాలా పార్వతీ జాతు కదాచి దపి తుషారసంఘాతాస్తుషారఘనాస్త ఏవ శిలాస్తాసాం తలేషూపరిభాగేష్వపి నిర్వృతిం సుఖం న లభతే స్మ; ఏతేనారత్యపరసంజ్ఞావిషయవిద్వేషావస్థాద్వాదశావస్థాపక్షే సంజ్వరశ్చ వ్యజ్యతే.

ఉపాత్తవర్ణే చరితే పినాకినస్స బాష్పకణ్ఠస్ఖలితైః పదై రియమ్,
అనేకశః కిన్నరరాజకన్యకా వనాన్తసంగీతసఖీరరోదయత్.

టీ. పినాకినః=శివునియొక్క, చరితే=చరిత్రము, ఉపాత్తవర్ణే=స్వీకరింపఁబడిన వర్ణములుగలది కాఁగా, ఇయం=ఈమె, సబాష్పకంఠస్ఖలితైః = గద్గదమయిన గొంతునందుజాఱిన, పదైః=వాక్యములచేత, వనాంతసంగీతసఖీః = వనమధ్యమున సంగీతముచే చెలికత్తెలయిన, కిన్నరరాజకన్యకాః = కిన్నరరాజబాలికలను, అనేకశః=పలుమారులు, అరోదయత్=ఏడిపించెను.

తా. సంగీతకాలమున శివునినామము రాఁగా గద్గదస్వరముతోఁ గూడినవాక్యములచే అడవిలో సంగీతస్నేహితులగు కిన్నరస్త్రీలను పార్వతీదేవిపైఁ జాలిఁగొని విచారించిరి.

వ్యా. ఉపాత్తేతి.— పినాకినః శంభోశ్చరితే త్రిపురవిజయాదిచేష్టిత ఉపాత్తవర్ణే ప్రారబ్ధగీతక్రమే. ని. 'గీతక్రమే స్తుతౌ వేదే వర్ణశబ్దః ప్రయుజ్యతే' ఇతి

హాలాయుధః. సబాష్పే గద్గదే - కణ్ఠే స్ఖలితైర్విశీర్ణైః పదైః సుప్తిఙన్తరూపైః కరణైః వనాన్తే - సంగీతేన నిమిత్తేన - సఖీర్వయస్యాః, కిన్నరరాజకన్యకా, అనేకశో బహుశో ఽరోదయద(శ్రు)మోక్షమకారయత్ - హరచరితగానజనితమదనవేదనామేనాం వీక్ష్య కిన్నర్యోఽపి రురుదురితి భావః. అత్ర వర్ణస్ఖలనలక్షణకార్యోక్త్యా పునఃపునస్తత్కారణీభూతమూర్ఛావస్థాప్రాదుర్భావో వ్యజ్యతేఽన్యథా సఖీరోదనానుపపత్తే రితి. ద్వాదశావస్థాపక్షే తు ప్రలాపావస్థా చ వ్యజ్యతే. వి. 'ప్రలాపో గుణకీర్తనమ్' ఇత్యాలంకారికాః.

త్రిభాగశేషాసు నిశాసు చక్షణం నిమీల్య నేత్రే సహసా వ్యబుధ్యత,
క్వ నీలకణ్ఠ ప్రజసీత్యలక్ష్య వాగసత్యకణ్ఠార్పితబాహుబన్ధనా. 57

టీ. చ=ఇంతేకాదు, త్రిభాగశేషాసు = మూఁడుపాళ్లకంటె మిగిలిన, నిశాసు= రాత్రులయందు, క్షణం=క్షణమాత్రము, నేత్రే నిమీల్య=కండ్లను మూసికొని, సహసా= అప్పుడే, నీలకంఠ=ఓ యీశ్వరుఁడా! క్వ ప్రజసి = ఎక్కడికిఁ బోవుచున్నావు, ఇతి=ఇట్లు, అలక్ష్యవాక్ = నిర్విషయమగు వాక్కులు గలదై, అసత్యకంఠార్పిత బాహుబంధనా = అబద్ధమగు కంఠమునందర్పించఁబడిన భుజబంధనము గలదై, వ్యబుధ్యత= మేలుకొనినది.

తా. ఇంతే కాదు రాత్రులయందు నిద్రపట్టక నాలవజామున నెట్టకేలకు కండ్లుమూసి అప్పుడె ఓ ఈశ్వరుఁడా యెక్కడికేగెద వనుచు లేనికంఠమును గౌఁగలించుకొని మేలుకొన్నది (ఈశ్వరునియందలి చింతచే నిద్రపట్టక రాత్రి వేగి వేకువఝామున నిద్రపట్టువేళలో హరుఁడు వచ్చి పోవుచున్నట్లు స్వప్నమయి కలలోనిహరుని కవుఁగలించఁబోగా నిద్రచెడి మెలుకువగుచున్నది. (అనఁగా నిద్రలేక జాగరావస్థలో నున్నదనుట.)

వ్యా. త్రిభాగేతి.—కించేతి చార్థః శిష్యత ఇతి శేషః కర్మణి ఘఞ్-త్రిభ్యో భాగేభ్యః - శేషాస్వవశిష్టాసు - యద్వా రాత్రేస్త్రియామత్వేన ప్రసిద్ధత్వాత్తృతీయో భాగస్త్రిభాగః సంఖ్యాశబ్దస్య వృత్తివిషయే పూరణార్థత్వమిష్యతే - యథా 'శతాంశః' 'సహస్రాంశః' ఇతి. త్రిభాగః శేషో యాసాం తాసు నిశాసు క్షణం క్షణమాత్రం. నేత్రే నిమీల్య మీలయిత్వా సహసా సద్యః హే నీలకణ్ఠ క్వవ్రజసి కుత్ర గచ్ఛసీత్యలక్ష్యా నిర్విషయా - వాగ్వచనం - యస్యాః సా తథోక్తా తథాఽసత్యే మిథ్యాభూతే - కణ్ఠేఽర్పితం బాహుబన్ధనం యస్యాః సా తథా సతీ వ్యబుధ్యత విబుద్ధవతీ. ఏతేన జాగరోన్మాదౌ సూచితౌ.

యదా బుధైః సర్వగత_స్త్వముచ్యసే
న వేత్సి భావస్థమిమం కథం జనమ్,
ఇతి స్వహస్తోల్లిఖితశ్చముగ్ధయా
రహస్యుపాలభ్యత చన్ద్రశేఖరః. 58

అవ. కల పటముఁ జూచుట ప్రియుని తాఁకినవారిని తాఁకుట యనువిరహా వంతుల వినోదములలో కలఁజెప్పి ప్రతికృతిదర్శనముఁ జెప్పుచున్నాఁడు.—

టీ. యదా = ఏకారణమువలన, త్వం=నీవు, బుధైః=జ్ఞానులచే, సర్వగతః=సర్వ వ్యాపకుఁడవని, ఉచ్యసే=చెప్పంబడుచున్నావో, (తతః = ఆకారణమువలన,) భావస్థం= నీయందనురాగముగల, ఇమం జనం=ఈజనుని (తననసుట), కథం న వేత్సి = ఎట్లుగా సెఱుఁగకున్నావు? ఇతి = ఇట్లు, ముగ్ధయా = ముద్దరాలైన యాపార్వతీదేవిచే, స్వహస్తోల్లిఖితః=తనహస్తములచే వ్రాయఁబడిన, చంద్రశేఖరః = చంద్రమౌళీశ్వరుఁడు. రహసి=ఏకాంతమున, ఉపాలభ్యత = నిందింపఁబడెను.

తా. ఈముగ్ధురాలు తనచేతను వ్రాయఁబడిన ప్రతిమయైనను స్మృతిలేక పటములోనున్న శివుని ఓహరుఁడా! నీవు సర్వాంతర్యామి వేమో నీయందనురక్తనగు నన్నెట్లుగా నెఱుఁగకుంటివి? అని నిందించెను.

అవ. స్వప్నసాదృశ్యప్రతికృతిదర్శనతదంగస్పృష్టస్పర్శాఖ్యాశ్చత్వారో విరహిణాం వినోదాః-తత్ర స్వప్నసందర్శనముక్త్వా ప్రతికృతిదర్శనమాహ.—

వ్యా. యదేతి.—యదా యత ఇత్యర్థః-యదేతి హేతావిత్యుక్త్వా గణవ్యాఖ్యానే ఉస్యోదాహృతత్వాత్. త్వం బుధైర్మనీషిభిః సర్వగతః సర్వవ్యాపీత్యుచ్యసే తత ఇత్యధ్యాహారః. భావే రత్యాఖ్యే తిష్ఠతీతి భావస్థం త్వయ్యనురాగిణమిత్యర్థః. ఇమం జనం ఇమమిత్యాత్మనిర్దేశః. కథం న వేత్సి న జానాసీతి ముగ్ధయా మూఢయా-అకిఞ్చిత్కరశ్చిత్రగతోపాలమ్భ ఇత్యాజానానయేత్యర్థః. తయా స్వహస్తేనోల్లిఖితశ్చిత్రేలిఖితశ్చంద్రశేఖరో రహస్యేకాన్తే - సఖీమాత్రసమక్షమిత్యర్థః. ఉపాలభ్యత-సాధిక్షేపముక్తశ్చ. ఉక్తసముచ్చయార్థశ్చకారః. యద్యపి రహసీత్యుక్తం తథాఽపి సఖీసమక్షకరణాల్లజ్జాత్యాగో వ్యజ్యత ఏవ.

యదా చ తస్యాధిగమే జగత్పతే
రపశ్యదన్యం న విధిం విచిన్వతీ,
తదా సహాస్మాభిరనుజ్ఞయా గురో
రియం ప్రపన్నా తపసే తపోవనమ్. 59

టీ. చ=ఇంతేకాదు, జగత్పతేః=జగన్నాథుఁడగు, తస్య=ఆశివునియొక్క, అధిగమే=పొందుటవిషయమై, అన్యం విధిం=వేఱుపాయమును, విచిన్వతీ=వెదకుచున్నదై, యదా న పశ్యత్=ఎప్పుడు చూడలేదో, తదా=అప్పుడు, ఇయం=ఈమె, గురోః అనుజ్ఞయా=తండ్రియొక్క సెలవుచే అస్మాభిః సహ=మాతో కూడ, తపసే = తపమొనర్చుటకై, తపోవనం=తపోవనమును, ప్రపన్నా=ఆశ్రయించెను.

తా. ఇంతేకాదు జగత్ప్రభువగు శివునియొక్క పొందుటలో వేఱుపాయమునుఁ గానలేక అప్పుడు తండ్రియగు హిమవంతునిదగ్గర మాతో తపస్సుఁ జేయుటకు సెలవుఁదీసికొని యీతపోవన మాశ్రయించెను.

వ్యా. యదేతి.—జగత్పతేస్తస్యేశ్వరస్యాధిగమే ప్రాప్తావన్యం విధిముపాయం విచిన్వతీ మృగయమాణా యదా నాపశ్యత్తదేయం పార్వతీ గురోః పితురనుజ్ఞయాఽస్మాభిః సహ తపసే తపశ్చరితుం తపోవనం ప్రపన్నా ప్రాప్తా.

ద్రుమేషు సఖ్యా కృతజన్మసు స్వయం
ఫలం తపస్సాక్షిషు దృష్టమేష్వపి,
న చ ప్రరోహాభిముఖోఽపి దృశ్యతే
మనోరథోఽస్యాశ్శశిమౌళిసంశ్రయః. 60

టీ. సఖ్యా = (మా) సఖురాలగు పార్వతిచే, స్వయం = స్వయముగా, కృతజన్మసు=చేయఁబడిన జన్మలు గలయట్టియు, తపస్సాక్షిషు = తపస్సునకు సాక్షులయిన, ఏషు ద్రుమేషు అపి=ఈచెట్లయందు సైతము, ఫలం దృష్టం = ఫలము చూడఁబడినది. అస్యాః=ఈమెయొక్క, శశిమౌళిసంశ్రయః=ఈశ్వరనిష్ఠమైన మనోరథస్తు=కోరికైతే, ప్రరోహాభిముఖః అపి=అంకురాభిముఖమైనను, న దృశ్యతే=అగపడలేదు.

తా. మాస్నేహితురాలు స్వయముగా నాటిన గింజలు మొక్కలై చెట్లయి పుష్పించి ఫలించె గాని హరునిపైనున్న యీమె యభిలాషమన్ననో మొలకైన నెత్తలేదు. ఫలమన్న మిక్కిలి దూరముగదా?

వ్యా. ద్రుమేష్వితి.—సఖ్యా పార్వత్యా స్వయం కృతం జన్మ యేషాం తేషు స్వయం రోపితేష్విత్యర్థః. తపసః సాక్షిషు సాక్షాద్ద్రష్టృష్వేషు ద్రుమేష్వపి ఫలం దృష్టం లబ్ధం జనితమిత్యర్థః. అస్యాః పార్వత్యాః శశిమౌళిసంశ్రయశ్చన్ద్రశేఖరవిషయో మనోరథస్తు ప్రరోహాభిముఖోఽఙ్కురోన్ముఖోఽపి న దృశ్యతే. ని. 'ప్రరోహస్త్వఙ్కురోఽఙ్కురః' ఇతి వైజయన్తీ. స్వయం రోపితవృక్షఫలకాలేఽప్యస్యా మనోరథస్య నాఙ్కురోదయోఽప్యస్తి ఫలాశా తు దూరాపాస్తేత్యర్థః.

న వేద్మి స ప్రార్థితదుర్లభః కదా
సఖీభిరస్రోత్తరమీక్షితామిమామ్,
తపఃకృశామభ్యుపపత్స్యతే సఖీం
వృషేవ సీతాం తదవగ్రహక్షతామ్. 61

టీ. ప్రార్థితదుర్లభః=వేఁడుకొనఁబడినవాఁడై దొరకనట్టి, సః=ఆదేవుఁడు, తపఃకృశాం=తపస్సుచే నెండినదై, సఖీభిః=చెలికత్తెలచే, అస్రోత్తరం = కన్నీళ్లు ప్రధానమగునట్లుగా, ఈక్షితాం=చూడఁబడినట్టి, ఇమాం సఖీం=ఈమాచెలికత్తెను, తదవగ్రహక్షతాం=ఆయింద్రుని యనావృష్టిచే పీడింపఁబడిన, సీతాం = నాఁగేటిచాలును, వృషా ఇవ=ఇంద్రుఁడువలె, కదా అభ్యుపపత్స్యతే=ఎప్పు డనుగ్రహించునో, న వేద్మి=ఎఱుఁగను.

తా. తపస్సుచే నెండినదగుటచే దుఃఖముగా మాచేఁ జూడఁబడుచున్న యీ మాచెలికత్తెను అవగ్రహమను దోషముచే (వానలేమి) నెండిన నాఁగేటిచాలును సురేంద్రుఁడువలె ప్రార్థించినను దుర్లభుఁడగు నీశ్వరుఁ డెప్పు డనుగ్రహించునో.

వ్యా. న వేద్మీతి.—ప్రార్థితః సన్ దుర్లభః ప్రార్థితదుర్లభః స దేవస్తపఃకృశాం తపసా కృశాం క్షీణామత ఏవ సఖీభిరస్రోత్తరమశ్రుప్రధానం యథా భవతి తథేక్షితామిమాం నః సఖీం తస్యేన్ద్రస్యావగ్రహేణానావృష్ట్యా క్షతాం పీడితామ్. ని. 'వృష్టిర్వర్షం తద్విఘాతేఽవగ్రాహావగ్రహౌ సమౌ' ఇత్యమరః. సీతాం కృష్టభువం. ని. 'సీతా లాఙ్గలపద్ధతిః' ఇత్యమరః. వృషా వాసవ ఇవ. ని. 'వాసవో వృత్రహా వృషా'ఇత్యమరః. కదాఽభ్యుపపత్స్యతేకదాఽనుగ్రహీష్యతి. న వేద్మి. అత్ర వాక్యార్థః కర్మ. తదవగ్రహక్షతామిత్యత్రావగ్రహక్షతామిత్యనేనైవ గతార్థత్వే తత్పదస్య వైయర్థ్యాపత్తేస్తదితిభిన్నం పదం వేద్మీత్యస్య కర్మేతి యుక్తముత్పశ్యామః.

అగూఢసద్భావమితీఙ్గితజ్ఞయా
నివేదితో నైష్ఠికసున్దరస్తయా,
అయీద మేవం పరిహాస ఇత్యుమా
మపృచ్ఛదవ్యఞ్జితహర్షలక్షణః. 62

టీ. ఇంగితజ్ఞయా = పార్వతిచిత్తము నెఱిఁగిన, తయా=ఆచెలిచే, ఇతి=ఇట్లు, అగూఢసద్భావం = గోప్యముచేయని మంచి యభిప్రాయము గలుగునట్లుగా, నివేదితః=తెలుపఁబడినవాఁడై, నైష్ఠికసుందరః = బ్రతికియున్నంతకాలము బ్రహ్మచారియగు

నాసుందరుఁడు, అవ్యంజితహర్షలక్షణః = ప్రకటింపఁబడని సంతోషచిహ్న గలవాఁడై, అయి=ఓ పార్వతి, ఇదం = ఈ నీచెలి చెప్పినమాట, ఏవం = సత్యమా? పరిహాసః= హాస్యమా? ఇతి=అని, ఉమాం=పార్వతీదేవిని, అపృచ్ఛత్=అడిగెను.

తా. పార్వతీహృదయజ్ఞురాలగు చెలిమాటలు విని ఆజీవము బ్రహ్మచారియగు నాయన తనమనంబునఁ గల సంతోషమును బ్రకటించక యేమి పార్వతీ యీ నీచెలి పలికినది నిజమా పరిహాస్యమా? అని దేవినడిగెను.

వ్యా. అగూఢేతి.—ఇఙ్గితజ్ఞయా పార్వతీహృదయాభిజ్ఞయా. ని. 'ఇఙ్గితం హృద్గతో భావః' ఇతి సజ్జనః. తయా గౌరీసఖ్యా ఇత్యేవమగూఢసద్భావం ప్రకాశితసదభిప్రాయం యథా తథా, నివేదితో జ్ఞాపితో నిష్ఠా మరణమవధిర్యస్య స నైష్ఠికో యావజ్జీవబ్రహ్మచారీ-సున్దరో విలాసీ-నైష్ఠికశ్చాసౌ సున్దరశ్చేతి తథోక్తః. ద్వయోరన్యతరస్య విశేషణత్వవివక్షాయాం విశేషణసమాసః. కిం తు నైష్ఠికత్వ విశేషణేన కామిత్వవిరోధః-అథవా దేవస్యాలౌకికమహిమత్వాదుభయం తాత్త్వికమితి న విరోధః. అవ్యఞ్జితం-హర్షలక్షణం ముఖరాగాది హర్షలిఙ్గం - యస్య తథాభూతః సన్ అయి గౌరి-అయీతి కోమలామన్త్రణే ఇదం త్వత్సఖీభాషితమేవం సత్యం కిమిత్యర్థః. పరిహాసః కేలిర్వా. ని. ద్రవకేలి పరీహాసాః' ఇత్యమరః. ఇత్యేవముమామపృచ్ఛత్ పృష్టవాన్ .

అథాగ్రహస్తే ముకుళీకృతాఙ్గులౌ
సమర్పయన్తీ స్ఫటికాక్షమాలికామ్,
కథఞ్చిదద్రేస్తనయా మితాక్షరం
చిరవ్యవస్థాపితవాగభాషత. 63

టీ. అథ=పిదప, అద్రేః తనయా=పార్వతీదేవి, ముకుళీకృతాంగుళౌ = మొగ్గయొక్కయాకారముగాఁ జేయఁబడిన వ్రేళ్లుగల, అగ్రహస్తే = ముంజేతియందు, స్ఫటికాక్షమాలికాం = స్ఫటికమణుల తావళమును, సమర్పయంతీ = ఉంచుకొనుచు, కథంచిత్ = అతికష్టముతో, చిరవ్యవస్థాపితవాక్ = చాలసేపటికి స్వీకరింపఁబడిన మాటగలదియై, మితాక్షరం=పరిమితమగు వర్ణములు గలుగునట్లు, అభాషత=పల్కెను.

తా. పిమ్మట పార్వతీదేవి వ్రేళ్లు ముణిఁచి ముంజేత స్ఫటికతావళమును పెట్టుకొని సిగ్గుచే కొంతసేపటికి కొంచెము వర్ణములు గల్గునట్లుగా జబాబు నిచ్చెను.

వ్యా. అథేతి.—అథానన్తరముద్రే ప్తసయా పార్వతీ ముకుళీకృతాఞ్జలిః సంపుటీకృతాఞ్జలిః అగ్రశ్చాసౌ హస్తశ్చేతి సమానాధికరణసమాసః - 'హస్తాగ్రాగ్రహస్తయోర్గుణగుణినోర్భేదాభేదాది' తి వామనః - తస్మిన్నగ్రహస్తే స్ఫటికానామక్షమాలికాం జపమాలికామర్పయన్త్యాముఞ్చతీ కథంచిన్మహతాకష్టేన చిరవ్యవస్థాపితవాక్ చిరేణ స్వీకృతవాక్-ఏతేన లజ్జోపరోధో వ్యజ్యతే. మితాక్షరం పరిమితవర్ణం యథా తథా అభాషత బభాషే.

యథా శ్రుతం వేదవిదాం వర త్వయా
జనోఽయముచ్చైఃపదలఙ్ఘనోత్సుకః,
తపః కిలేదం తదవాప్తిసాధనం
మనోరథానామగతిర్న విద్యతే. 64

అవ. ఏమి పల్కెనని గాఁ జెప్పుచున్నాఁడు.—

టీ. వేదవిదాం వర=వేదవేత్తలలో శ్రేష్ఠుఁడా! త్వయా=నీచే, యథాశ్రుతం=సత్యమేవినఁబడినది, అయం జనః = ఈజనము (నేను), ఉచ్చైఃపదలంఘనోత్సుకః=గొప్పస్థానము నాక్రమించుటకుఁ గోరియున్నది (గోరియున్నాను), ఇదం తపః=ఈతపస్సు, తదవాప్తిసాధనం కిల=ఆ గొప్పపదవిని పొందుటకు సాధనమట (కాదనుట), మనోరథానాం=కోర్కెలకు, అగతిః=అవిషయము, న విద్యతే=లేదు.

తా. ఓ వేదశాస్త్రప్రవీణుఁడా! నాచెలివలన నీవు విన్నదంతయు నిజమే, కాని అసాధ్యమగు కోరికకీతుచ్ఛతపం బొనర్చుచుంటిని (అట్టియున్నతపదవి కీతపస్సు చాలదనుట). అసాధ్యవిషయమును మానుదునా యనిన కోరిక లెంతటివస్తువుమీఁదనైనను బ్రసరించును. శక్తి నాలోచింపవు (ఇదిసాధనమా యట్టిపదవికి కాదు కాని దురాశ బాధించుచున్నది).

అవ. కిమువాచేత్యాహ.—

వ్యా యథేతి.—హే వేదవిదాం వర వైదికశ్రేష్ఠ త్వయా యథా శ్రుతం సమ్యక్ శ్రుతం శ్రుతార్థమేవాహ - అయం జనః స్వయమిత్యర్థః. ఉచ్చైః పదస్య శివలాభరూపోన్నతస్థానస్య - లఙ్ఘన ఆక్రమణ - ఉత్సుకః కిమత్రాయుక్తమిత్యత్రాహ- ఇదం తపస్తదవాప్తేస్తస్యోచ్చైఃపదస్యావాప్తేః ప్రాప్తేః - సాధనం కిల - కిలేత్యలీకే - అతితుచ్ఛత్వాదసాధకమేవేత్యర్థః. తర్హి త్యజ్యతామిత్యాశఙ్క్య దురాశా మాం న ముఞ్చతీత్యాశయేనాహ - మనోరథానాం కామానామగతిరవిషయో న విద్యతే - న హి సతః కిపర్యాలోచనయా కామా ప్రవర్తన్త ఇతి భావః.

అథాహ వర్ణీ విదితో మహేశ్వర
స్తదర్థినీ త్వం పునరేవ వర్తసే,
అమఙ్గలాభ్యాసరతిం విచిన్త్య తం
తవానువృత్తిం న చ కర్తుముత్సహే. 65

టీ. అథ=పిమ్మట, వర్ణీ=బ్రహ్మచారి, ఆహ = పలికెను. మహేశ్వరః = ఈశ్వరుఁడు, విదితః=నాచే తెలియఁబడుచున్నాఁడు. పునరేవ = తిరిగియు, త్వం=నీవు, తదర్థినీ = ఆయనను గోరుచు, వర్తసే = ఉంటున్నావు. అమంగళాభ్యాసరతిం=అశుభాచారమందు ప్రీతిగలవాఁడైన, తం=ఆశివుని, విచిన్త్య=తలఁచి, తవ=నీయొక్క, అనువృత్తిం=నీ యనుసరించుటను, కర్తుం=చేయుటకు, న ఉత్సహే = పూనుకొనను.

తా. తర్వాత బ్రహ్మచారిట్లనియె. హరు నేనెఱుఁగుదును. ఆయన నిన్నట్లవమానము చేసినను నీవు మఱియాయననే కోరుచున్నదానవు. ఆయన శ్మశానవాసాదికముఁ దలఁచి నీవాయననుఁ గోరుటకు నే నంగీకరించకున్నాను.

వ్యా. అథేతి.—అథ, వర్ణీ బ్రహ్మచారీ. ని. 'వర్ణినో బ్రహ్మచారిణః' ఇత్యమరః. ఆహ - ఉవాచేత్యర్థః. 'ఆహేతి భూతార్థే లట్ ప్రయోగో భ్రాన్తిమూలః' ఇత్యాహ వామనః. కిమిత్యాహ-మహేశ్వరో మహాదేవో, విదితః మయా జ్ఞాయత ఇత్యర్థః. బుద్ధ్యర్థత్వాద్వర్తమానే క్తప్రత్యయః - తద్యోగాత్ షష్ఠీ చ-యేన త్వం ప్రాగ్ భగ్నమనోరథా కృతేతి భావః. పునరేవ త్వం తమీశ్వరమర్థయసే తదర్థిన్యేవ తత్కామైవ ప్రవర్తసే - తత్ప్రాభావమనుభూయాపీతి భావః. అనుసరణే కో దోషస్తత్రాహ-అమఙ్గలాభ్యాసేఽమఙ్గలాచారే - రతిర్యస్య తథోక్తం తం ఈశ్వరం విచిన్త్య విచార్య తవానువృత్తిమనుసరణం - కర్తుం నోత్సహే - నానుమన్తుం శక్నోమీత్యర్థః.

అవస్తునిర్బన్ధపరే కథం ను తే
కరోఽయమాముక్తవివాహకౌతుకః,
కరేణ శమ్భోర్వలయీకృతాహినా
సహిష్యతే తత్ప్రథమావలమ్బనమ్. 66

టీ. అవస్తునిర్బంధపరే=తుచ్ఛవస్తువిషయములో పట్టుదల యందాసక్తురాలా! ఆముక్తవివాహకౌతుకః = ధరింపఁబడిన పెండ్లికంకణముగల, తే అయంకరః = ఈ నీయొక్క చేయి, వలయీకృతాహినా = కంకణముగాఁ జేయఁబడిన పాముగల,

శంభోః=హరునియొక్క, కరేణ=చేతితో, తత్ప్రథమావలంబనం=అదే మొదటి పట్టు కొనుటను, కథం ను=ఎట్లు, సహిష్యతే=ఓర్చును.

తా. చెడ్డవస్తువువిషయములో పంతము ముఖ్యముగల పార్వతీ! మంగళకరమగు వివాహకంకణముగల నీచేతిని పాముకడియముగల చేతితో క్రొత్తగా పట్టుకొనుటకు(పాణిగ్రహణమునకు)పరిచయము లేదు గనుక పామును చూచి భయపడి బెదరెద వనుట) ఎట్లుగా ఓర్చెదవు?

వ్యా. అవస్త్వితి.—అవస్తుని తుచ్ఛవస్తుని-నిర్బన్ధోఽభినివేశః-పరం ప్రధానం-యస్యాస్తస్యాః సంబుద్ధిః అవస్తునిర్బన్ధపరే పార్వతి ఆముక్తమాసజ్జితం వివాహే-యత్ కౌతుకం హస్తసూత్రం - తద్యస్య స తేఽయం కరః. ని. 'కౌతుకం మఙ్గలే హర్షే హస్తసూత్రే కుతూహలే' ఇతి శాశ్వతః. వలయీకృతాహినా భూషణీకృతసర్పేణ శంభోర్మహాదేవస్య కరేణ కరణభూతేన తదేవ ప్రథమం తత్ప్రథమమ్ - అపరిచితత్వా దతిభయంకరమితి భావః-తచ్చ తదవలమ్బనం గ్రహణం చేతి - కథం ను సహిష్యతే-న కథంచిదపి సహిష్యత ఇత్యర్థః. అగ్రతో యద్భావి తద్దూరేఽవతిష్ఠతాం-ప్రథమం కరగ్రహ ఏవ దుస్సహ ఇతి భావః.

త్వమేవ తావత్పరిచిన్తయ స్వయం
కదాచిదేతే యది యోగమర్హతః,
వధూదుకూలం కలహంసలక్షణం
గజాజినం శోణితబిన్దువర్షి చ. 67

టీ. హేగౌరి=ఓగౌరీదేవి, త్వమేవ=నీవే, స్వయం = సొంతముగా, తావత్= నీకుఁ దోఁచినంతకాలము, పరిచింతయ=యోజింపుమా, కలహంసలక్షణం = కలహంసలు చిన్నెలుగాఁగల, వధూదుకూలం=పెండ్లికూఁతు పట్టుచీరయు, శోణితబిందువర్షి =నెత్తురు బొట్లు వర్షించుచున్న, గజాజినం చ=(శివునిదగు) గజాసురచర్మమును, ఏతే=ఇవి, కదాచిత్=ఎప్పుడైనను, యోగం=సంబంధమునుఁగూర్చి, అర్హతః యది=తగునా.

తా. పార్వతీ! నీవే యోజింపుము. హంసలుచెక్కిన పట్టుచీర కును రక్తముగారు తోలునకును దంపతులకొంగులకు వేయఁదగు ముడి యర్హమగునేమో?

వ్యా. త్వమేవేతి.— హే గౌరి త్వమేవ స్వయమాత్మనా తావదితి మాత్రార్థే-యావన్మాత్రం విచారణీయం తావన్మాత్రమిత్యర్థః. ఇదమేవోదాహృతం చ గణవ్యాఖ్యానే - పరిచిన్తయ పర్యాలోచయ కిమితి కలహంసలక్షణం కలహంసచిహ్నం. ని.

'చిహ్నం లక్ష్మ చ లక్షణమ్' ఇత్యమరః. వధ్వా నవోఢాయా దుకూలం వధూదుకూలం. ని. 'వధూః స్నుషా నవోఢా స్త్రీ' ఇతి విశ్వః. తథా శోణితబిన్దూన్ వర్షతీతి తథోక్తమ్ ఆర్ద్రమిత్యర్థః. గజాజినం చ కృత్తివాసశ్చ తత్పినాకిన ఇత్యాశయః. ఏతే కదాచిజ్జాత్వపి యోగం సంగతిమర్హతో యద్యర్హతః కిమ్ ఏతత్త్వమేవ చిన్తయేతి పూర్వేణాన్వయః. పాణిగ్రహణకాలే వధూవరయోర్వస్త్రాన్తగ్రన్థిః క్రియతే కృత్తివాససా పాణిపీడనే తు దుకూలధారిణ్యాస్తవ కథం సంఘటిష్యత? ఇతి భావః.

చతుష్కపుష్పప్రకరావకీర్ణయోః
పరోఽపి కో నామ తవానుమన్యతే,
అలక్తకాఙ్కాని పదాని పాదయో
ర్వికీర్ణకేశాసు పరేతభూమిషు. 63

టీ. చతుష్కపుష్పప్రకరావకీర్ణయోః=గృహవిశేషములయందలి పువ్వులగుంపు మీఁదనుంపఁబడినట్టి, తవ పాదయోః=నీయొక్క పాదములయొక్క, అలక్తకాంకాని= లత్తుకచిహ్నలుగాఁగల, పదాని=పాదములను, వికీర్ణకేశాసు=అంతట చల్లఁబడిన వెండ్రుకలుగల, పరేతభూమిషు=శ్మశానభూములయందు, పరోపి=శత్రువయినను, కోనామ= ఎవ్వఁడు, అనుమన్యతే=అంగీకరించును.

తా. మంచిభవనములలో పువ్వులమీఁద లత్తుకచిహ్నలు గలవై యుంచుట కర్హమగు నీపాదములను వెండ్రుకలు వ్యాపించియున్న కాటిలో నుంచుటకు పగవాఁడైన నంగీకరించఁడు సుమా(ఇతరుఁ డంగీకరించునా)? (ఈశ్వరుని పెండ్లాడినచో ఆయన కాటిలో తిరుగునుగాన సహచారిణివై నీవును తిరుగవలసియుండును శివశివా పగవాఁడైన నట్టిదాని కంగీకరించఁడనఁగా నాబోటివానిఁ జెప్ప నేల?).

వ్యా. చతుష్కేతి.—చతుష్కే గృహవిశేషే యః పుష్పప్రకరస్తత్రావకీర్ణయోర్న్యస్తయోః కుసుమాస్తృతదివ్యభవనభూసంచారోచితయోరిత్యర్థః. తవ పాదయోరలక్తకాఙ్కాని లాక్షారఞ్జితాని పదాని పాదాకారాణి పాదన్యాసచిహ్నాని. ని. 'పదం శబ్దే చ వాక్యే చ వ్యవసాయాపదేశయోః పాదతచ్చిహ్నయోః' ఇతి విశ్వః. వికీర్ణా విక్షిప్తాః కేశాః శవశిరోరుహా యాసు తాసు వికీర్ణకేశాసు. 'అతత్స్థం తత్ర దృష్టం చ' ఇతి వచనాత్ 'స్వాఙ్గాచ్చోపసర్జనాదసంయోగోపధాత్' ఇతి వికల్పాన్న జీప్. పరేతభూమిషు ప్రేతభూమిషు శ్మశానేష్విత్యర్థః. పరోఽపి శత్రురపి కోనామానుమన్య

తే న కోఽపీత్యర్థః. నామేతి కుత్సాయామ్. పినాకపాణిపాణిగ్రహణే తస్య పరేత భూసంచారిత్వేన సాహచర్యాత్తవాపి తత్ర సంచారోఽవశ్యంభావీతి భావః.

అయుక్తరూపం కిమతఃపరం వద
త్రినేత్రవక్షః సులభం తవాపి యత్,
స్తనద్వయేఽస్మిన్ హరిచన్దనాస్పదే
పదం చితాభస్మరజః కరిష్యతి. 69

టీ. త్రినేత్రవక్షః = శివునివక్షస్థలము (కౌఁగిలింత), తవ = నీకు, సులభమపి (భవతి)=సులభముగా దొరకుచున్నదై (యగుచున్నది), అతః పరం అయుక్తరూపం = దీనికంటె నయుక్తస్వరూపము, కిం=ఏది, వద=చెప్పుమా, యత్=ఎందువలన, హరిచందనాస్పదే = హరిచందనమునకు తావగు, అస్మిన్ స్తనద్వయే = ఈ స్తనద్వంద్వమందు, చితాభస్మరజః=శ్మశానపుబూడిదకణము, పదం=స్థానమును, కరిష్యతి=చేయును.

తా. శివునివక్షస్థలము నీకు సులభముగా దొరుకును గాని యంతకంటె నయోగ్యత మరియొక్కటి లేదు ఏమందువో? హరిచందనముఁబూసికొన్న యీ నీ స్తనద్వంద్వమున పీనుఁగఁగాల్చినబూడిద యంటుకొనును. దానికి తావగును.

వ్యా. అయుక్తేతి.—త్రినేత్రవక్షః-త్ర్యమ్బకాలిఙ్గనమిత్యర్థః తవ తత్సంబన్ధితయా సులభమపి సుప్రాపం చ భవతీతి శేషః. తవేతి శేషే షష్ఠీ 'న లోకావ్యయ' ఇత్యాదినా కృద్యోగలక్షణషష్ఠ్యా నిషేధాత్. అతఃపరమస్మాత్త్రినేత్రవక్షోలాభాదన్యదయుక్తరూపమత్యన్తాయుక్తం కిం వద న కిఞ్చిదిత్యర్థః 'ప్రశంసాయాం రూపప్' ఇతి రూపప్ ప్రత్యయః. కుతః యదస్మాత్ కారణాద్ధరిచన్దనాస్పదే హరిచన్దనస్యాస్పదే స్థానభూతే ఽస్మిన్ స్తనద్వయే చితాభస్మశ్మశానభస్మ తదేవ రజశ్చూర్ణం కర్తృ పదం కరిష్యతి పదం నిధాస్యతి భర్తుర్భవస్య భస్మాఙ్గరాగాదితి భావః.

ఇయం చ తేఽన్యా పురతో విడమ్బనా
యదూఢయా వారణరాజహార్యయా,
విలోక్య వృద్ధోక్షమధిష్ఠితం త్వయా
మహాజనః స్మేరముఖో భవిష్యతి. 70

టీ. ఇయం చ=ఇదియు, తే=నీకు, పురతః = మొదట, అన్యా విడంబనా = మరియొక నగుబాటు, (అదేదనఁగా?) ఊఢయా = పరిణీతురాలవగునట్టియు, వారణ

రాజహార్యయా=ఏనుఁగపై నెక్కి యూరేగింపు వెడలునట్టి, త్వయా=నీచే, అధిష్ఠితం=ఎక్కఁబడిన, వృద్ధోక్షం = ముసలియెద్దును, విలోక్య = చూచి, మహాజనః = సజ్జనచయము, స్మేరముఖః=చిఱునవ్వుగలమోముగలదై, భవిష్యతి=కాఁగలదు.

తా. నీకు మఱియొక్క వెక్కిరింపు ముందుగానే యగును. ఏన్గపై నూరేగింపుగల నీకు ముసలియెద్దు వాహనము కాగా మహాజనులందఱు నవ్వెదరు.

వ్యా. ఇయమితి.—ఇయం చ తే తవ, పురత ఆదావేవాన్యావిడమ్బనా - పరిహాస ఇత్యర్థః. కా సేత్యత్రాహ-ఊఢయా పరిణీతయా వహేః కర్మణి క్తః. వారణరాజహార్యయా త్వయాఽధిష్ఠితమారూఢం వృద్ధముక్షాణం వృద్ధోక్షమ్ 'అచతుర.' ఇత్యాదినా నిపాతః. విలోక్య మహాజనః సాధుజనః స్మేరముఖః స్మితముఖో భవిష్యత్యుపహసిష్యతి యత్ ఇయమితి పూర్వేణ సంబన్ధః-స్మేరేతి 'నమికమ్పిస్మ్యజస-' ఇత్యాదినా రప్రత్యయః.

ద్వయం గతం సంప్రతి శోచనీయతాం
సమాగమప్రార్థనయా పినాకినః,
కలా చ సా కాన్తిమతీ కలావత
స్త్వమస్య లోకస్య చ నేత్రకౌముదీ. 71

టీ. పినాకినః = శివునియొక్క, సమాగమ ప్రార్థనయా = ప్రాప్తి కోరుటచే, సంప్రతి=ఇప్పుడు, ద్వయం = రెండు, శోచనీయతాం = దుఃఖత్వమును, గతం=పొందినవి, కలావతః = చంద్రునియొక్క, సా=ప్రసిద్ధమగు, కాంతిమతీ = మిక్కిలి కాంతిగల, కళా చ=రేఖయు (బాలచంద్రరేఖయునుసుట), అస్య లోకస్య = ఈలోకమునకు, నేత్రకౌముదీ=కనులకు వెన్నెలగు, త్వంచ=నీవును.

తా. ఈశ్వరుని జేరుటచే నిప్పుడు రెండువస్తువుల విషయమై విచారింపవలసి వచ్చెను. ఇదివఱకే యాయన నాశ్రయించిన చంద్రకళకును ప్రపంచానందకౌముదివగు నీకును, (మునువన్నదో ఒకచంద్రరేఖవిషయము మాత్రము విచారింపవలసె. ఇప్పుడు నీకొఱకును విచారింపవలసి వచ్చెను.)

వ్యా. ద్వయమితి.—పినాకిన ఈశ్వరస్య, సమాగమప్రార్థనయా ప్రాప్తికామనయా-క్రియమాణయేతి శేషః. సంప్రతి ద్వయం శోచనీయతాం శోచ్యత్వం గతం. కిం తదాహ - సా ప్రాగేవ హరశిరోగతా - అత్ర సేతి ప్రసిద్ధార్థత్వాన్నయచ్ఛబ్దాపేక్షా-

దుక్తం కావ్యప్రకాశే. వి. 'ప్రక్రాన్తప్రసిద్ధానుభూతార్థవిషయస్తచ్ఛబ్దో యదుపాదానం నాపేక్షతే' ఇతి. కాన్తిమతీ నిత్యయోగే మతుప్. కలావతశ్చన్ద్రస్య కలా షోడశో భాగశ్చాస్య లోకస్య నేత్రకౌముదీ - నేత్రానన్దనీత్యర్థః. త్వం చ కాన్తిమతీత్వనేత్రకౌముదీత్వవిశేషణయోరుభయత్రాప్యన్వయః; ప్రాగేకైవ శోచ్యా సంప్రతి తు త్వమప్యపరేతి ద్వయం శోచ్యమితి పిణ్డితార్థః శోచ్యత్వం చ నికృష్టాశ్రయణాదితి భావః.

వపుర్విరూపాక్షమలక్ష్యజన్మతా
దిగమ్బరత్వేన నివేదితం వసు,
వరేషు యద్బాలమృగాక్షి మృగ్యతే
తదస్తి కిం వ్యస్తమపి త్రిలోచనే. 72

అవ. కన్య సౌందర్యమును కన్యకామాత ధనమును కన్యకాజనకుఁడు విద్యను పెఱవారగుబంధువు లిష్టాన్నమును వరునికుండుటను కోరుదురు. ఇది లోకులు చెప్పుకొనుపలుకు. అందొక్కటియైన శివునియందు లే దనుచున్నాఁడు.—

టీ. వపుః=(శివునికి) శరీరము, విరూపాక్షం=వికారమైన కన్నులుగలది, (చక్కఁదనములేనిది) అలక్ష్య జన్మతా = తెలియఁబడని పుట్టువుగలవాఁడగుట, (తండ్రి కోరిన కులవిద్యాదులులేవు) దిగంబరత్వేన = దిసమొలగలవాఁ డగుటచేతనే, వసు = ధనము, నివేదితం=తెలుపఁబడెను. (తల్లి కోరిన ధనమైనను లేదు. డబ్బున్నవాఁడు బట్టలేక తిరుగుకర్మమేమి? ఇష్టాన్నము గోరినవారికి నీయాకారమే చెప్పును) బాలమృగాక్షి = లేడిపిల్లవంటి కనులుగలదానా! వరేషు యత్ మృగ్యతే = వరులయందేది వెతకఁబడునో, తత్=అది, (అన్నిగుణములు లేకున్నను) త్రిలోచనే = హరునియందు, వ్యస్త మపి = ఒక్కటైనను, అస్తికిం=ఉన్నదా? (లేదనుట.)

కండ్లు చక్కనివాఁడు కాఁడని దెసమొల బీదవాఁ డనిశాస్త్రము లేనివాఁడని ఇష్టాన్నాదులు లేనివాఁడని చెప్పుచున్నవి. ఒకటికాకున్న నొక్కటైనలేదు. ఏమి పెండ్లాడెద వతనిని యాయత్నముమానుమనుట.

అవ. 'కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతమ్, బాన్ధవాః కులమిచ్ఛన్తి మృష్టాన్నమితరే జనాః' ఇతి లోకానామాభాషణమ్; తత్ర కిఞ్చిదపి నాస్తీత్యాహ.—

వ్యా. వపురితి.—వపుస్తావదస్య విరూపాణి వికృతరూపాణ్యక్షీణి నేత్రాణి యస్య తద్విరూపాక్షం 'బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్ షచ్' ఇతి షచ్ప్ర

